TPL 301

# శైవలిని

రచన: బంకింబాబు

అనువాదం: కె. రమేశ్

ంశ్వర గ్రంథమండలి

[illegible]

TPLA120B130

# శైవలిని

గంగానదీ తీరమందున్న మామిడితోటలో ఒక బాలుడు సాయం సమయపు గంగానది కలకల ధ్వనిని వింటూ కూర్చున్నాడు. అతని పాదాల ముందున్న మెత్తని శయ్యలాంటి పచ్చికపై ఒక బాలిక పడుకొని అతని ముఖంలోకి చూస్తోంది. మధ్య మధ్య ఆకాశమువైపు, నదివైపు, చెట్లవైపు చూస్తూ ఉన్నప్పటికీ, తిరిగి అతని ముఖంలోకే చూపులు మరల్చుతోంది. బాలునిపేరు ప్రతాప్ ; బాలికపేరు శైవలిని. ప్రతాప్ వయస్సు అప్పటికి పది పన్నెండు సంవత్సరాలుంటుంది, శైవలిని వయస్సు ఏడెనిమిదేండ్లుంటుంది.

చాతకపక్షి నెత్తిపైనుంచి పిలుస్తూ పోయింది. దాని పిలుపు తరంగాలుగా గగన మండలాన్ని కప్పేసింది. దానిని అనుకరించి శైవలిని తనూ కూస్తోంది. ఆ మెకూత గంగానదీ తీరాన ఉన్న మామిడితోటలో ప్రతిధ్వనించింది. గంగానది కల కలరవం ఆ వ్యంగ్య సంగీతంలో మిళితమై పోయింది.

తనవలెనే సుకుమారంగా, కోమలంగా ఉన్న వనపుష్పాలను ఏరి బాలిక తన మృదు హస్తాలతో మాలగుచ్చి బాలుని మెడలో వేసింది. తిరిగి దానిని తానే తీసుకొని తనజడలో తురుముకొంది ; మళ్లీ దానిని బాలుని మెడలో వేసింది. ఇంతకూ ఆ మాలను ఎవరు ధరించాలో నిశ్చయం కాలేదు ; ఆ సమీపంలో మేస్తూఉన్న ఒక ఆవును చూచి శైవలిని వివాదంగా ఉన్న ఆ మాలను దాని కొమ్ములకు తగిలించినది. అంతటితో

ఆ సమస్య తీరిపోయింది. నిత్యమూ వీరిద్దరిమధ్య ఇలాగే జరుగుతూ ఉండేది. అప్పుడప్పుడు మాలలకు బదులు గూళ్ళలో ఉండే పక్షిపిల్లల్ని పడగొడుతూ ఉండేవారు లేదా బాగా కాపుమీదున్న మామిడిచెట్ల కాయల్ని రాలగొట్టేవారు.

సాయంసమయపు వినీల నిర్మలాకాశంలో నక్షత్రాలు ఉదయించినప్పుడు ఇద్దరూ నక్షత్రాలను లెక్కిస్తూ కూర్చునేవారు. ఫలానా నక్షత్రాన్ని ముందుగా ఎవరు చూశారు? ముందుగా ఉదయించిన నక్షత్రం ఏది?

'నీకెన్ని నక్షత్రాలు కనబడుతున్నాయి? నాలుగా? బలే' నాకు అయిదు నక్షత్రాలు కనబడుతున్నాయి. అదిగో, అదొకటి, ఇదొకటి, అక్కడొకటి, అవతల ఒకటి, దానికిఇవతలగా ఒకటి, అంటాడు బాలుడు అవంతా అబద్ధం! శైవలినికి వాటిలో మూడు నక్షత్రాలు కనిపించనే కనిపించవు.

సాయంత్రం నీరెండ పడేవేళ గుంపులుగా పడవలు వస్తూ ఉంటాయి. తెడ్లువేస్తున్నచోట తరంగాలుగా లేస్తున్న నీరు బంగారం కలిసినట్లు మెరిసిపోతూ ఉంటుంది. పడవలు! పడవలు!! ఆ వెళ్తున్న పడవలెన్నో చెప్పుచూద్దాం! పదహారా! పందెం ఎంత? అవి పద్దెనిమిది పడవలు. శైవలినికి లెక్క తెలియదు; ఒకసారి లెక్కించినపుడు తొమ్మిదివుంటే మరొకసారి లెక్కించినపుడు ఇరవై ఒకటి ఉన్నాయి. ఆ తరువాత వారిద్దరూ వాటిల్లో ఒకపడవవైపు తదేకంగా చూచేవారు. ఆ పడవలో ఎవరున్నారు? ఎక్కడికి వెళుతున్నారు? ఎక్కడి నుంచి వస్తున్నారు?

ప్రేమ ఉదయించింది ఈవిధంగానే. దానిని మీరు

ప్రేమ అనగలిగితే అనండి లేదా మానెయ్యండి. పన్నెండేండ్ల నాయకుడు – ఎనిమిదేళ్ళ నాయకి.

పిల్లల్లా ప్రేమించుకోవడం మరెవ్వరికీ తెలియదు. చిన్నతనపు ప్రేమలో సాన్నిహిత్యం చాలా ఎక్కువగా ఉంటుంది. బాల్యంలో ప్రేమించుకున్నవారు, యౌవ్వనం వచ్చే సరికి వారిలో ఎందరు పరస్పరం కలుసుకో గలుగుతున్నారు? వారిలో ప్రేమకు అస్థాలుగా ఉండగలిగేది ఎందరు? వృద్ధాప్యం వచ్చినప్పుడు బాల్యంలోని ఈ ప్రేమ స్మృతిగా మాత్రమే మిగిలి ఉంటుంది; మిగిలినదంతా మరుగున ఉండిపోతుంది. కాని, ఆ స్మృతి ఎంత మధురంగా ఉంటుంది ?

ఆ బాలిక ముఖమండలం అందంగా ఎంత ముద్దొస్తూ ఉంటుందో బాలురందరూ ఎప్పుడో ఒకప్పుడు గమనించే ఉంటారు – ఆమె కన్నుల్లో అర్థంకాని అతీతమైన అందమేదో నిండి ఉండేది. బాలురు ఆటలలో అనేకసార్లు ఆమె ముఖంలోకి చూస్తూ వుండిపోయేవారు– ఆమె వచ్చేపోయే మార్గంలో కూడా పొంచి ఉండి ఆమెను తనివితీరా చూచేవారు. ఆమెను ప్రేమించేవారు, కానీ ఎప్పుడూ ఎవ్వరూ ఆమెను అర్థం చేసుకోలేరు. ఆ తర్వాత అందమైన ముఖము, ఆమె సహజ అమాయకమైన చూపులు కాల ప్రవాహములో ఎక్కడికో లీనమైపోయాయి. వాటికోసం ప్రపంచమంతటా ఎంత వెదకినా– చివరకు ఆ స్మృతి మాత్రమే మిగిలిఉంది. బాల్యప్రేమలో ఏదో గంభీరమైన గాఢసంబంధం ఉంటుంది.

ప్రతాపునికీ తనకూ వివాహం జరుగుతుందనే శైవలిని

మనస్సులో అనుకునేది. కాని ఈవివాహం జరగదని ప్రతాప్‌నికి తెలుసు. చాలాదూరసంబంధం అయినప్పటికీ ఇద్దరూ ఒకేవంశానికి చెందినవారు. శైవలిని పొరబాటు పడింది ఇక్కడే.

శైవలిని నిరుపేద బాలిక. తల్లితప్ప ఆమెకీ ప్రపంచంలో మరువ్వరూ లేరు, మరే ఆధారమూలేదు, ఉన్నదల్లా ఒక గుడిసె, శైవలిని సౌందర్యమూ మాత్రమే.

ప్రతాపుడుకూడా ధనహీనుడే.

పెరిగి పెద్దదవుతున్నకొద్దీ శైవలిని సౌందర్యం షోడశ కళలతో పరిపూర్ణం కాజొచ్చింది. కాని ఇంకా వివాహం కాలేదు. వివాహానికి అనేక ఖర్చులవుతాయి. ఆఖర్చులన్నీ ఎవరు భరిస్తారు? ఆ అడవిలో అన్వేషించి ఆ సౌందర్యం అమూల్యమని గుర్తించి స్వీకరించే వారెవరున్నారు?

మనోవికాసం కలిగినకొద్దీ ప్రతాప్‌ను పొందే అవకాశం లేదని శైవలిని స్పష్టంగా గ్రహించ సాగింది.

ఇద్దరూ కలసి ఏమేమో చర్చించుకునేవారు. మరెవ్వరికీ తెలియకుండా చాలారోజుల వరకు అతి రహస్యంగా మాట్లాడుకునేవారు. చివరికి ఇద్దరూ ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత గంగాస్నానానికి బయల్దేరి వెళ్లారు. గంగానదిలో అనేకమంది ఈతలు కొడుతున్నారు.

"శైవలినీ ! ఈత కొడదాంరా !" అన్నాడు ప్రతాప్.

ఇద్దరూ ఈతకు ఉపక్రమించారు. ఈతలో ఇద్దరూ దిట్టలే. వారితో పోటీగా ఈదగలిగినవారు ఆ గ్రామంలోనే లేరు. అది వర్షాకాలం; గంగా ప్రవాహము నిండుగా ప్రవ

హిస్తూ ఉంది. వాళ్ళిద్దరూ ఆ మహాప్రవాహాన్ని చీల్చుకొని చరచర ముందుకు ఈదుతూ సాగిపోయారు. స్వచ్ఛమైన నీటి ప్రవాహంలో ఆ తరుణ శరీరాలు వెండి ఉంగరంలోని రెండు రత్నాలవలె మెరిసిపోతున్నాయి. ఈదుకుంటూ వాళ్ళిద్దరూ ఇంకా ముందుకు సాగిపోయారు. ఒడ్డున ఉన్న జనం వాళ్ళిద్దరినీ తిరిగిరమ్మని కేకలు వేశారు. కానీ వాళ్లు అవేమీ విన్పించుకోకుండా అలాగే ముందుకు సాగిపోతు న్నారు. మరొకసారి అందరూ కేకలు వేశారు - మందలిం చారు - తిట్టారు - వాళ్లు ఇవేమీ లెక్కచేయలేదు. మరి కొంత దూరం ఈదుకుంటూ వెళ్ళిన తరువాత "శైవలినీ మన వివాహం ఇక్కడే" అని అన్నాడు ప్రతాప్.

"అవును, ఇంకా దూరం ఎందుకు, ఇక్కడే మన వివాహం'' అంది శైవలిని.

ప్రతాప్ నీటిలో మునిగిపోయాడు.

శైవలిని మునగలేదు. అంతలోనే ఆమెకు భయం తోచింది.

వ్యర్థంగా ఎందుకు చనిపోవాలి? ప్రతాప్‌తో నాకేమిటి సంబంధం? నాకు భయంగా ఉంది, నేను చావలేను" అని తనలో తానే ఆలోచించింది శైవలిని.

ఆమె నీటిలో మునిగిపోకుండా ఈదుకొని ఒడ్డును చేరింది.

అప్పుడే ఆ ప్రక్కగా పోతున్న పడవలోని ఒకమనిషి ప్రతాప్ నీటిలో మునిగిపోవటం చూశాడు. వెంటనే అతడు నీటిలోకి దుమికి ఆ వైపుగా వెళ్లాడు. ఆ పడవలో ప్రయాణం చేస్తున్నవ్యక్తి చంద్రశేఖరశర్మ.

చంద్రశేఖరుడు ఈదుకుంటూ వెళ్లి ప్రతాప్‌ను పడవ మీాదికి చేర్చాడు. తరువాత పడవను ఒడ్డుకుచేర్చి చంద్రశేఖరుడు ప్రతాప్‌ను అతని ఇంటికి వెంటబెట్టుకొని వెళ్లాడు.

ప్రతాపునితల్లి చంద్రశేఖరుని కాళ్ళపై బడి ఆ రోజుకు అక్కడే ఉండవలసిందని కోరింది. మనసులోని ఉద్దేశ్యం ఏమిటో చంద్రశేఖరుడు ఏమీా తెలుసుకోలేదు.

ఆ తరువాత శైవలిని మరెప్పుడూ ప్రతాపునికి తన ముఖం చూపించలేదు. కానీ, చంద్రశేఖరుడు ఆమెను చూచాడు - ఆమె సౌందర్యానికి ముగ్ధుడై పోయాడు.

చంద్రశేఖరుని అప్పటి పరిస్థితి కూడా చాలా అయోమయంగా ఉంది. వయస్సు ముప్పది రెండేళ్లు, ఇంకా వివాహం చేసుకోలేదు. వివాహం విజ్ఞానార్జనకు అంతరాయం కలిగిస్తుందనే ఆలోచనతో అతడు ఇంతవరకు ఆ విషయమే ఆలోచించలేదు. కానీ, ఒక సంవత్సరం క్రితం అతని తల్లి చనిపోయిననాటి నుంచి వివాహం చేసుకోనందువల్లనే అతని విజ్ఞానార్జనకు అంతరాయం కలుగుతూ ఉంది. స్వయంగా వంటచేసుకోవడం మొదలగు పనులవల్ల చదువుకు ఆటంకం కలుగుతుంది. చదువు ఒక్కటేకాదు, దేశసేవ, దైవపూజ అన్నీ అతడే చూసుకోవలసి వచ్చింది. వాటివల్ల ఇంటిపనులు సరిగ్గా సాగేవికావు. ఒక్కొక్కరోజున వంట చేసుకోడానికి

కూడా తీరిక దొరికేది కాదు. ఎంత వెదకినా కావలసిన పుస్తకాలు సమయానికి దొరికేవి కాదు. డబ్బు ఎంత ఖర్చవుతున్నది, ఎవరెవరికి ఇచ్చిందీ, ఇవేమీ గుర్తుండేవి కావు. అదీగాక పెద్దపెద్ద ఖర్చులేవీ ఉండేవికావు. గనుక డబ్బు ఇబ్బంది ఉండేదికాదు. వివాహం చేసుకుంటే కొన్ని పనుల నుంచి విముక్తి లభిస్తుందని చంద్రశేఖరుడు ఆలోచించాడు. వివాహం చేసుకున్నప్పటికి అందమైన అమ్మాయిని చేసుకోవద్దని అతడు నిశ్చయించుకున్నాడు. అందమైన స్త్రీని పెళ్ళాడితే మనస్సు ఎప్పుడూ ఆమె మీదే ఉంటుందని అతని ఉద్దేశ్యం. సంసార సుఖాల్లో తన్మయుడై పడి ఉంటే పనులు సక్రమంగా సాగవని కూడా అతనికి భయం.

ఇలాంటిస్థితిలో ఉన్నప్పుడే అతడు శైవలినిని చూచాడు. అతని నిగ్రహం కాస్తా గాలికి ఎగిరిపోయింది. అన్నీ ఆలోచించి, విషయాలన్నీ చర్చించుకొని చివరికి పెళ్ళికి కావలసిన ఏర్పాట్లన్నీ తానే చూసుకొని శైవలినిని వివాహమాడాడు. అందానికి ముగ్ధులు కాని వారెవ్వరు?

ఈ వివాహం జరిగిన ఎనిమిది సంవత్సరాల అనంతరం మన కథ ప్రారంభ మవుతుంది.

## 3

బెంగాలు, బీహారు, ఒరిస్సాలను పాలించు నవాబు ఆలీజా కాశిమ్‌ఖాన్ ముంగేరు కోటలో ఉండేవాడు. ఆకోటలో రంగమహాలు అని పిలవబడే అంతఃపురం ఎంతో అందంగా

ఉండేది. రాత్రి మొదటిజాము. గచ్చుమీద మెత్తని తివాచి పరచి ఉంది. సుగంధ తైలంతో వెలిగే రజత దీపకాంతి, కమ్మనిపూల వాసనలు మహలులో వ్యాపించాయి. పొట్టిగా ఉన్న ఒక యువతి మఖమల్ దిండును ఆనుకొని పడుండి "గులిస్తాన్" (ఒక ఫారసీ గ్రంథము) చదువుతూ ఉంది. ఆమె వయసు పదిహేడేళ్ళున్నప్పటికీ, చిన్న బాలికవలె కన్పిస్తుంది, కురచకు తగినట్లే తలకూడ చాలాచిన్నది. యవ్వనంలో ఉన్నప్పటికీ ఆమెలో బాలిక లక్షణాలే ఎక్కువ అగుపిస్తాయి. చదువుతూనే మధ్యమధ్య లేచి ఎవరికోసమో ఎదురుచూస్తూ తనలో తానే ఏదో గొణుక్కుంటూ ఉంది. ఒక్కొక్కసారి "ఇంకా రాలేదెందువల్లనో?" అనీ, "అయినా ఎందుకు వస్తారు? ఉన్న వెయ్యిమంది దాసీలలో నేనూ ఒక దానిని, నాకోసమని ఇంత దూరం రావలసిన అవసరం ఏముంది ? అనీ పైకే అనేది. మళ్లీ తన చదువులో మునిగి పోయేది.

కాసేపు చదివిన తరువాత "మనస్సేమీ బాగుండలేదు. వారు రాకపోయినా, నేను మాత్రం వారిని స్మరిస్తూనే ఉన్నాను. అయినా, ఇంతమంది దాసీలలో ప్రత్యేకంగా నేనెలా గుర్తుంటాను" అని అంది. చదవటానికి ప్రయత్నించి ఒక క్షణం తరువాత పుస్తకాన్ని దూరంగా పారవేసి "ఆ భగవంతుడు ఇలా ఎందుకు చేస్తాడో? ఒకరు వేరొకరికోసం ఎదురుచూస్తూ ఎందుకు పడి ఉండాలి? భగవంతుని కోర్కెకూడా అదే అయితే తాను కోరే వ్యక్తి తన నెందుకు ప్రేమించడు? అందని దానికోసం అర్రులు చాచటం ఎందుకు? పూలతీగ లాంటి నేను ఒక ఖర్జూరమాని మీదికి ప్రాకాలని కోరటం

ఎందుకో? అని అనుకుంది. తరువాత ఆయువతి లేచి నిలబడింది. తీర్చి దిద్దినట్లుండే అందమైన విగ్రహం; చిన్న తలమీదినుంచి నల్లత్రాచుల గుంపువలె కురచగా ఉండే జుట్టు భుజంమీద పడుతూ ఉంది. బంగారు వల్లెవాటు మధురమైన సువాసనలు విరజిమ్ముతూ రెపరెపలాడింది. ఆమె కదలికతోనే మహాలులో సౌందర్యపు టలలు లేచినట్లుంది. గంభీర జలరాశిలో కొద్ది కదలిక వల్లనే చిరుతరంగాలు లేచినట్లు మహాలులో సౌందర్యపు టలలు నర్తించాయి.

తరువాత ఆ సుందరి ఒకచిన్నవీణను తీసుకొని మీటింది, శ్రోతకు భయపడి పాడుతున్నట్లు మృదు మధుర స్వరంతో నెమ్మదిగా పాడనారంభించింది. ఇంతలో ద్వారపాలకుడు వచ్చి నమస్కరించాడు, బయట సైనికుల అడుగుల చప్పుడు విన్పించింది. యువతి త్రుళ్లిపడి లేచివెళ్లి ద్వారంలో నిలబడింది. నవాబుగారి శకటం వచ్చి ద్వారం ముందు ఆగింది. నవాబు మీర్ కాశిమ్ ఆలీఖాన్ శకటము దిగి లోనికి వచ్చారు.

నవాబు ఆసనం మీద ఆసీనుడై "దలసీబీబీ, ఇప్పుడు నువ్వు పాడుతూఉన్న పాట ఏది?" అని ప్రశ్నించాడు. ఆ యువతిపేరు 'దాలతున్నీసా' నవాబుగారు ఆమెను ముద్దుగా 'దలసీ' అనే అంటారు.

దలసీ సిగ్గుతో తలవంచుకుంది, ఏమీ జవాబు చెప్పలేదు. దలసీ దురదృష్టమనే చెప్పాలి. "నువ్వు ఇంతకుముందు పాడుతూఉన్న పాటను మళ్లీ ఒకసారిపాడు, మేము వింటాం" అన్నాడు నవాబు.

అప్పుడే చాలా గడబిడ జరిగింది. వీణ తంత్రులు ఆమె

వశంలో లేవు, సరియైన శ్రుతి కుదరటం లేదు. వీణను ఆవలకు నెట్టి దలనీ మరొక వాయిద్యాన్ని అందుకొంది. అదికూడా శ్రుతి కలవటంలేదు. అదిచూచి నవాబు "పోనీ, అలాగేపాడు" అన్నాడు. తనకు శ్రుతి చేయటమే తెలియదని నవాబు అనుకుంటున్నాడేమొనని దలనీ అనుకుంది. దానితో ఆమె ఎంత ప్రయత్నించి నప్పటికీ పాడలేక పోయింది; నోరు విప్పే సాహసమే లేకుండా పోయింది దట్టంగా మేఘాలు ఆవరించి ఉన్నప్పుడు ఇంకా వికశిస్తుంది, ఇంకా వికసిస్తుంది అని ఎంత ఎదురు చూసినా స్థల పద్మం వికసించదు; ఇదుగో అదుగో అని ఎంత ఆశించినప్పటికీ భీరువైన కవియొక్క కావ్య కుసుమం ఎంతకూ వికసించదు; అభిమాన సమయాలందు మానినీ మణుల నోటి నుంచి ఎంత ప్రయత్నించినా ప్రేమ సంబోధన వెలువడదు.

ఉన్నట్లుండి దలనీ వీణను ఆవలకు నెట్టివేసి "నేను పాడను" అని అంది.

నవాబు ఆశ్చర్యపడుతూ "ఎందుకని ? కోపం వచ్చిందా ఏం ?" అని అడిగాడు.

"కలకత్తాలో ఆంగ్లేయులు పాటలు పాడుతూ వాయించే వాయిద్యాన్ని తెచ్చి ఇచ్చినప్పుడే మీాముందు పాట పాడుతాను; లేనిచో నేనిక ఎప్పుడూ పాట పాడను" అంది దలనీ.

మీార్ కాశిమ్ నవ్వుతూ "ఆ మార్గంలో అవరోధా లేవీ ఎదురవ్వకుండా ఉంటే అలాగే తెచ్చియిస్తాను" అన్నాడు.

"అవరోధాలు ఎందుకు ఎదురవుతాయి?" అని ప్రశ్నించింది దలనీ.

నవాబు విచారంగా "వారితో విరోధం వచ్చినట్లే అని భావిస్తున్నాను. సంగతులన్నీ నువ్వు వినలేదా?" అన్నాడు.

"విన్నాను" అని దలనీ మౌనం వహించింది.

"దలనీ, చాలవిచారంగా కనిపిస్తున్నావు. నువ్వు ఆలోచించే దేమిటి?" అని అడిగాడు నవాబు.

దలనీ - ఇంగ్లీషువారితో వైరం తెచ్చుకున్న వాళ్లెవరైనా సరే తప్పక ఓడిపోతారని ఒకనాడు మీరే అన్నారు. అలాంటప్పుడు వారితో మీకు వైరం ఎందుకు? నేను చిన్న దానిని, మీదాసీని, ఇటువంటి విషయాలు మీకు చెప్పతగను. కానీ ప్రభువులు దయతో నన్ను ప్రేమిస్తున్నారు గనుక చెప్పక తప్పటం లేదు.

నవాబు - నిజమే దలనీ, నేను నిన్ను ప్రేమిస్తున్నాను, నిన్ను ప్రేమించినట్లు నేనింతవరకు మరే స్త్రీని ప్రేమించలేదు. ఇకముందు ప్రేమిస్తాననీ అనుకోవడం లేదు.

దలనీ శరీరం పులకించింది. కొద్దిక్షణాలు ఆమె మౌనం వహించింది, కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. తరువాత కన్నీరు తుడుచుకొని "ఇంగ్లీషువారితో వైరంవస్తే ఓడిపోతామని తెలిసి కూడా ప్రభువులు వారితో ఎందుకు విరోధం వహిస్తున్నారు?" అని అడిగింది.

కాశిమ్ - అదితప్ప నాకు మరొక మార్గమేదీ కన్పించటం లేదు. నువ్వు పూర్తిగా నాదానివేగనుక నీతో యదార్థం చెప్పుతున్నాను. ఆయుద్ధంవల్ల నారాజ్యం పోతుందనీ, ప్రాణాలు కూడా పోవచ్చునని నాకు తెలుసు. అయితే

మరి యుద్ధం ఎందుకు అని అడుగుతావా! ఇంగ్లీషు వారి చేష్టల్లోనూ, వారి నడతలోనూ తామే చక్రవర్తుల మయినట్లూ, నేనేమీ కానట్లే వ్యవహరిస్తున్నారు. నేను రాజ్యాధికారిని కానప్పుడు ఆ రాజ్యంలో నా అవసరం ఏమి ఉంటుంది? ఇంతే కాదు - మరొక సంగతి - మేమే పరిపాలకులం అని వాళ్లంటారు; కానీ ప్రజల్ని పీడించడం మాత్రం మావంతు. ప్రజాక్షేమం కోసం పరిపాలన చేయలేక పోయినప్పుడు ఆ రాజ్యాన్నే వదలి వేస్తాను. అర్థం లేకుండా పాపాలుచేసి ఆ కళంకాన్ని నేనెందుకు మోయాలి ? అలా చేయడానికి నేను సిరాజుద్దౌలానూ కాను, మీర్ జాఫర్నీ కాను.

దలనీ మనసులోనే బెంగాలు ప్రభువును అనేకవిధాల కీర్తించింది.

"ప్రభూ, మీ ఉద్దేశ్యం విన్నతరువాత నేను మరేమీ చెప్పలేక పోయినాను. కాని, ప్రభువులకు నాదొక విన్నపము. మీరు రణరంగానికి మాత్రం వెళ్ళవద్దు" అంది దలనీ.

కాశిమ్ — ఇటువంటి విషయాల్లో బెంగాలు ప్రభువు కర్తవ్యం స్త్రీల సలహాలు వినటమేనా? లేక దీనిని గురించి సలహా చెప్పటం నీవంటి బాలిక కర్తవ్యమా ?

మీర్ కాశిమ్ మాటవిని దలనీ నివ్వెర పోయింది, నిశ్చేష్టురాలై మరుక్షణమందే తెప్పరిల్లి "నేను తెలియక చెప్పాను; ప్రభువులు మన్నించండి. స్త్రీ మనసు త్వరగా తెలుసుకోలేదు, అందుకనే అలా చెప్పాను. కానీ. నాదొక ప్రార్థన, ప్రభువులు మన్నించాలి" అంది.

"ఏమిటది ."

"ప్రభువులు తమవెంట నన్నుకూడా యుద్ధరంగానికి తీసుకువెళ్లాలి."

"ఎందుకు, నువ్వుకూడా యుద్ధం చేస్తావా ఏం ? గుర్గన్ ఖాన్‌ను తొలగించి అతని స్థానంలో నిన్ను నియమించ మంటావా ?"

నిశ్చేష్టురాలై దలనీ ఏమీ మాట్లాడలేక పోయింది.

అప్పుడు మీర్ కాశిమ్ అది గమనించి ప్రేమతో "యుద్ధరంగానికి రావాలని ఎందుకు అనుకుంటున్నావు ?" అని అడిగాడు

"ప్రభువుల వెంట ఉండాలనే కోర్కెతో."

మీర్ కాశిమ్ ఆమె కోర్కెను అంగీకరించలేదు. దలనీ చెప్పిన వాటిని నిరాకరించాడు.

అప్పుడు దలనీ మందహాసంచేస్తూ "ప్రభూ ! తమకు జ్యోతిషం తెలుసునా ? యుద్ధసమయంలో నేను ఎక్కడ ఉంటానో లెక్కవేసి చెప్పండి" అని అంది.

"కలము, సిరాబుడ్డి తీసుకురా" అన్నాడు మీర్ కాశిమ్ కూడా నవ్వుతూ. ఒకసేవకుడు బంగారు కలాన్ని, సిరాబుడ్డినీ తెచ్చియిచ్చాడు. మీర్ కాశిమ్ హిందువులవద్ద జ్యోతిష్యాన్ని నేర్చుకున్నాడు. ఏవేవో లెక్కలువేసి చూసి చివరకు కాగితాన్ని దూరంగా విసరివేసి విచారంగా కూర్చున్నాడు.

"ఏమి చూశారు ?" అని అడిగింది దలనీ.

"చాలా ఆశ్చర్యకరమగువిషయాన్నే తెలుసుకున్నాను. అది నువ్వు వినకూడదను" అని మీర్ కాశిమ్ లేచి బయటకు వచ్చాడు. అప్పటికప్పుడే మీర్ మున్షీని పిలిపించి "మున్షీ! ధా

బాదు సమీప గ్రామమైన వేదగ్రామంలో చంద్రశేఖరుడను ఒక బ్రాహ్మణపండితుడు ఉన్నాడు. వాడు నాకు జ్యోతిష్యాన్ని నేర్పాడు. ముర్షిదాబాదులోని మన హిందూ కర్మచారి ద్వారా వారికి కబురు పంపి ఇంగ్లీషువారితో ఇప్పుడు యుద్ధం వచ్చేటట్లయితే యుద్ధసమయంలోనూ, ఆ తరువాతనూ దలనీబేగం ఎక్కడ ఉంటుందో అడిగి తెలుసుకోవాలి.” అని ఆజ్ఞాపించాడు.

మీర్‌మున్షీ అలాగే చేశాడు. చంద్రశేఖరునికోసం వెంటనే మనిషి వెళ్లాడు.

# 4

భీమా అను విశాలమైన తటాకం చుట్టూ గుబురుగా తాటిచెట్లున్నాయి. తటాకంలోని నల్లని నీటిమీద అస్తమించుచున్న సూర్యుని బంగారువన్నె కిరణాలు పడుతున్నాయి. నీటిమీద పడుతున్న ఎండతోపాటు లతలల్లుకొన్న తాటిచెట్ల నల్లని నీడలుకూడా ప్రతిబింబిస్తున్నాయి. ఒకరేవులో వరుసగా ఉన్న చెట్లకు దట్టంగా లతలు అల్లుకొని దాని నొకగుబురుగా చేశాయి. రేవులో స్నానంచేసే కులస్త్రీలచుట్టూ ఆ లతలు కొమ్మలువంగి విస్తరిల్లి ఉంటాయి. ఆ విధంగా ముసురుకొని ఉండే దుసక చీకటిలో శైవలిని, సుందరి నీళ్ళబిందెలు పట్టుకొని నీళ్ళతో ఆటలు ఆడుతున్నారు.

యువతులతో నీళ్ళకు ఆటలేమిటి ? అని మాకెలా తెలుస్తుంది; మేమున్న నీళ్ళుకారుగదా ! సౌందర్యాన్ని-చూసి

కరిగి నీరైనవారే, బిందె దెబ్బతో తరంగాలుగా లేచి తరుణీ మణుల బాహువులనుండి వ్రేలాడు ఆభరణాలతో తాళం కలిపి ఎలా నాట్యం చేస్తుందో చెప్పగలరు. కమలముల మాలను వక్షముపై ధరించి తన్మయత్వంతో ఊగిపోతూ నర్తించటమూ, ఈతయందు ఆసక్తిగల చిన్న చిన్న పక్షులను తరంగాలపై తేలియాడిస్తూ నాట్యంచేయడమూ, యువతులను చుట్టుముట్టి వారి బాహువుల్లోనూ, భుజాలమీదా, కంఠసీమ యందూ అలలుగా లేచి దోబూచులాడుతూ నృత్యంచేయటం ఎలాగో, ఆ తరువాత యువతులు బిందెలను ముంచుతూ మలయమారుతానికి ఏ విధంగా ఆత్మసమర్పణ చేస్తారో ఆ జలరూపమెత్తిన వారికే అర్థమవుతుంది. గడ్డమువరకు నీటిలో మునిగిదొండపండులాంటి ఎర్రని పెదవులతో నీటిని తాకుతూ పుక్కిలి పడతారు; సూర్యునివైపు చిమ్ముతారు. నీరుకూడా ఎండగా ఉన్నప్పుడు అనేక వందల సూర్యప్రతిబింబాలను యువతికి కానుకగా ఇస్తుంది; యువతి కొద్దిగా కాలుచేతులు కదిలిస్తే చాలు నీరు ఉత్సాహంతో నాట్యంచేస్తుంది. ఆ జల తరంగాలపై యువతి హృదయం తేలియాడుతూ ఉంటుంది. యువతుల హృదయాలూ, నీరూ సమానమే. నీరు చంచల మైనది, ముల్లోకాలను చలింపజేయు స్త్రీ హృదయమూ చంచలమైనదే. నీటిలో గీసినగీత నిలువదు, యువతి హృద యంలో మాత్రం నిలుస్తుందా?

బంగారువన్నె కాంతి తటాకపు నల్లని నీటిలో కరిగి పోయి చూస్తూ ఉండగానే క్రమంగా నల్లబడిపోయింది. అప్పుడు తాటిచెట్ల తలలు మాత్రం బంగారు కిరీటాలు ధరించి

నట్లు మెరిసిపోయాయి.

"సాయంత్రమయింది. ఇక ఇంటికి వెళ్ళిపోదాం" అంది సుందరి.

"ఇక్కడ ఎవ్వరూ లేరు, నెమ్మదిగా ఒక పాటపాడు" అంది శైవలిని.

"ఛీ ! పాపం ! ఇంటికి పద."

"సఖీ ! ఇంటికి వెళ్ళను, అదేమిమాట ?

ఆహా ! అడుగో, వచ్చుచున్నాడు నా మదనమోహనుడు !

అయ్యో ! ఇంటికి వెళ్ళను, అవేం మాటలు ?"

"ఇంకేం కావాలి, మృత్యువు ! మదనమోహనుడు ఇంటివద్ద ఉన్నాడు, అక్కడికే వెళ్దాం రారాదూ ?"

"వెళ్ళి అతనితో మీ మదనమోహిని భీమాతటాకం లోని శీతలజలాన్ని చూసి దానిలో మునిగి చనిపోయిందని చెప్పు."

"నీ పరిహాసాలు కట్టిపెట్టు. చీకటి పడింది. నేనిక ఒక్క క్షణం గూడా ఇక్కడ ఉండను. అదీగాక ఇవాళ ఇటుగా ఒక ఆంగ్లేయుడు వస్తాడని క్షేమూగారి అమ్మ చెప్పింది.

"వస్తే నాకూ నీకూ ఏం భయం ?" అంది శైవలిని.

"అదేం మాట ? నువ్వురాకపోతే నేనే వెళతాను."

"నేను రాను. నువ్వు వెళ్ళు."

సుందరి కోపంతో గబగబ బిందె నింపుకొని ఒడ్డుకు వచ్చింది. తరువాత శైవలిని వైపు తిరిగి "అయితే, నువ్వు ఒక్కదానివే సాయంత్రం వేళ ఈ చెరువు దగ్గర ఉంటానంటావా?"

అని అడిగింది.

శైవలిని అందుకు ఏమీ మాట్లాడలేదు. చేతితో సైగ చేసింది; సుందరి ఆమె సైగ చేసినవైపు చూసింది; కొంప మునిగింది, ఆవలి గట్టున ఉన్నదెవరు! సుందరి నోటివెంట మాటరాలేదు, బిందెను అక్కడే వదలి గట్టిగా ఎగశ్వాసపీల్చి అక్కడినుండి పరుగెత్తింది. ఇత్తడిబిందె దొర్లుకుంటూ తటాక జలంలోకి చేరుకుంది.

సుందరి ఆవలి గట్టుమీద తాటిచెట్టుక్రింద ఒక ఆంగ్లేయుణ్ని చూసింది. శైవలిని ఆంగ్లేయుణ్నిచూసి కదలనూ లేదు, మెదలనూ లేదు; నీటిలోనే ఉండిపోయింది. రొమ్ము లోతు నీటిలో తడి చీరను తలనిండా ముసుగువేసుకొని వికసించిన పద్మంవలె నీటిలో నిలబడి ఉంది. మేఘాల్లో మెరిసి నిలిచిపోయిన మెరుపు తీగవలె — భీమాతటాకపు శ్యామ జలతరంగాలమధ్య ఈ బంగారు పద్మం వికసించింది.

సుందరి పారిపోయింది. మరెవ్వరూ లేకుండా ఉండటం చూసి ఆంగ్లేయుడు నెమ్మదిగా తాడిచెట్లమధ్యగుండా రేవు సమీపానికి వచ్చాడు.

చూచుటకు ఆంగ్లేయుని వయస్సు తక్కువగానే కన్పి స్తుంది. గడ్డము, మీసాలు ఏమీ లేవు. జుట్టు కొంచెం నల్ల గానే ఉంది. కళ్ళుకూడా ఆంగ్లేయుల దృష్టిలో నల్లగానే ఉన్నాయి. దుస్తులు చాలా ఆడంబరంగా ఉన్నాయి, చైను ఉంగరము మొదలగు కొన్ని ఆభరణాలుకూడా ఉన్నాయి. ఆంగ్లేయుడు నెమ్మదిగా అడుగులు వేస్తూ మెట్లగుండా నీటి అంచువరకు దిగి "I came again for lady!"

అన్నాడు.

"నీ భాష నాకేమీ తెలియదు" అంది శైవలిని.

"Oh, Ay. That nasty gibberish - I must speak it I suppose మేము again వచ్చాము."

"ఎందుకో యమధర్మరాజు ఇంటికి మార్గం ఇదేనా ?"

ఆంగ్లేయునికి అదేమీ అర్థంకాక "హ్వాట్ట్ అంటావ్ ?" అన్నాడు.

"ఆ యమధర్మరాజు నిన్ను ఎందుకు మర్చిపోయాడు అని అన్నాను" అంది శైవలిని.

"యమ్ ! అంటే మార్టిన్ You mean మా Name మార్టిన్ కాదు, లారెన్స్ !"

"మంచిదే, మరొక ఇంగ్లీషుమాట నేర్చుకున్నాను. లారెన్స్ అంటే కోతి —"

ఆసాయంత్రం లారెన్స్ ఫాస్టరు శైవలినితో అనేక దేశవాళీ తిట్లుతిని తనబసకు తిరిగివెళ్లాడు. టిబెటట్ నదీ తీరపు పర్వతాలలో ప్రతిధ్వనించగా విన్న ఒక అతీత గీతాన్ని గుర్తుచేసుకుంటూ ఫాస్టరు తిరిగి వచ్చాడు. ఉండిఉండి అతని మనసులో అనేక ఆలోచనలు తలెత్తసాగాయి-" ఆ శీతల దేశంలోని హిమరాశి సదృశమగు మేగీ ప్రేమకు అతడు చిన్న తనమందే పరవశుడై పోయాడు. ఇప్పుడు అదంతా ఒక స్వప్నంవలె ఉంది. దేశాన్నిబట్టి అభిరుచి కూడా మారు తుందా? హిమమయి మేగీని వేడిదేశపు అగ్నిశిఖలాంటి సుంద రితో పోల్చవచ్చునా? ఏమో, చెప్పలేము."

ఫాస్టరు వెళ్ళిపోయిన కాస్సేపటికి శైవలిని తెప్పరిల్లి

నీళ్లబిందెను చంకనపెట్టుకొని వసంతపు గాలిలో తేలే మేఘం వలె భారంగా అడుగులువేస్తూ ఇంటివేపు సాగిపోయింది. బిందెను యథాస్థానమందుంచి ఆమె పడకగదిలోకి వెళ్ళింది.

శైవలిని భర్త చంద్రశేఖరుడు రామనామం ముద్రించిన దుప్పటిని నడుమునుంచి మోకాళ్లకు చుట్టుకొని, కంబళి మీద కూర్చుని హస్తలిఖిత గ్రంథాన్ని చదువుతున్నాడు; ఎదుట ప్రమిద వెలుగుతూ ఉంది. ఇది ఇప్పటికి వంద సంవత్సరాలనాటి మాట.

చంద్రశేఖరుని వయస్సు అప్పుడు ఇంచుమించు నలభై ఏళ్లుంటుంది. బారిమనిషి, చందన తిలకము తీర్చిన విశాలమైన ఫాలభాగము.

"ఇంత చీకటివేళవరకు ఎక్కడ ఉన్నావు?" అని చంద్రశేఖరుడు ప్రశ్నిస్తే ఏమి జవాబు చెప్పాలి అని శైవలిని ఇంట్లో అడుగుపెడుతూనే ఆలోచించింది. కానీ, అతడు ఆమెను ఏమీ అడగలేదు. ఆ సమయమందు అతడు బ్రహ్మసూత్రాల్లో ఒక సూత్రానికి అర్థం తెలుసుకోవటంలో మునిగిపోయి ఉన్నాడు. శైవలిని గదిలోకి వచ్చి అతనిని చూచి బిగ్గరగా నవ్వింది.

చంద్రశేఖరుడు తలపైకెత్తి ఎదురుగా నిలిచి ఉన్న శైవలిని చూసి "సమయం గాని సమయంలో ఇవాళ మెరుపు మెరిసిందేమిటి?" అన్నాడు.

"మీరు చివాట్లువేస్తారని భయపడుతూ వచ్చాను" అంది శైవలిని.

"చీవాట్లు వేయాల్సిన అవసరం ఏమొచ్చింది?" అని అడిగాడు చంద్రశేఖరుడు.

"నేను చెరువునుంచి చాలా ఆలస్యంగా తిరిగి వచ్చాను."

"నిజమే, ఇప్పటివరకు అక్కడ ఏం చేస్తున్నావు? చాలా ఆలస్యమైంది సుమా!"

"నేను నీటిలో దిగిఉన్నాను. సుందరి ఒడ్డునఉంది. ఇంతలో అక్కడికి ఒక ఆంగ్లేయుడు వచ్చాడు. సుందరి భయపడి నన్ను అక్కడే వదలి పారిపోయి వచ్చింది. నేనుకూడా భయంవల్ల నీటిలోనుంచి ఒడ్డుకు రాలేకపోయాను. అతను వెళ్లి పోయేవరకు గొంతులోతు నీళ్ళల్లో అలాగే ఉండిపోయాను."

చంద్రశేఖరుడు పరధ్యానంగా "మరెప్పుడూ అలా రావద్దు" అని శంకరభాష్యంలో మునిగి పోయాడు పూర్తిగా.

రాత్రి మరింత చిక్కబడింది. చంద్రశేఖరుడు ఇంకా అప్పటివరకూ ప్రేమ, మాయ, స్ఫోటము, అపౌరుషేయతత్వము మొదలగు తర్కాలలో మునిగి తేలుతున్నాడు. శైవలిని ఎప్పటివలె భోజన పదార్థాలను భర్తకుఉంచి, తాను భోజనం చేసి అక్కడేవున్న శయ్యపై పడుకుండి గాఢనిద్రలో మునిగి పోయింది. ఇది చంద్రశేఖరుని ఆదేశమే. అతడు ఏనాడూ పెందలకడ భోజనం చేసేవాడుకాదు. రాత్రి చాలా ప్రొద్దుపోయే వరకూ చదువుతూ కూర్చునేవాడు.

ఇంతలో ఇంటిమీదుగా అరుస్తూపోయిన గుడ్లగూబ అరుపు విన్పించింది. చాలా ప్రొద్దుబోయి ఉంటుందని భావించి చంద్రశేఖరుడు గ్రంథాన్ని మూసివేశాడు. వస్తువులన్నిటినీ సర్ది లేచి నిల్చున్నాడు. తెరచి ఉన్న కిటికీలోనుంచి బయట వైపు చూశాడు. విరగ గాస్తున్న వెన్నెలలో ప్రకృతి ఎంతో

మనోహరంగా కన్పిస్తూ ఉంది. కిటికీలోనుంచి సన్నని వెన్నెల శైవలిని మీదపడి ఆమె అందాన్ని ఇనుమడింప చేస్తుంది. చంద్రశేఖరుడు ప్రసన్నచిత్తుడై తన గృహసరోవరంలో చంద్రకిరణ కాంతి సోకి కమలము వికసించటం చూశాడు. శైవలిని యొక్క అనింద్య సుందర ముఖమండలాన్ని ప్రేమతో రెప్ప వేయకుండా అలాగే చూస్తూ నిలబడిపోయాడు. అత్యున్నత మగు ధనస్సువలె ఉన్న దట్టమైన నల్లని కనుబొమలలో ముకుళించుకున్న కమలములవలె శైవలిని నయన కమలములు మూతబడి ఉన్నాయి. ఆ విశాల నయన పల్లవములందు అత్యంత కోమలమగు తిన్నని రేఖ నొకదానిని చూశాడు. ఒక పూలరాశి మీద మరొక పూలరాశిని పోసినట్లు ఆమె సుకుమార సుందరహస్తము చెక్కిలిపై చేరి ఉంది. తాంబూలం వేసుకున్నందువల్ల ఎర్రనయిన ఆమె పెదవులు కొద్దిగా వికసించినట్లుండి, ముత్యములవంటి పలువరుస తొంగి చూస్తున్నట్లుంది. కలగన్నదో ఏమో శైవలిని నిద్రలో మందహాసం చేసింది. ఆనవ్వు వెన్నెలలో మెరుపు మెరిసి నట్లుంది తిరిగి ఆ ముఖమండలంలో గాఢనిద్ర ఛాయలు గోచరించాయి. ఇరువదేండ్ల యువతిలోని విలాసమయ చంచలత్వంతో శూన్యమగు ప్రఫుల్ల ముఖమండలమును చూసి చంద్రశేఖరుని నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి.

నిద్రలో మునిగి ఉన్న శైవలిని ప్రశాంతముఖమండలము లోని సౌందర్య కాంతినిచూచి చంద్రశేఖరుడు కన్నీరు కార్చాడు.

"అయ్యో! ఈమెను నే నెందుకు వివాహమాడాను?

ఈ కుసుమం మహారాజుకిరీటానికి శోభ తెచ్చేది. శాస్త్రాధ్యయనంలో మునిగి తేలే ఈ బ్రాహ్మణ పండితుని ఇంటికి ఈరత్నాన్ని ఎందుకు తెచ్చాను ? ఈ మెను తెచ్చుకోని నేను సుఖపడినమాట నిజమే. కానీ, శైవలినికి ఏమి సుఖం లభించింది? ఇంతవయస్సు ఉన్న నన్ను శైవలిని ప్రేమించగలగటం అసంభవం. లేదా నా ప్రేమలో ఆమెకున్న ప్రేమ అభిలాషను తీర్చగల శక్తి లేదని చెప్పవచ్చు. ముఖ్యంగా, నే నెప్పుడూ గ్రంథ పఠనంలో మునిగి ఉంటాను. శైవలిని సుఖపడుతుందా లేదా అని నేను ఆలోచించింద మాత్రం ఎప్పుడు ? నా గ్రంథాలను అటూ ఇటూ సర్దిపెడుతున్నా ఈ జవ్వనికి ఏమి సుఖం లభిస్తుంది ? నేను నా సుఖాన్నే చూసుకున్నాను. అందుకోసమే ఆమెను వివాహమాడాలనే కోర్కె కల్గింది నాకు. ఇప్పుడు నేనేం చేయాలి ? ఎంతో కష్టపడి సేకరించిన ఈ గ్రంథాలను గంగలో పారవేసి రమణి ముఖలావణ్యాన్ని పూజిస్తూ కాలం గడపనా ? ఛీ! ఛీ! అదెంత మాత్రమూ జరగదు. అయితే, మరి ఈ శైవలిని నా పాపాలకు ప్రాయశ్చిత్తం చేస్తుందా ? ఈ కోమల కుసుమాన్ని యవ్వన జ్వాలలో దహించి వేయటానికేనా నేను త్రుంచి తెచ్చింది ?"

ఇలాంటి ఆలోచనలతో దుఃఖితుడై చంద్రశేఖరుడు భోజనము చేయటం కూడా మరచాడు. మర్నాడు ఉదయమే మీర్ కాశిమ్ వద్దనుంచి తక్షణం ముర్షీదాబాదుకు బయలుదేరి రావలసిందని కబురు అందింది.

# 5

వేదగ్రామానికి ఆనుకునే పురందరపురమనే గ్రామం ఉంది. ఈస్ట్ఇండియా కంపెనీవారు ఆగ్రామంలో ఒక అందమైన భవనం కట్టించారు. లారెన్స ఫాస్టరు దానికి అధికారి. లారెన్స చిన్నవయస్సులోనే మేరీ ఫాస్టరును ప్రేమించి, ఆమె ప్రేమను పొందలేక నిరాశచెంది ఈస్ట్ఇండియా కంపెనీలో ఉద్యోగానికిచేరి బెంగాలు వచ్చాడు. ఆకాలంలో భారతదేశానికివచ్చిన ఆంగ్లేయులకు అనేకరకాల శారీరక వ్యాధులు సోకుతూ ఉన్నట్లే, బెంగాలు గాలి తగిలేసరికి వారికి డబ్బు దోచుకోవాలనే రోగం కూడా సోకేది. ఆ రోగం లారెన్సును కూడా పట్టుకుంది. కొద్దిరోజుల్లోనే ఆవ్యాధి పూర్తిగా జీర్ణించి పోయింది. దానితో అతని మనస్సులో ఉన్న ప్రేమ చిహ్నాలు చెరిగిపోయాయి. ఒకసారి అతడు ఏదో పనిమీద వేదగ్రామానికి రావటమూ, భీమాతటాక జలంలో వికసించిన పద్మంవలె అగుపించే శైవలిని చూడటమూ జరిగింది. ఆమెను చూచిన తరువాత ఫాస్టరు ఆలోచిస్తూ బసకు చేరుకున్నాడు. బూడిదరంగు కళ్లు, రాగిజుట్టుకంటే నల్లని కన్నులు, నల్లని జుట్టు ఎక్కువ అందంగా ఉంటాయని ఆలోచించిన తరువాత అతడు నిర్ణయించుకున్నాడు. ప్రపంచమనే ఈ మహాసముద్రంలో స్త్రీలు నౌకలవంటి వారనీ, వారి సహాయం పొందటం అందరి కర్తవ్యమనీ అకస్మాత్తుగా ఇవాళ అతనికి స్ఫురించింది.

ఈ దేశానికి వచ్చి ఆంగ్లేయులు పురోహితుల్ని మోసగించి స్నేహం పేరుతో అందమైన బెంగాలీ యువతుల్ని

చేపట్టి దుర్మార్గమేమీ చేయలేదు; అనేకమంది బెంగాలీ యువతులు ధనాశతో తమంతట తామే ఆంగ్లేయుల స్నేహాన్ని వాంఛించారు. శైవలిని మాత్రం వారి స్నేహాన్ని కోరదా ? ఆ ఉద్దేశ్యంతోనే ఫాస్టరు కంపెనీ జవానుని వెంటబెట్టుకొని వేదగ్రామానికి వచ్చి అరణ్యంలో పొంచి కూర్చున్నాడు. జవాను వెళ్ళి శైవలినినీ, ఆమె నివాసాన్నీ చూసివచ్చాడు.

బెంగాలీ పిల్లలు 'జుజు'పేరు చెప్తేనే భయపడతారు. కాని కొందరు మూర్ఖపుపిల్లలు'జుజు'ను చూడాలని ప్రయత్నిస్తుంటారు. శైవలిని పరిస్థితికూడా అదే అయింది. ఆమె మొట్ట మొదట ఫాస్టర్‌నుచూచి ఆనాటి అచారాన్ననుసరించి దీర్ఘ విశ్వాసంతో అక్కడినుండి పారిపోయింది. ఆ తర్వాత "ఆంగ్లే యులు మనిషినిపట్టుకొని వెంటనే తినివేయరు. వాళ్ళు చాలా అద్భుతమైన జంతువులు. ఒకసారి పరిశీలించిచూడు" అని చెప్పారెవరో ఆమెతో, అందుకనే ఆమె అతనిని చూచింది. అతడు ఆమెను పట్టుకొని తినివేయలేదు. అప్పటినుంచే శైవలిని ఫాస్టర్‌నుచూచి పారిపోవటంలేదు క్రమక్రమంగా ఆమె అత నితో మాట్లాడ సాహసించిందికూడా.

శైవలిని ఆ దుష్ట నక్షత్రాన జన్మించిందీ భూమిమీద. దుష్టనక్షత్రానే చంద్రశేఖరుడు ఆమెను వివాహమాడాడు. శైవలిని ఎటువంటిదీ అనే విషయంతర్వాత చర్చిస్తాను. కానీ ఏది ఏమైన ఫాస్టరు ఉపాయాలన్నీ వ్యర్థమేనని తేలిపోయింది.

ఆ తర్వాత అకస్మాత్తుగా ఫాస్టరును కలకత్తా వచ్చి వేయవలసిందనీ, పురందరపురం కంపెనీలో మరొకర్ని నియ మించారనీ ఆదేశమందింది. నిన్న మరొక ముఖ్యపనిలో

నియమిస్తామనికూడా తెలియజేశారు. అక్కడ నియమించబడిన అధికారి ఆ దేశంతో పాటే పురందరపురానికి వచ్చాడు. ఫాస్టరు కలకత్తాకు వెళ్ళిపోవల్సివచ్చింది.

ఫాస్టరు మనస్సులో శైవలిని సౌందర్యం గట్టిగా హత్తుకొనిపోయింది. శైవలినిపై ఆశవదులుకొని వెళ్ళాల్సివుంటుందనీ గమనించాడతడు. ఆ సమయమందు బెంగాలులోవున్న ఆంగ్లేయులందరూ రెండే రెండుపనులలో అసమర్థులు. వారు ఆశను వదులుకోటానికి అసమర్థులు, అపజయాన్నంగీకరించటానికే అసమర్థులు ఈ పనిని చేయలేకపోయాను కనుక దీనిని వదలివేయటం మంచిదనే విషయాన్ని వారు అంగీకంచేవారు కాదు. ఈ పని అధర్మమైనది కనుక దీనిని చేయరాదనే విషయాన్నికూడా వారు అంగీకరించేవారుకాదు. మొట్టమొదటగా భారతదేశంలో ఇంగ్లీషురాజ్యాన్ని స్థాపించినవారందరితో సమానులైన శక్తిశాలురు స్వేచ్ఛాభారాలు మానవజాతిలో మరెన్నడూ భూమండలంపై కనిపించి వుండలేదు. లారెన్స్ ఫాస్టరు ఆ ప్రకృతికిచెందిన మనిషే. అతడు తన ఆశను అణచుకోలేకపోయాడు. బెంగాలులోవుండే ఆంగ్లేయులలో ఆ సమయమందు 'ధర్మం' అనేదే విలుప్తమై పోయింది. ఇది సంభవమా అసంభవమా అనికూడా ఆలోచించలేదతడు. అతడు తనలో తానే Now or never" (ఇప్పుడు కానిచో మరెప్పుడూ కాదు) అనుకున్నాడు.

ఇదే ఆలోచించి, అతడు కలకత్తా వెళ్ళవలసినముందు రోజు రాత్రికి, సూర్యాస్తమయం అవగానే పల్లకీని, బోయీలను, కంపెనీ సైనికుల్ని కొందర్ని వెంటదీసికొని, ఆయుధాలు

ధరించి వేదగ్రామానికి బయలుదేరాడు.

చంద్రశేఖరుని ఇంటిలో దోపిడీ జరుగుతుందని ఆ రాత్రి వేదగ్రామవాసులు విన్నారు. ఆరోజున చంద్రశేఖరుడు ఇంటి వద్దలేడు. ముర్షిదాబాదు రాజాధికారినుండి గౌరవపూర్ణమైన ఆహ్వానాన్నందుకొని అక్కడికి వెళ్ళాడు. ఇవ్వాళకూడా తిరిగి రాలేదు. రోదనలు, కోలాహలము, ఆక్రందనలు, తుపాకి పేల్చిన శబ్దమువిని వేదగ్రామవాసులు పడకలు వదలి బైటకు వచ్చి చూచారు. చంద్రశేఖరుని ఇల్లు దోచుకోబడుతోంది. చాలా కాగడాలు వెలుగుతున్నాయి. ఎవ్వరూ ముందడుగు వేయలేరు. వాళ్ళంతరూ దూరంగా నిలబడి, ఇంటిసంతా దోచుకొని దొంగలు ఒక్కొక్కరే బైటకురావటం చూచారు. చాలామంది బోయీలు ఒకపల్లకీనెత్తుకొని ఇంటిలోనుంచి బైటకు వచ్చారు. పల్లకీతలుపులు మూసివున్నాయి. దాని వెనుక పురందరపురపు కంపెనీదొరగారువున్నారు. ఇవన్నీచూచి గ్రామవాసులకు చాలా ఆశ్చర్యం కలిగింది.

ఇదిచూచి అందరూ భయంతో స్తబ్ధులై ఎక్కడివా రక్కడే జారుకున్నారు. దొంగలు వెళ్ళిపోగానే ఇరుగుపొరుగు వారు ఇంట్లోప్రవేశించి చూశారు. సామానులు దోచుకుంది చాలతక్కువ. ఎక్కువసామాను అలాగేవుంది. కాని శైవలిని మాత్రమే లేదు.

"ఆమె ఎక్కడో దాక్కొంది. ఇహావచ్చేస్తుంది" అన్నారొకరు.

"ఇక తిరిగిరాదు వచ్చిన చంద్రశేఖరుడు ఇంటిలో నుండనివ్వడు. మనంచూసిన పల్లకీలోనే ఆమె వెళ్ళిపోయింది"

అన్నారు పెద్దలు. ఆమె తిరిగివస్తుందని ఆశవున్నవారు నిలబడి ఎదురు చూచి చూచి విసిగి కూర్చుని కునుకుపాట్లుపడి, చివరకు నిరాశ చెంది వెళ్ళిపోయారు. శైవలినిమాత్రం రాలేదు.

మనకు మొదటపరిచయమైన సుందరి అనే యువతి మాత్రం అందరూ వెళ్ళిపోయిన తర్వాత చివరికి వెళ్ళి పోయింది.

సుందరి చంద్రశేఖరుని పొరుగుచారమ్మాయి. చంద్ర శేఖరునికి చెల్లెలువరుస అవుతుంది. ఆమె శైవలినికి స్నేహితు రాలు. ముందు ముందు ఆమెను గురించి ఎలాగు వస్తుంది కనుక ఇక్కడ ఆమెను గురించి ఇంతవరకేచాలు మనకు.

సుందరి ఆరాత్రంతా మేల్కొని కూర్చొని గడిపింది. ఉదయానే ఇంటికి వెళ్ళిపోయి రోదించసాగింది.

ఫాస్టరు తానుకూడా పల్లకీవెంటవుండి చాలాదూరం గంగానదీతీరంవరకు వచ్చాడు. అక్కడ ఒకనౌక సిద్ధంగావుంది. శైవలిని నౌకమీద దింపారు. నౌకమీద హిందూనౌకర్లును దాసీలను, కాపలావాళ్ళను నియమించారు. ఇకే హిందూ దాసదాసీలెందరో ?

ఫాస్టరు ఆ తర్వాత మరొక వాహనంపై కలకత్తాకు వెళ్ళిపోయాడు. అతడు త్వరగా చేరుకోవాలి. పెద్దపడవను గాలిలో లాగుతూ ఒకవారంలో కలకత్తాకు చేరటం అసంభవం శైవలినికోసం స్త్రీకి తగిన వాహనాన్ని ఏర్పాటుచేసి అతడు మరొక సాధనంతో కలకత్తా వెళ్ళిపోయాడు. తాను నౌక వెంట లేకుండావుంటే ఎవరైనా నావమీద దండెత్తి శైవలిని విడిపిస్తారనే భయం అతనికేమాత్రం లేనేలేదు. ఆంగ్లేయుని

నావ అని వింటేనే దగ్గరకెవరూ రారు. శైవలిని వున్ననావను ముంగేరుకు తీసుకువెళ్ళవల్సిందని చెప్పివెళ్ళాడు.

ప్రాతఃకాలమందు వీస్తున్న గాలికి లేస్తున్న చిరుకెరటాలపై గాలికి నావ ఉత్తరదిశగా సాగిపోతుంది. మధురశబ్దం చేస్తున్న కెరటాల పంక్తులు నావక్రింద తగిలి తప తప శబ్దం చేస్తున్నాయి. మీరు దుర్మార్గుల్ని, ద్రోహుల్ని, వంచకుల్ని ఎంతవిశ్వసించినా సరేగాని ప్రాతఃకాలమందు వీచేగాలినిమాత్రం, నమ్మకండి ప్రాతఃకాల వాయువు అత్యంతమధురంగా వుంటుంది. దొంగ వలె దాగుతూ దాగుతూ అక్కడ పద్మలతో, ఇక్కడ మల్లె లతో మరొకచోట పొగడుచెట్ల కొమ్మలతో మెల్లమెల్లగా సయ్యాటలాడుతుంది. ఒకరికి సుగంధాన్నిస్తుంది. ఒకరికి, ఒక రికిరాత్రి [illegible] అలసటను తీరుస్తుంది. విచారంతో కుమిలి పోయే కొందరు మనస్సులను చల్లపరుస్తుంది. యువతుల కేశ రాశినిచూచి ఒకసారి తేలికగా ఊది పారిపోయి వస్తుంది. నౌకాప్రయాణంచేసేవారు దీనిని చూస్తేవుంటారు – ఈ ఆట గాడు మధురస్వభావంగల ప్రాతఃకాలపు పవనము చిరుకెర టాలతో నదిని అలంకరిస్తుంది. ఆకాశంలో అక్కడకూడా చెదరివున్న క్షణికమైన మబ్బుల్ని తరిమివేసి ఆకాశాన్ని నిర్మలంగా వుంచుతుంది. నదీతీరమందున్న వృక్షాలను మెల్ల మెల్లగా నృత్యం చేయిస్తుంది. స్నానం చేయటంలో మునిగి వున్న కామినులతో ప్రేమమాటలుకూడా మాట్లాడుతుంది. నావక్రిందకిచేరి పైనవున్నవారికి మధురసంగీతం వినిపిస్తుంది. వాయువు గొప్ప ధీరస్వభావం, గంభీరప్రకృతి, పూర్తిగా ఆడంబరహీనమైన స్వభావంగలవనీ, నిత్యానంద స్వరూపమనీ

మీరు తలపోస్తూ వుంటారు. ప్రపంచంలో ఇదంతా ఇలాగే జరిగితే ఇహ జరగనిదేముంటుంది.

అయితే నావనువిప్పి బయలుదేరండి ఎండెక్కిండి, నదీ తరంగాలపై ఎండతళతళ మెరుస్తూ వుండటం మీరు చూచారు. రానురాను అది మొదటికంటే హెచ్చిపోతోంది. దానిపై రాజహంసలు నర్తిస్తూ పోతున్నాయి. స్నానంచేయటంలో నిమగ్నమైయున్న సుందరీమణుల మట్టికుండలు, ఆ కెరటాలపై స్థిరంగా లేవు, చంచలంగా నృత్యంచేస్తున్నాయి. అప్పుడప్పుడు కెరటాలు ఈర్ష్యతో ఆ సుందరీమణుల భుజాలపైకి ఎక్కుతున్నాయి పోయి, ఒడ్డుననిలచియున్న స్త్రీలపాదాలపైబడి తల బాదుకొంటున్నాయి. "దేహి పదపల్లవ ముదారమ్" అంటున్నావా అన్నట్లుంది. చివరకు వారి కాళ్ళకు వున్న పారాణి రంగును కడిగి తన అవయవాలకు పులుముకొంటాయి. క్రమంగా వాయుచలనం హెచ్చిపోవటం, ఇక ఇప్పుడది జయదేవుని కవిత్వంవలె వీనులవిందుగా కన్పించకపోవటం మీరు చూస్తారు. అది భైరవి రాగంలో వీనులకు మధుర వీణానాదాన్ని వినిపించదు వాయుగర్జన క్రమక్రమంగా హెచ్చిపోయి హుంకారమేఘం వ్యాపించటం మీరు చూస్తారు. బలీయమైన కెరటాలు సాగి తలెత్తి ఎగిరెగిరి పడసాగాయి. అంధకారం క్రమ్ముకుంది. ప్రతికూలవాయువు నౌకామార్గాన్నే అడ్డివేసింది. నౌకా ముఖాన్నిపట్టుకొని నీటిలో ముంచివేయ సాగింది. మధ్యమధ్య దాని ముఖాన్ని తిప్పివేసేది. ఈ భావాన్ని గ్రహించి మీరు వాయుదేవునికి నమస్కరించి నౌకను తీరానికి చేర్చుకొండి.

శైవలిని నావకూడా సరిగ్గా ఇదే పరిస్థితిలో చిక్కుకొంది. కాస్సేపటికే గాలి చాలా ప్రబలమై పోయింది. ఎదురుగాలివల్ల ఆ పెద్దనావ ముందుకు సాగలేకపోయింది, రక్షకులు నావను భద్రావతీ రేవులో ఆపివేశారు. మరుక్షణమందే నావదగ్గరకు ఒక మంగలి స్త్రీ వచ్చింది. ఆమె వివాహిత. రంగు అంచుగల చీరె ధరించింది, పైటకూడా రంగుదే, చేతికి ఎర్రని గాజులున్నాయి. ఆ స్త్రీ నావపైకివచ్చి చూస్తూ నిల్చింది, తలపై ముసుగుకూడా వుంది. నావలోని అధికారులు మౌనంగా ఆ స్త్రీ వంకనే చూస్తున్నారు.

ఒకవంక శైవలినికోసం భోజనం తయారవుతుంది. ఇప్పటికింకా ఆమె భారతీయస్త్రీయే. ఒక బ్రాహ్మణుడు వంటజేస్తున్నాడు. ఒక్కరోజులోనే ఎవర్నీ భార్యగా చేసుకోలేరు. శైవలిని పారిపోకుండా వుండి, ప్రాణత్యాగం చేయకుండా వుండేటట్లయితే ఏనాటికైనా సరే శైవలిని మ్లేచ్ఛుని చేతి భోజనాన్ని బల్లముందు కూర్చుని బాగుందనిచెప్పి మరీ తింటుందని ఫాస్టరుకు తెలుసు. కానీ ఇప్పుడంత తొందరేమొచ్చింది? ఇప్పుడే తొందరపడితే అంతా రసాభాసై పోతుంది. ఇది ఆలోచించే నాకర్ల అభిప్రాయం తెలుసుకొని శైవలినికోసం వంటచేసేందుకు ఒక బ్రాహ్మణుణ్ని నియమించాడు, బ్రాహ్మణుడు భోజనం తయారు చేస్తున్నాడు. సమీపమందే ఒకదాసి నిల్చొని సామానులు అందిస్తోంది. ఆ మంగలిస్త్రీ ఆదాసీవద్దకే వెళ్ళి "ఏమమ్మా! మీరెక్కడి నుంచి వస్తున్నారు?" అని అడిగిందామెను.

ఆదాసీదానికి చాలాకోపం వచ్చింది. పైగా ఆమె

ప్రత్యేకత ఇంగ్లీషుదొరవద్ద నౌకరీ చేస్తున్నదామె. "ఏమీ నీకేమీ అవసరమొచ్చిందే! మేము డెల్లీ డెల్లీ, మకాం నుంచీ వస్తున్నాము." అని చెప్పింది.

ఆస్త్రీ నిశ్చేష్టురాలై నేనది అడగడం లేదు. మాది మంగలికులం. మీనానలో అబ్బాయిలికి, అమ్మాయిలికి పనేమైనా వుందా? నేనడిగేదది" అని అంది.

దాసీ కొంచెం మెత్తబడింది. "సరే అయితే, ఇక్కడే వుండు, అడిగివస్తాను" అని ఆమె శైవలిని వద్దకువెళ్లి కాళ్ళకు పారాణి పెట్టించుకుంటుందేమో అడిగింది. కారణం ఏదన్నా కానివ్వండి, శైవలిని మనస్సును మార్చుకోదలచింది. పారాణి పెట్టించుకుంటానని చెప్పింది. అప్పుడు కాపలామనిషి అనుమతితో దాసీ ఆస్త్రీని లోనికి పంపింది. ఆదాసీ తిరిగి తన పనిమీదపొయ్యివద్దకు వెళ్లింది. ఆమంగలిస్త్రీ శైవలినిచూచి ముసుగు మరి కొంచెం ముందుకు లాక్కొని ఆమె కాలు పట్టుకొని పారాణి పెట్టసాగింది. శైవలిని ఆస్త్రీని కొద్దిగా పరిశీలించి చూచి "ఏమమ్మా నీ పేరేమిటి?" అని అడిగింది.

జవాబేమీ రాలేదు.

"మంగలి ఏడుస్తున్నావా?"

"లేదు" అంది మంగలిస్త్రీ కోమలకంఠంతో.

"కాదు, ఏడుస్తున్నావు" అని శైవలిని ఆస్త్రీ ముసుగును తొలగించింది. నిజంగానే ఆమె ఏడుస్తోంది. ముసుగు తీసివేయగానే కొంచెం నవ్వింది.

"నువ్వురాగానే గుర్తించాను నేను. నాయెదుటనా నీముసుగు? అయినా నువ్విక్కడికి ఎక్కడినుంచి వచ్చావ్?

అని అడిగింది శైవలిని.

ఆ స్త్రీ మరెవరో కాదు - అదే ఆసుందరి ఠాకుర్! సుందరి కన్నీటిని తుడుచుకొని "త్వరగా వెళ్లిపో, నాచీర ధరించు, నేను మార్చి ఇస్తాను. ఈ ఎర్రగాజులు తొడుక్కో. ముసుగు వేసుకొని నావలోనుంచి బయటపడి వెళ్ళిపో. అని చెప్పింది.

"నువ్విక్కడికెలా వచ్చావ్? అని అడిగింది శైవలిని విచారంగా. ఎక్కడినుంచి వచ్చానో, ఎలావచ్చానో, ఆ అవకాశం లభించినప్పుడు చెప్తాను అన్నీ. నిన్ను వెదుక్కుంటూ ఇక్కడికి వచ్చేసాను. పల్లకీ గంగానదీ తీరానికి వెళ్లిందని చూచినవాళ్లు చెప్పారు. నేనుకూడా ఉదయమేలేచి ఎవరితోనూ ఏమీ చెప్పకుండా వెదుకుతూ గంగాతీరానికి చేరుకొన్నాను. నావ ఉత్తరంగా వెళ్లిందని చెప్పారు అక్కడిజనం. నడిచినడిచి కాళ్లు పడిపోయాయి. అప్పుడిక ఒకనావను బాడుగకు తీసుకొని నీవెనుకనే వచ్చాను. నువ్వున్నది పెద్దనావ నడవడంలేదు. నేను కుదుర్చుకొన్నది చిన్ననావ కావడంవల్ల త్వరగావచ్చి పట్టుకొన్నాను.

"అయితే?"

"అయితే ముందు నువ్వు నాచీర ధరించు, నాగాజులు తొడుక్కో. ముసుగువేసుకొని నావనుంచి దిగి వెళ్లిపో. ఎవ్వరూ గుర్తించరు. నదీతీరాన్నే నడచి వెళ్లు. ఆచోటులో నాభర్తగారుంటారు. అన్నగారూ, అనటానికేమీ సిగ్గుపడకు. బోటుమీద ఎక్కు. నువ్వెళ్లగానే ఆయన నిన్నింటికి చేరుస్తారు" శైవలిని కొంచెంసేపు ఆలోచించి "అప్పుడు మరి నీ

పరిస్థితి ?" అని అడిగింది.

"నన్ను గురించేమీ విచారించకు. ఈసుందరి బ్రాహ్మణిని నావలో బంధించి వుంచగల ఆంగ్లేయుడీ బెంగాలులోనే లేడు. నేను బ్రాహ్మణయువతిని, బ్రాహ్మణ యిల్లాలిని. మన మనస్సును మనం దృఢంగా వుంచుకోగలిగితే ఈపృధ్విలో మనకు ఆపద అనేదే వుండదు. నువ్వు వెళ్లు. ఏవిధంగానైనా సరే రాత్రికి నేను ఇంటికి చేరుకుంటాను. ఆపదల్ని తొలగించి కాపాడే ఆపరమాత్ముడు మదుసూధనునియందు నాకు పూర్తిగా నమ్మకమున్నది. నువ్వింక అట్టే ఆలస్యం చేయకు. మీ అన్నగారింత వరకూ భోజనం చేయలేదు. ఇవ్వాళకూడా భోజనం చేస్తారో లేదో కూడా చెప్పలేను !

"సరే నేను ఇంటికి వెళ్ళానే అనుకో. ఇంటికి వెళ్ళిం తరువాత నన్ను ఇంట్లోకి రానిస్తారా లేదా?

"అదుగో! అదే! ఎందుకు రానివ్వరు? నావలోనే పడుంటావా ఏం?"

"చూడు ఒక ఆంగ్లేయుడు నన్ను తీసుకొచ్చేశాడు. ఇంకా నాకు జాతి అనేది వుందా?

సుందరి ఆశ్చర్యంతో శైవలిని ముఖంలోకి చూడ సాగింది. సుందరి నిశితదృష్టిని చూచి ఔషధాన్ని తాకిన సర్పంవలె అభిమానవతి శైవలిని తల దించేసుకుంది.

"నిజం చెస్తావా?" అని కొంచం కటువుగా అడిగింది సుందరి.

"చెప్తాను" అంది శైవలిని.

"ఈ గంగానది సాక్షిగా"

"చెప్తాను. నువ్వడగవలసిన అవసరమేమీ లేదు. నేనే చెప్తాను. నేనింతవరకు ఆదొరగార్నైనా చూడలేదు. ఏమరు పడటంకూడా జరగలేదు. కనుక స్వీకరించినంత మాత్రాన భర్త ధర్మచ్యుతులు కారు."

"అయితే నీ భర్త నిన్ను తప్పక స్వీకరిస్తారు. అందు కేమాత్రం సందేహంలేదు. ఆయన చాలా ధర్మాత్ములు. అధర్మం చేయరు. అటువంటప్పుడిహ మీ అనవసర ప్రసంగంతో కాలయాపన చేయకు." శైవలిని కాస్సేపు మౌనంగా వుండి, అంతలోనే కంటనీరెట్టింది. తర్వాత కన్నీటిని తుడుచు కొంటూ" నేను వెళ్తాను, వారు స్వీకరిస్తారుకూడా, అయితే వచ్చినకళంకం ఏనాటికైనా చెరిగిపోతుందా ? అని అన్నది.

సుందరి జవాబేమి చెప్పలేదు. "అప్పటికే గ్రామంలోని యువతులందరూ ఇదిగో ఇంగ్లీషు వాడెత్తుకుపోయింది ఆమెనే, అని నీవంక వేలెట్టి చూపుతారా లేదా ? ఎప్పుడైనా ఏ కొడుకో పుట్టి అన్నప్రాశనానికి గ్రామంలో అందరినీ పిలిస్తే ఎవరైనా వస్తారంటావా ? ఆ పరమాత్ముడు అలా చేయ కూడదనే నా కోర్కె, కానీ ఏ కూతురో కలిగితే బ్రాహ్మణ కులంలో ఎవరైనా వివాహమాడుతారా ? నేనిప్పుడు తిరిగి వెళ్ళినంతమాత్రాన నేను పవిత్రంగానే వున్నానంటే ఎవరైనా నమ్ముతారా? ఇంటికివెళ్ళి అందరికీ ముఖమెలా చూపించను?" అని అడిగింది శైవలిని.

"నొసట వ్రాసిందెవరు తప్పిస్తారు. జరిగిందేదో జరి గింది. అదిప్పుడు తుడిచేసుకుంటే పోయేదిలేదు. ఏవో కష్టాలు వస్తూనే వుంటాయి, నీ యింట్లోనే పడివుంటావుగదా ?" అని

అంది సుందరి.

ఏం సుఖం చూచుకొని ? ఏం సుఖం అనుభవించాలనే అభిలాషతో ఇంత కష్టపడి ఇంటికి వెళ్ళను ? తల్లి, తండ్రీ, అన్న ఎవరూ లేరు—"

"ఏం భర్తో ? ఈ స్త్రీ జన్మ మరెందుకోసం."

"అన్నీ తెలుసుగదా—"

"తెలుసు ఈ భూమిమీదవున్న పాపులందరిలో నీ వంటి పాపాత్మురాలు మరెవ్వరూ లేరు. నీ భర్తవంటివారు లభించటం ప్రపంచంలో బహుదుర్లభం. అటువంటివారి స్నేహంలోకూడా నీ మనస్సు ఇమడటం లేదు. చిన్న పిల్లలు ఆటబొమ్మల్ని ఆదరిస్తారు చూశావ్, ఆయన స్త్రీని ఆ దృష్టితో ఆదరించరు. ఆ సృష్టికర్త వారిని రాతితో చేసి రంగులేసి అలంకరించలేదు. వారిని మనిషిగా సృష్టించారా లేదా, ఆయన ధర్మాత్ములు, పండితులు, నువ్వేమో పాపివి. ఆయన యందెందుకు పోతుంది నీమనస్సు ? అంధులకంటే అంధురాలవు నువ్వు. అందుకనే నీ భర్త నిన్నెంతగా ప్రేమిస్తున్నారు, స్త్రీకి అటువంటిప్రేమ లభించటం ఎంతదుర్లభమో నువ్వు గుర్తించలేక పోయావు. ఎంతో పుణ్యం చేసుకున్న ఫలితంవల్లనే నువ్వు భర్తవల్ల అటువంటి ప్రేమను పొందకలిగావు. ఆయన్ని వదలావు. సరే ఇప్పుడా విషయాలన్నీ వదిలేద్దాం. అవి ఇప్పుడు మాట్లాడుకోవద్దు. ఒకవేళ ఆయన ప్రేమించనప్పటికీకూడా నువ్వాయన పాదసేవచేసుకుంటూ బ్రతకటంలోనే నీ జీవితం సార్థకమవుతుంది మరెందుకింకా ఆలస్యం చేస్తావ్ ? నాకు కోపంకూడా వస్తుంది."

శైవలిని—"నేను ఇంటికి వెళ్ళినా తండ్రి తరపుబంధువు లెవరైనావుంటే అక్కడికి వెళ్ళి వుందామనా, కాశీకి వెళ్ళి భిక్ష మెత్తుకొని బ్రతుకుదామనా, దేనిలోనైనాపడి చద్దామనా మాత్రమే ఆలోచిస్తూ కూర్చుంటాను. నేనిప్పుడు వెళ్తుంది ముంగేరు. ఆ ముంగేరు ఎలా వుంటుందో వెళ్ళిచూద్దాం రాజ దానిలో భిక్షమేమైనా దొరుకుతుందేమో చూస్తాను. ఎప్పుడైనా చావవలసిందే, మరీ అంత పరిస్థితివస్తే చస్తాను. చావటమనేది చేతిలోవున్న పనాయే, ఇప్పుడిక మృత్యువుతప్ప మరో ఉపాయమాత్రమేముంది ? కాని చావాలా, బ్రతకాలా అనేదే. కాని నేనిక ఇంటికిరానని ప్రతిజ్ఞచేస్తున్నాను. నువ్వు వ్యర్థంగా నాకోసమింతకష్టపడ్డావు, వెళ్ళిపో, నేనురాను. నేను చనిపోయాననే అనుకో. నేను చనిపోవుట ఖాయమనిమాత్రం గుర్తుంచుకో — వెళ్ళు."

అప్పటికి సుందరి మరేమీ మాట్లాడలేదు. ఏడ్చి ఏడ్చి లేచి నిల్చుంది—" నువ్వు త్వరలోనే చస్తావని ఆశిస్తున్నాను. మనోవాక్కాయ కర్మలా చచ్చే సహాసం నీకు కలగాలనే నేనా భగవంతుడ్ని ప్రార్థిస్తాను. ముంగేరు చేరక పూర్వమే నువ్వు చనిపోవాలి, తుఫానులోనో, ప్రళయంవచ్చో, పడవ మునిగో, ఏదో విధంగా ముంగేరుచేరక ముందే నువ్వు చావాలి" అని సుందరి నావలోనుంచి బయటకువచ్చి తిన్నగా తన భర్తవద్దకు తిరిగి వెళ్ళిపోయింది.

# 6

చంద్రశేఖరుడు లెక్కగట్టిచూచి "మహాశయా, నేను
లెక్కగట్టి చెప్పలేకపోయానని చెప్పండి నవాబుగారితో" అని
చెప్పాడు. అధికారికి.

"ఎందువల్లనంటే ?" అని అడిగాడా అధికారి.

"సర్వము జ్యోతిషం ద్వారా తెలుసుకోలేము. అలా
అయితే మానవుడు సర్వజ్ఞుడవుతాడు. నేను గొప్పజ్యోతిష
పారంగతుడ్నేమీ కాను." "అంతేనా, లేక బుద్ధిమంతులు
రాజుగారికి అసంతృప్తి కలిగించే విషయాలు కూడా చెప్పరు -
అదా? ఏదైతేనేం, మీకు చెప్పిందే రాజుగారికి విన్నవిస్తాను"

చంద్రశేఖరుడు శలవు తీసుకొని బయలుదేరాడు. అధి
కారి వారికి ఖర్చునివ్వటానికికూడా సాహసించలేకపోయాడు.
చంద్రశేఖరుడు బ్రాహ్మణుడు, పండితుడు, అటువంటివాడు
భిక్షమెత్తడు. ఇతరుల దానాన్ని గ్రహించడు.

గ్రామానికి తిరిగి రాగానే అతనికి దూరంనుంచే తన
యిల్లు కన్పించింది. చూడగానే ఆయన మనస్సుకు ఆనందం
కల్గింది. చంద్రశేఖరుడు తత్వజ్ఞుడు, తత్వజిజ్ఞాసువు. తనలో
తానే ప్రశ్నించుకున్నాడు. 'పరప్రాంతంనుంచి తిరిగి రాగానే
తన యింటినిచూచినప్పుడు మనస్సులో ఆనందం కలుగుతుం
దెందుకు ? నేను ఇన్నిరోజుల వరకు ఆహారనిద్రల్లో ఏమి బాధ
పడ్డాను ? ఇంటికి వెళ్ళినప్పుడు అక్కడికంటే సుఖంకలిగే
ప్రత్యేక సౌకర్యాలేమి వుంటాయి ? ఇంత వయస్సులో నేను
చాలా మోహబంధనాల్లో పడిపోయాననే దానిలో సందేహ
మేమీ లేదు 'ఈ యింట్లో నా ప్రియమైన భార్య వుంటుంది

కనుకనే నాకు యింత ఆనందం కలుగుతుందా ? ఈ ప్రపంచ మంతా బ్రహ్మే. అయితే మరిఒకరియందు అధికప్రేమ, ఒకరి యందు ద్వేషము ఎందుకు కలుగుతాయి ? ఈ బ్రహ్మాండ మంతా ఆ సచ్చిదానంద స్వరూపమేగా ! వెనుక సామానును మోసుకొస్తున్న వారికేసి ఒక్కసారైనా తిరిగి చూడాలని అనిపించ దెందువల్ల ? ఆ వికసిత పద్మవదన ముఖారవిందాన్ని చూడాలని మనస్సెందుకు తహతహలాడుతోంది ? పరమేశ్వ రుని మాటలలో శ్రద్ధవుంచటం లేదు, కానీ, అత్యంత మోహ జాలంలో చిక్కుకుపోయాను. ఈ మోహజాలాన్ని వదులుక్కు- పోవాలనేదికూడా ఇష్టం లేదు. చిరకాలం జీవించి వృద్ధప్పటికి ఆ అనంతకాలం వరకూ ఆ మోహజాలంలో పడివుండాలనే అభిలాష జనిస్తోంది. ఎంతసేపట్లో తిరిగి శైవలినిని చూడ గల్గుతాను ?

ఆకస్మికంగా చంద్రశేఖరుని మనస్సులో ఏదో భయం జనించింది. ఇంటికి వెళ్ళి శైవలినిని చూడలేకపోతేనో ? ఎందుకు చూడలేను ? ఒకవేళ జబ్బుపడిందేమో. రోగా లనేవి అందరికీ వస్తాయి. బాగయిపోతుంది.

రోగమనేమాట మనస్సులో మెదిలే సరికే ఇంత దుఃఖమెందుకు కల్గింది ? రోగాలనేవి రానిదెవరికి ? అయినా ఏదైనా క్లిష్టరోగం వచ్చివుంటే ? అనుకున్నాడు. చంద్రశేఖ రుడు తనలో అనుకొని గబగబ అడుగువేశాడు, జబ్బుపడి వుంటే ఆరోగ్యప్రాప్తికై ఈశ్వరపూజ చేస్తాను, ఆ ఈశ్వరుడే బాగుపరుస్తాడు. రోగం నయం కాకపోతేనో ? అనేది మన స్సులో. మెదిలేసరికి చంద్రశేఖరునికి కన్నీళ్ళు బొటబొట

రాలాయి. ఈ వయస్సులో ఆ పరమాత్మ నాకొక రత్నాన్ని ప్రసాదించి మరల అంతలోనే దూరం చేస్తాడా ? అని ఆలోచించాడు. అయినా అందులో ఆశ్చర్యం మాత్రమేముంది ? నా నొసట సుఖాన్ని మినహా కష్టాన్ని వ్రాయకుండానే వుండటానికి నేనాపరమాత్మకు అంత ప్రేమపాత్రుణ్ణా ? అయితే ఘోర దుఃఖమే వ్రాసివుంటాడేమో నా అదృష్టంలో - శైవలిని లేదేమో వెళ్ళిచూస్తాను - వెళ్ళగానే ఏదో కఠినరోగంతో శైవలిని ప్రాణాలు త్యజించిందని వింటే ? అలాగే జరిగితే నేనుకూడా బ్రతకను. చంద్రశేఖరుడు మరింత గబగబ అడుగులువేశాడు. తన ఇంటిసమీపానికి రాగానే ఇరుగు పొరుగు వాళ్ళు చాలా గంభీరభావంతో తన కేసి చూడటం గమనించాడతడు. వాళ్ళలాచూడటానికి అర్థమేమిటో చంద్రశేఖరుడు తెలుసుకోలేక పోయాడు. పిల్లలు అతణ్ని చూచి ఇకిలించ నారంభించారు. కొందరు అతడివెనకనే దూరంగా రాసాగారు. వృద్ధులు అతణ్ని పిలుచాటుశారు. చంద్రశేఖరుడు ఎటూ చూడకుండా తిన్నగా తన యింటిద్వారంలోకి వెళ్ళి ఆగాడు.

తలుపులు మూసివున్నాయి. బయటనుంచి తలుపు నెట్టేసరికి నౌకరు ముందటి తలుపులు తెరచాడు. చంద్రశేఖరుణ్ని చూడగానే నౌకరు ఏడ్చాడు. "ఏం జరిగింది ?" అని అడిగాడతడు. నౌకరేమీ జవాబు చెప్పకుండా ఏడుస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

చంద్రశేఖరుడు ఒకసారి మనస్సులో ఇష్టదైవాన్ని స్మరించుకున్నాడు. ఇల్లు ఊడ్చినట్లు లేదు, దుమ్ముపేరుకొని వుంది. చండీమంటపంనిండా దుమ్ము నిండివుంది. అక్కడక్కడ్డా

కాగడాలముక్కలు విరిగిన దర్వాజాముక్కలు పడున్నాయి. చంద్రశేఖరుడు లోనికి వెళ్ళాడు. అన్ని గదులకు బైట గొళ్ళెములు పెట్టివున్నాయి. దాసీ మనిషి అతణ్ని చూడగానే అక్కడినుంచి జారుకోవటం గమనించాడు. ఆమె ఇంటిబైటకు వెళ్ళి శోకాలుపెట్టి ఏడ్వటంమాత్రం అతనకి విన్పించింది. అప్పుడిక చంద్రశేఖరుడు వెనుక దొడ్లోకి వెళ్ళి బిగ్గరగా "శైవలినీ" అని పిల్చాడు బొంగురుగొంతుతో కోపంగా.

ఎవ్వరూ జవాబుచెప్పలేదు. చంద్రశేఖరుని క్రోధ కంఠాన్ని విని దాసీదికూడా ఏడ్పుమానేసింది.

చంద్రశేఖరుడు మరల పిల్చాడు. అతడి పిలుపు ఇంట్లో ప్రతిధ్వనించింది. ఎవ్వరూ జవాబు చెప్పలేదు.

ఆ సమయమందు శైవలినియొక్క చిత్రాలతో అంకితమైన నావపై గంగాజలాన్ని తాకుతూ వీస్తున్న మంద వాయువులతో రెపరెపలాడుతున్న ఆంగ్లేయుల అరుణ పతాకం ఎగురుతోంది. నావికులు పాటలు పాడుతున్నారు.

చంద్రశేఖరుడు జరిగినదంతా విన్నాడు.

అప్పుడతడు తన ఇంట్లోవున్న విష్ణుమూర్తి విగ్రహాన్ని జాగ్రత్తగా తీసి సుందరి తడిగారింట్లో వుంచాడు. వస్త్రములు, ఇతర విలువైన సామానులు వగైరా ఇంట్లోని వస్తువులన్నింటినీ పొరుగున వున్న పేదవారికి పంచివేశాడు. సాయంత్రం వరకు ఇదేపని చేశాడు. సాయంత్రమవగానే తాను చదివిన, చదవవలసిన తన రక్తసమానంగా ప్రేమించిన గ్రంథాలనన్నింటినీ ఒకచోట చేర్చాడు. ఒక్కొక్కటిగా ఛాప్పున ప్రాంగణంలో పేర్చాడు. అలా పేర్చేప్పుడు

మధ్యమధ్య కొన్ని గ్రంధాలను తెరచి చూచాడు. తర్వాత చదవకుండానే కట్టిపెట్టాడు. తిరిగి అన్నింటినీ గుట్టగా పేర్చాడు. పేర్చి నిప్పంటించాడు.

అగ్నిజ్వాలలు లేచాయి. పురాణాలు, చరిత్రలు, కావ్యాలు, అలంకార, వ్యాకరణ శాస్త్రాలు అన్నింటికీ క్రమంగా అగ్నివ్యాపించి, మనుపరాశరం, యజ్ఞవల్క్య, మొదలైన స్మృతులు, న్యాయ, వేదాంత సాంఖ్యశాస్త్ర గ్రంథాలు, కల్పసూత్ర, అరణ్యక ఉపనిషత్తులు ఒక్కొక్కటే అగ్నిలో బడి తగలబడిపోసాగాయి. ఎంతో శ్రమపడి ఎంతో జాగ్రత్తగా సేకరించుకొన్న గ్రంథాలు, ఎన్నోరోజులుగా పఠిస్తూ వచ్చిన ఆ ఆమూల్యగ్రంథాలన్ని బూడిదై పోయాయి.

గ్రంథాలన్నింటినీ అగ్నిసంస్కారం కావించేసరికి ఒక జాముర్రాత్రి గడచిపోయింది. చంద్రశేఖరుడు ఒక ఉత్తరీయాన్ని మాత్రం తీసుకొని లేచి వెళ్ళిపోయాడు. ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు. ఎవరూ అడుగనూ లేదు.

# రెండవ భాగము

లేదిక, పక్షి ఆడదు. నువ్వు చెప్పవలసిందేదో చెప్పు ఇప్పుడు" అని దలనీబేగమ్, నాట్యంచేయుని నెమలితోక పట్టుకొని లాగింది. తనచేతికి వున్న రత్నాల గాజును తీసి నెమలి మెడలో వేసింది. అతిగారాబాగే ఒక తెల్లచిలుక "దాసీదానా" అని తిట్టిందామెను. ఈ తిట్టును దలనీబేగమే నేర్పింది దానికి స్వయంగా.

ఆమె చిలుకను ఆడించుటకు చేసేయత్నాన్ని చూస్తూ సమీపమందే నిల్చొనివున్న దాసీ నుద్దేశించి "నువ్వు చెప్ప వలసిందిక చెప్పు" అని అంది.

"చెప్పేదేముంది? ఆయుధాలతో నిండివున్న రెండు నౌకలు రేవులోవున్నా యిప్పుడు. వాటిపై ఒక ఆంగ్లేయు డున్నాడు. ఆ రెండు నావలూ ఆపివేయబడ్డాయి 'నావల్ని వదలివేయండి. వాటిని ఆపివేయటంవల్ల అనవసరంగా ఇంగ్లీషు వారితో యుద్ధంజరుగుతుంది.' అన్నారు. అలీ ఇబ్రహీంఖాన్. 'అంతగా జరగాలనివుంటే యుద్ధం జరగనీ, నావల్నిమాత్రం వదలను "అంటున్నారు గుర్గున్ ఖాన్" అని చెప్పింది దాసీ కులసమ్.

దలని :- "ఆయుధాలు పోతుందెక్కడికి?"

"అజమాబాదు (పాట్నా) కంపెనీకి పోతున్నాయి. యుద్ధం ప్రారంభమైతే ముందు అక్కడే ప్రారంభమవుతుంది. దానిని ఆంగ్లేయులు ఏ పరిస్థితుల్లోనూ వదలుకోరు. అందు కనే అక్కడికి ఆయుధాలు జేరవేస్తున్నది. కోటల్లో అందరూ చెప్పుకుంటున్నది అలా అనే"

"మరి గుర్గన్ ఖాన్ అడ్డగించాలనుకునేదెందుకు ?"

"ఇన్ని ఆయుధాలు అక్కడికి చేరనిస్తే యుద్ధంలో జయంపొందటం కష్టమంటున్నారాయన. శత్రువును పురోగమించనివ్వటం మంచిది కాదని వారివాదం. ఇక ఇబ్రహీం ఖాన్ గారి వుద్దేశ్య మేమంటే మనం ఎంతజేసినా సరే ఆంగ్లేయుల్ని జయించట మనేది కష్టం. కనుక యుద్ధం చేయకూడదనే మన నిర్ణయం. అటువంటప్పుడు నావల్ని అడ్డగించి యుద్ధాన్ని కొనుక్కు తెచ్చుకోవట మెందుకు అనే. అది వాస్తవమేమరి. ఆంగ్లేయుల నుంచి మరోరక్షణే లేదు. మళ్ళీ తిరిగి ఫిరాజుదౌలానవాబుగారి కాండే జరిగేటట్లుంది."

దలనీకాస్సేపు ఆలోచించి "కులసమ్ నువ్వొక సాహసకార్యం చేయగలవా?" అని అడిగింది.

"ఏమిటో అది? ఎలిస్ చేపను తినెయ్యాలా. లేక చన్నీటిలో స్నానం చేయాలా?"

"ఛీ. పరిహాసంకాదు. ఆవిషయం ఏమాత్రం తెలిసినా చక్రవర్తి నిన్ను నన్నూకూడా ఏనుగులతో తొక్కించివేస్తారు. అటువంటి పని అది?"

"తెలిస్తేనేగదా? అత్తరుపన్నీరు, వెండి బంగారాలెన్ని దొంగిలించ లేదంటావ్? ఎవర్కైనా లేశమైనా తెలియునేమ. మగవారి కన్నులు ముఖసౌందర్యానికే అని నాకుతోస్తుంది. వాటికి మరేమీ కన్పించదనుకుంటా. ఏం, స్త్రీల జిత్తులు పురుషుల కెప్పుడైనా అంతుచిక్కినట్లు నే నెక్కడాచూడ లేదు."

"నోరుముయ్! నేను చెప్పేది కొజ్జాలు, వంటవాళ్ళ వంటివారినిగురించిగాదు. నవాబు ఆలీజాహ్ ఇతర పురుషుల

వంటివారు కాదు. వారికి తెలియనే తెలియదంటావా?"

"నేనామాత్రం వ్రాయలేనాఏం, ఇంతకూ చేయాల్సిం దేమిటి?"

"గుర్గన్ ఖాన్ గారికి ఒక ఉత్తరంపంపాలి" ఆశ్చర్యంతో కుల్సమ్ ఏమీమాట్లాడలేక పోయింది. "ఏమంటావ్?" అని అడిగింది దలనీబేగమ్.

"ఎవరి ఉత్తరం అది?"

"నాదే"

"ఎందుకలా? మీకేమైనా పిచ్చిబట్టిందా ఏం?"

"కావచ్చు"

ఇద్దరూ మౌనంవహించి కూర్చున్నారలాగే. వారిద్దరూ మౌనం వహించటం చూచి నెమళ్ళురెండూ తమ తమ చోటులకెక్కి కూర్చున్నాయి. చిలుక అదేపనిగా అరుస్తోంది.

కాస్సేపాగి "పని చాలా చిన్నదే, ఏకొజ్జాకు సేత వేసినా అతడిప్పుడే వుత్తరం ఇచ్చివస్తాడు, కానీ, చాలా కఠినకార్యమిది. నవాబుగారికి తెలిస్తే ఇద్దరూ అంతమే. ఏమైతే నాకెందుకు మీపనులు మీ యిష్టం, నేను వ్రాసిసను. ఉత్తరము కొద్దిగా పైకము ఇలాఇవ్వండి" అని అంది కుల్సమ్.

తరువాత కుల్సమ్ లేఖతీసుకొని వెళ్ళిపోయింది. ఈ వుత్తరం సంబంధంతో నేసృష్టికర్త దలనీ.శై వలినీల అదృష్టాన్ని ఒకటిగా చేశాడు.

# 2

దలనీబేగమ్ ఉత్తరంవ్రాసిన వానిపేరు గుర్గన్ ఖాన్, బెంగాలులోని నవాబుగారి మనుషులందర్లో గుర్గన్ ఖానిక్కడ పెద్దవాడు బహుయోగ్యుడు. అతడు అర్మానీజాతివాడు. మొదట వస్త్రాలు అమ్ముతూవుండే వాడట. కానీ అతడు అసాధారణ గుణాలుగల ప్రతిభావంతుడు. ప్రభుత్వనౌకరీ దొరికిన కొద్దికాలానికే అతడు సైన్యాధిపతి పదవిలోకి వచ్చాడు. అంతేగాదు, సైన్యాధిపతి కాగానే అతడొక బలమైనఫిరంగి తుపాకి దళాన్ని ఏర్పాటు చేశాడు. యూరోపియనుల పద్ధతుల్లో వారికి శిక్షణ నిప్పించాడు. అన్ని హంగులు సమకూర్చాడు. అతడు తయారుచేయించిన తుపాకులు వగైరా యూరోపియనుల వారికంటె ఎంతో బాగుండేవి. వారి తుపాకి దళాలకంటేకూడా ఇతడి దళంబాగా ఆరితేరింది. గుర్గన్ ఖాన్ సహాయంతో ఆంగ్లేయుల్ని తరిమివేయగలమనే ధైర్యం వుంది. మీర్ కాశింనవాబుకు, దానికి తగినట్లుగానే అతనికి తగినన్ని అధికారాలివ్వబడ్డాయి. అతడి సలహాలేకుండా మీర్ ఖాశింనవాబు ఏపనిని చేసేవాడేకాదు స్వతంత్రించి. గుర్గన్ ఖాన్ అభిప్రాయాలకు విరుద్ధంగా వుండేసలహాల నతడు వినేవాడేకాదు. దాని పరిణామంగా గుర్గన్ ఖాన్ కూడా ఒక పిల్ల నవాబై పోయాడు. అందువల్ల ముస్లిం కార్యాధ్యక్షులువారికి వ్యతిరేకమై పోయారు.

రాత్రి రెండవ యామం గుర్గన్ ఖానింకా నిద్రపో లేదప్పు

టికి ఒంటరిగా దీపంముందు కూర్చొని కుప్పగా పడియున్న వుత్తరాలు చదువుతున్నాడు. అవన్నీ కలకత్తాలోవున్న అర్మీనియనులు వ్రాసిన ఉత్తరాలు చదివిన తర్వాత అతను నౌకర్ని పిలచి తలుపులన్నీ తెరిచేవున్నాయా? అని అడిగాడు.

"చిత్తం" అన్నాడు కాపలాసైనికుడు.

"నా వద్దకు ఎవరు వచ్చినాసరే ఆటంకపర్చవద్దు, ఎవరు ? అనికూడా అడగవద్దు, ఈవిషయం అందరికీచెప్పు."

"అది ఇంతకుముందే జరిగిందండి"

"సరే నువ్వెళ్లు,

అప్పుడు గుర్గన్‌ఖాన్ లేచి ఉత్తరాల కొన్నింటిని కట్టగట్టి నిశ్చిత స్థానంలో దాచి వేశాడు. తదుపరి అతను తనలో తానే యోచించుకోసాగాడు. నే నిప్పుడు ఏమార్గాన్నను సరించాలి? ప్రస్తుతం భారతదేశం ఒక మహాసముద్రంలా వుంది. ఎవడెంత మునిగితే, అన్ని రత్నాలు తెచ్చుకోగలుగుతాడు. ఒడ్డున కూర్చొని అలలు లెక్కిస్తే ప్రయోజన మేముంది? ఒకప్పుడు చూస్తే, గజాలు తక్కువేసి గుడ్డలమ్మే వాడిని నేను. ఇప్పుడు నన్ను చూచి భయంతో భారతదేశం వూగిపోతుంది. నేనే బెంగాలు నవాబునా? నవాబెవరు? అధికారులు ఇంగ్లీషు వ్యాపారస్థులు శాసనం చేసేవారి బానిసను నేను. చాల గొప్ప పదవే? ఒకసారి సెట్టిచూడాలి. కానీ, ఆంగ్లేయుల్ని దేశం నుంచి తరిమివేయకుండా నేను పాలించను. నేను బెంగాలు నవాబు కా గోరుతున్నాను. మీర్‌కాశింను నేను అంగీకరించను. నేను తలచుకుంటే మీర్ కాశింను గద్దెనుంచి క్రిందికి లాగి పారేయగలను, నేను ఉన్నత పదవికి చేరుకుంటానికి ఇత

డొక మెట్టు. నేను పైకి తేసుకోగానే ఆ మెట్టును లాగిపారేస్తాను. పక్కలో బిల్లెంగావున్న దీ ఆంగ్లేయులే, ఈపాపాత్ములే, వాళ్ళంపరూ నన్ను బంధించాలను కుంటున్నారు. నేను వారం దగ్గి చేజిక్కించు కోవాలను కుంటున్నాను. నేను మాత్రం వారి చేతికి చిక్కను. ఇప్పుడు సింహాసనం మీాదవున్నది మీార్ కాశిం. అతడికి సహాయకుడిగా వుంటూ బెంగాలు నుంచి ఆంగ్లేయుల్ని తరిమిపేస్తాను. అంచు నేనే ప్రయత్నించి యుద్ధం తెస్తాను. ఆ తర్వాత మీార్ కాశింను వదలిస్తాను. ఈ మార్గమే మంచిది. కానీ, ఇవ్వాళ ఆకస్మికంగా వచ్చిన ఈ లేడి ఏమిటి ? ఈ యువతి ఇంత అపాయకరమైన పనిలో దిగిన దెందుకో?

అని అతడు ఎవరి విషయాన్ని గురించి ఆలోచిస్తు న్నాడో ఆమెవచ్చి అతనిముందు నిల్చుంది. గుర్గిన్ ఖానా మెకు మరొక ఆసనం చూపించాడు ఆమే దలనీబేగమ్.

"చాలా కాలానికి ఇవ్వాళ నిన్ను చూచి చాల సంతోషం కల్గింది నువ్వు నవాబు చేతుల్లోకి పోయినతర్వాత మరె న్నడూ చూడ నేలేను. ఇంతకూ నువ్వింత అపాయకరమైన పనిలో తలదూర్చిం దెందుకు ?" అని అడిగాడు గుర్గిన్ ఖాన్.

"అపాయకర మెందుకని ?"

"నువ్వు నవాబుగారి బేగమ్‌వు అయివుండి రహస్యంగా రాత్రిసమయమందు నన్ను కలుసుకొనుటకు వచ్చావు. ఇది నవాబుగారికి తెలిసేట్లయితే నిన్నూ, నన్నూ, యిద్దర్నీ చంపిస్తారు."

"ఒకవేళ ప్రాణాలుపోయేస్థితే వచ్చినప్పుడు మనిద్దరికీ

వున్న సంబంధాలనుగురించి చెప్పేస్తాను. అలాచేయటంవల్ల కోపంరావాల్సిన అవసరమే కలుగదు."

"నువ్వు చిన్నదానవు, అందుకనే అలా నమ్ముతున్నాను. ఇంతకాలమునుంచి మనం ఆ సంబంధాన్ని గురించి వెల్లడించలేను. నిన్ను నేనెరుగుదుననిగానీ, నన్ను నువ్వెరుగవనిగానీ నేనెవరికీ ఇంతవరకు చెప్పివుండలేదు – అలాంటి పరిస్థితుల్లో ఇప్పుడు ఆపదలో చిక్కుకొని చెపితే ఎవరు నమ్ముతారు ? ఇదంతా తప్పించుకొనే ఉపాయమనే అంటారెందరూ. నువ్వురావటం మంచిదికాదు."

"నవాబుగారికి తెలుస్తుందని ఎందుకనుకోవాలి ? కాపలావాళ్ళందరూ మీ అధీనులు. మీరు ఇచ్చిన సంకేతాన్ని చూచే వారు నన్ను రానిచ్చారు. నేనొకవిషయం అడగాలని వచ్చాను. ఆంగ్లేయులతో యుద్ధం జరుగుతుందట నిజమేనా?"

"ఆ విషయమే అయితే నీకు కోటలోవుంటే తెలిసేది గదా !"

"తెలిసింది, ఆంగ్లేయులతో యుద్ధం జరగటం ఖాయమనీ, మీరే వాళ్ళను యుద్ధానికాహ్వానించారనీ కోటలో విన్నాను – ఎందుకని ?"

"నువ్వింకా చిన్నదానవు, ఇది నీకెలా అర్థమవుతుంది?"

"నేను చిన్నదానివలె మాట్లాడానా ? చిన్నదానివలె పనిచేశానా ? మీ సహాయంకోసమని నన్ను నవాబుగారి జనానాలో వుంచారే, అటువంటప్పుడు నన్ను చిన్నదానివలె త్రోసివేస్తే ఎలా వూరుకుంటాను ? అలావీల్లేదు ?"

"వీల్లేకపోతే పోనీ, ఆంగ్లేయులతో యుద్ధం జరిగినందువ

వల్ల నీకూ నాకూ వచ్చే నష్టమేముంది ?"

"జయిస్తాననే ఆశిస్తున్నాను"

"ఆంగ్లేయుల్ని ఇప్పటివరకు ఎవరైనా జయించగలిగారా ?"

"వాళ్ళుమాత్రం గుర్గన్‌ఖాన్‌లాంటివారితో యుద్ధం చేశారా ?"

పిరాజుదౌలాకూడా అదే ఆలోచించాడు. సరే, ఏదైనాకానీ, నేను స్త్రీని; మనస్సుకేదితోస్తే దానినే విశ్వసిస్తాను. మనం ఏ విధంగానూ ఆంగ్లేయుల్ని జయించలేమనే నా మనస్సు చెపుతుంది. ఈ యుద్ధంలో మనదంతా సర్వనాశనమై పోతుంది. కనుక మీరీ యుద్ధంలో జోక్యం కలిగించుకోవద్దని ప్రార్థించాలనే వచ్చాను నేను."

"ఇటువంటి విషయాలలో స్త్రీల సలహాలు తీసుకోరు."

"నా అభిప్రాయాన్ని మన్నించాలి మీరు, మీరు నన్ను రక్షించాలి" అంది దలనీబేగమ్. గుర్గన్‌ఖాన్ ఆశ్చర్యంలో మునిగిపోయాడు –

"ఎందుకు, ఏడుస్తున్నావెందుకు ? మీర్‌కాశిం పదచ్యుతుడైపోతే నిన్ను నాదేశానికి తీసుకువెళ్తాను" అని చెప్పాడు గుర్గన్‌ఖాన్ క్రోధాగ్ని ప్రజ్వరిల్లింది దలనీ కన్నుల్లో. "మీర్‌కాశిమ్ నాభర్త అనేవిషయం నువ్వుమర్చిపోతున్నావా?" అని కోపంగానే అంది దలనీ. "నాకు చుట్టూ అంధకారంగానే వుంది" అని దలనీ ఏడ్వసాగింది. గుర్గన్‌ఖాన్‌కు చాలా విస్మయంకల్గింది. నిశ్చేష్టుడై "లేదు, మర్చిపోవటం లేదు, కానీ, ఎవరిభర్తకూడా కలకాలం వుండడు. ఒక భర్త

పోతే మరొకభర్త లభించవచ్చు. నువ్వేనాటికైనా భారత దేశంలో మరొక నూర్జహాన్ వవుతావనే ఆశవుంది నాకు".
అన్నాడు.

దలనీ క్రోధంతో కంపిస్తూ లేచి నిల్చొని కన్నీళ్ళు నాపుకొంటూ తీవ్రదృష్టితో అతడికేసి చూస్తూ "నువ్వు నాశనమైపోవాలి. ఏ దుర్ముహూర్తంలోనో నేను నీ చెల్లెలిగా జన్మించాను — ఏ దుష్టఘడియలోనో నేను నీకు సహాయం చేస్తానని వాగ్దానం చేశాను. స్త్రీలలోవుండే ప్రేమ, దయ, ధర్మాలు నీకు తెలియవు. అర్థంకావు. నీవు యుద్ధసంకల్పాన్ని మార్చుకుంటే మంచిది, లేనిచో నేటినుంచి నీతో నాకు మరే సంబంధం వుండదు సంబంధం లేకపోవటమే కాదు, నేటి నుంచి నీతో వుండేది శత్రుత్వమే. నువ్వేనాకు పరమశత్రువు వని భావిస్తాను. నేను నీ బద్ధవిరోధినని నువ్వు అనుకో. ఈ నవాబు జనానాలో నేను నీబద్ధ శత్రువును —" అని అన్నది.

ఆ మాట అని దలనీబేగం రివ్వునదూసుకొని బయటకు వెళ్ళిపోయింది. దలనీ వెళ్ళిపోయిన తర్వాత గుర్గన్‌ఖాన్ ఆలోచించసాగాడు. దలనీ ఇప్పుడిక తనది కాదు, మీర్‌కాశిం పక్షమైపోయిందని భావించాడు. అన్న అని తనను ప్రేమించవచ్చు కాని ఆమె ప్రేమంతా మీర్‌కాశింమీదే వుంటుంది. తన అన్న తన భర్తకు కీడుచేసేవాడనీ గ్రహించినప్పుడెప్పుడైనాసరే, తనభర్త మేలుకోసం సోదరునికే కీడు తలపెట్టవచ్చు. అందువల్ల ఆమెనిక కోటలోనికిచేరనీయటం మంచిది కాదు. గుర్గన్‌ఖాన్ ద్వారపాలకుడ్ని పిలిచాడు.

ఒక సశస్త్ర సైనికుడు వచ్చాడు, దలనీబేగమ్‌ను కోట

లోనికి వెళ్ళనీయవద్దని అతడు ఆ సైనికునిద్వారా పహారా వాళ్ళకు వార్తపంపాడు.

దూతగుర్రముపై స్వారీయై దలనీకంటేముందే కోట ద్వారంవద్దకు చేరుకున్నాడు. దలనీబేగం కోటద్వారంవద్దకు చేరి తనను లోనికి వెళ్ళనివ్వవద్దని ఆదేశించినట్లు విన్నది.

ఆ మాట వినేసరికి తెగిపోయిన లతవలె దలనీ కూర్చుండిపోయింది. కన్నీరు ధారగట్టింది. "నాకు నిలవనీడ కూడా లేకుండా చేశాడు అన్న" అని అనుకుంది.

"తిరిగి సైన్యాధిపతిగారింటికి వెళ్దాం పద" అన్నది కుల్‌సమ్.

"ఇహ వెళ్ళేదెక్కడికి, ఆ గంగా గర్భంలోనే నాకిక ఆశ్రయం" అంది దలనీబేగమ్.

ఆ రాత్రి అంధకారంలో దలనీ మార్గంలో నిలబడి ఏడ్వసాగింది. పైన ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి. చెట్లపై వికసించివున్న పువ్వులవాసనలొస్తున్నాయి. మందవాయు గమనానికికూడా చీకటిని కప్పుకొని వున్న చెట్లఆకులు, గరగరలాడుతున్నాయి. దలనీ ఏడుస్తూ "కుల్‌షమ్" అన్ని అంది.

# 3

ఒక్క దాసీమాత్రమే వెంటవుంది. రాత్రిసమయాన బేగం బజారులో నిలబడి ఏడుస్తూవుంది. "ఇప్పుడేంచేద్దాము ?" అని అడిగింది కుల్‌షమ్.

దలనీ కన్నీరు తుడుచుకొని "విశ్రాంతి! ఈ చెట్టు క్రిందే నిల్చుని వుంటాను. ఉదయమవుతుంది" అని అంది.
"తెల్లవారేవరకూ ఇక్కడేవుంటే మనం పట్టుబడతాము".

"అందుకు 'భయమెందుకు' భయపడటానికి నేనేం తప్పుచేశాను ?"

"మనం దొంగలవలె అంతఃపురంవదలి వచ్చాము. ఎందుకువచ్చామో, అది మీాకే తెలియాలి. కానీ, ప్రజ లేమనుకుంటారు ? నవాబుగారేమనుకుంటారు ? ఒకసారి ఆలో చించి చూడండి" అంది కుల్‌సమ్.

"ఏదైనా అనుకోనీ, నువనకు న్యాయంకలిగించే దా భగ వంతుడే, ఇతరుల్ని నేనంగీకరించను, లెక్కచేయను. అలాకాని పరిస్థితుల్లో చస్తాను. నష్టమేముంది ?"

"కానీ, ఇక్కడ నిలబడి వుండటంవల్ల జరిగేపనేముంది?"

"ఇక్కడే నిలబడివుంటే పట్టుబడతాను – ఆ అభి ప్రాయంతోనే ఇక్కడ నిలబడి వుంటాను, పట్టుబడాలనేదే నా కోర్కె. పట్టుకొని నన్నెక్కడికి తీసుకువెళ్తారు ?"

"దర్బారులో..."

నవాబుగారి యెదుటకా ? నేను వెళ్ళదలచేదికూడా అక్కడికే. నేను వెళ్ళటానికి మరోమార్గంలేదు. వారు నాకు మరణదండన విధించినప్పటికీ చనిపోయేముందు నేను నిరపరాధి నని మాత్రం చెప్పుకోగలుగుతాను. ఇక్కడ మాత్రం ఎందుకు మనం కోటద్వారంవద్దనే కూర్చుందాం. పద, – అక్కడైతేనే త్వరగా పట్టుబడతాము."

ఇంతలో వారిద్దరూ భయపడి అటుచూసేసరికి ఒక

విశాలకాయుడు గంగానది వైపుకు పోతూ వున్నాడు. వారిద్దరూ చెట్టుక్రిందికి వెళ్ళి చీకట్లో దాక్కున్నారు. వారిద్దరూ భయంతో అటే చూస్తున్నారు. ఆ మనిషి గంగానది దిక్కుగా గాక ఆ చెట్టువైపురావటం గమనించారు. వారిద్దరూ చీకట్లోకి మరింత కదనాక్కుకున్నారు.

ఆ విశాలకాయుడు ఆ చెట్టుక్రిందకే వచ్చాడు. "ఎవరక్కడ ?" అని అడిగి, తనలో తానే అనుకున్నట్లు "నావలె ఈ ప్రాంతల గాలించే దురదృష్టవంతులెవరున్నారు ?" అన్నారు.

ఆ విశాలకాయునిచూచి స్త్రీలకు చాలా భయం కలిగింది, కానీ, అతని కంఠస్వరాన్ని విని వారి భయం తొలిగిపోసాగింది. అతని కంఠస్వరం మధురంగా - దయాదాక్షిణ్యాలతో నిండివున్నట్లుంది. "మేము స్త్రీలము, తమరెవరు ?" అని అడిగింది కుల్‌సమ్.

"నేనా మీరెందరున్నారు. ఇంతరాత్రపుడు ఇక్కడేం చేస్తున్నారు, అని అడిగాడావ్యక్తి.

"మేము నిర్భాగ్యురాండ్రము - మా దుఃఖగాథను విన్నందువల్ల మీకేమొస్తుంది ?" అంది దలనీ.

"నేనొక సాధారణ వ్యక్తిని, సామాన్యమానవునివల్ల కూడా ఇతరులకు మేలుకలుగవచ్చు. మీరేదైనా ఆపదలో వుంటే శక్తివంచనలేకుండా మీకు సహాయం చేస్తాను." అన్నాడామనిషి.

"మాకు మేలుజరగటమనేది అసంభవం !"

"నేను సామాన్య వ్యక్తిని - ఒక దరిద్ర బ్రహ్మచారి."

"మీరెవరైనా కానివ్వరండి, మీ మాటలనుబట్టి మీ యందు విశ్వాసం కలుగుతోంది. ప్రవాహంమధ్య మునిగి పోయే వ్యక్తి చేతికందిన ఆసరా బలమైనదో కాదో చూడడు.

కానీ మీకు మా ఆపదను గురించి తెలుసుకోదలచి నట్లయితే దూరంగా వెళ్దాం రండి, చీకట్లో ఎక్కడ ఎవరు న్నారో ఏం చెప్పగలం. మా విషయం అందరి ఎదుట చెప్ప వలసినది కాదు" అని చెప్పింది దులనీ.

"అయితే, మీరు నా వెంటరండి" అని చెప్పి బ్రహ్మ చారివారిద్దర్ని వెంటబెట్టుకొని నగరంలోకి బయలుదేశారు. ఒక చిన్న ఇంటి ముందునిలచి తలుపుతట్టుతూ, "రామచరణ్" అని పిలిచాడు. రామచరణుడు వచ్చి తలుపు తెరిచాడు. దీపం వెలిగించమని ఆదేశించాడు బ్రహ్మచారి.

రామచరణుడు దీపం వెలిగించి బ్రహ్మచారికి సాష్టాంగ ప్రణామం చేశాడు. "నువ్వు వెళ్ళిపడుకో" అని చెప్పాడు బ్రహ్మచారి. రామచరణుడు ఒకసారి కుల్‌సమ్, దులనీల వంక చూచి వెళ్ళిపోయాడు. ఆరాత్రి రామచరణునికి నిద్రరాలే దని వేరే చెప్పనవసరం లేదు. ఠాకురుగారు ఇంతరాత్రప్పుడు ఇద్దరి స్త్రీలను తీసుకొని ఎందుకు వచ్చారు అనే భావం తీవ్ర మైంది అతనిలో. రామచరణుడు బ్రహ్మచారిని తన మన స్సులో దేవతగా భావించుకొన్నాడు. జితేంద్రియుడను కున్నాడు—ఆ విశ్వాసమేమీ తగ్గలేదు. వీళ్ళెవరు వితంతు లై వుంటారు సహగమనం చేయుమని నచ్చజెప్పేందుకే ఠాకుర్‌గారు వారిని తీసుకొచ్చివుంటారు—ఎంతపాపపాటు,

ఈమాత్రం విషయాన్నింతసేపూ అర్థం చేసుకోనక పోవటం. విచారకరమే, అని సిద్ధాంతీకరించుకున్నాడు. చివరకు రామచరణుడు.

బ్రహ్మచారి ఒక ఆసనంపై కూర్చున్నాడు. స్త్రీలు నేలమీదే కూర్చున్నారు. దలనీబేగమ్ ముందు తననుగురించి చెప్పి తదుపరి రాత్రి జరిగిన విషయాలన్నీ మనస్సువిప్పి చెప్పింది.

"బ్రహ్మవాలు తప్పుతుందా? జగవలసినది, జరిగే తీరుతుంది. అంతమాత్రాన పురుష ప్రయత్నం మానుకోవటం కూడా కర్తవ్యంకాదు. చేయవలసిన కర్తవ్యాన్ని చేసితీరు తాను"! అని తనలో తానే యోచించు కున్నాడు బ్రహ్మచారి.

"అయ్యా ! ఓ బ్రహ్మచారీ ఠాకుర్! గ్రంథాలన్నిం టినీ నీ వెందుకు భస్మంచేశావయ్యా? గ్రంథాలన్నీ ఆహుతై పోయాయి. కాని హృదయ గ్రంథం మాత్రం భస్మంకాలేదు.

"మీరు ముందుగా నవాబుగారి ఎదుటకు వెళ్ళవద్దనే నా అభిప్రాయం. ముందు ఉత్తరం ద్వారా విషయాలన్నిం టినీ వారికి తెలియ జేయండి మీ యందు వారికి ప్రేమ వుంటేవారు మీ మాటల్ని తప్పక విశ్వసిస్తారు. తదుపరి వారి ఆదేశాన్ని పొంది వారి వద్దకు వెళ్ళండి" అనిచెప్పాడు బ్రహ్మచారి దలనీబేగమ్‌తో.

"ఉత్తరం ఎవరా తీసుకు వెళతారు?

"నేను పంపుతాను."

అప్పుడు దలనీ కాగితం కలం అడిగింది. బ్రహ్మచారి

మరల రామచరణుడ్ని మేలుకొల్పాడు. రామచరణుడు, కాగితం, కలం ఇచ్చి వెళ్ళిపోయాడు. దలనీబేగమ్ ఉత్తరం వ్రాయ సాగింది.

బ్రహ్మచారి వెంటనే ఆమె నుద్దేశించి "ఇది నా యిల్లు కాదు, కాని రాజుగారి అనుమతి వచ్చువరకు మీరిక్కడే వుండండి—ఎవరికీ తెలియదు. ఎవరూ మిమ్మల్ని వేమీ అడగరు" అని చెప్పాడు.

వివశులై స్త్రీలిద్దరూ అందుకంగీకరించారు. వ్రాయటం పూర్తిచేసి దలనీబేగమ్ ఉత్తరాన్ని బ్రహ్మచారి చేతి కిచ్చింది. స్త్రీలు ఉండటాన్ని గురించి రామచరణునికి యథో చిత రీతిని తెలియజెప్పి బ్రహ్మచారి వెళ్ళిపోయాడు. ముంగే రులోని హిందూరాజ్యాధికారులందరూ బ్రహ్మచారికి బాగా పరిచితులు. ముస్లిం అధికారులు కూడా అతన్ని గుర్తించే వారు, అందువల్ల అధికారు లందరూ అతన్ని గుర్తించేవారు.

మున్షీరాయ గోవిందరాయ బ్రహ్మచారిని ఎంతో భక్తి భావంతో చూసేవాడు, బ్రహ్మచారిసూర్యోదయంకాక ముందే ముంగేరుకోటలో ప్రవేశించి రాయగోవిందరాయ్‌ను కలుసుకొని దలని ఉత్తరాన్ని వారికిచ్చాడు. "అక్కడ నా పేరెత్తవద్దు. ఒక బ్రాహ్మణుడు తెచ్చి యిచ్చాడని మాత్రమే చెప్పు" అని అన్నాడు.

"జవాబుకు రేపురండి" అని చెప్పాడు మున్షీ. ఆఉత్తరం ఎవరిదో మాత్రం మున్షీ తెలుసుకోలేదు. బ్రహ్మచారి తిరిగి పైన చెప్పిన గృహానికి వచ్చేశాడు. దలనీనుద్దేశించి "రేపు వస్తుంది జవాబు. ఎల్లానో ఈరోజు గడపండి"

అన్నాడు.

రామచరణుడు ఉదయం లేచి చూచేసరికి అక్కడ సహగమనపు లక్షణాలేమీ కన్పించలేదు. ఆ ఇంటిలో నీకు మరొక భాగంలో ఇంకోవ్యక్తి నిద్రిస్తున్నాడు. అతడి చరిత్ర నిక్కడ కొంచెం ఉల్లేఖించటం అనవసరం. శైవలిని పాప చరిత్రతో కళంకితమైన నాకలం వారి చరిత్ర వ్రాసినయడల పవిత్రమై పోతుంది.

# 4

సుందరి చాలా క్రోధంతో శైవలివున్న నావలోనుంచి తిరిగి వచ్చేసింది. దారిపొడుగునా భర్తముందు శైవలినిని తిడుతూనేఉంది. దారదృష్టపు పీనుగా, గుర్రపు ముఖమనీ, కళంకిని, యనే ప్రియ సంబోధనలతో శైవలినిని తిడుతూ భర్త కౌతూహలాన్ని పెంపొందిస్తూ ఇంటికి చేరుకుంది, ఇంటికి వచ్చి ఎంతో ఏడ్చింది. ఆ తరువాత చంద్రశేఖరుడు వచ్చి, దేశాంతరం వెళ్ళిపోయాడు. ఆ తర్వాత కొద్దిరోజులు అలాగేగడిచిపోయాయి. శైవలిని, చంద్రశేఖరుల జాడలేమీ తెలియ రాలేదు. ఒకనాడు సుందరి ఢకాచీర ధరించి, ఆభర ణాల నలంకరించుకొంటూ కూర్చుంది.

సుందరి చంద్రశేఖరుని పొరుగింటి వారమ్మాయని ముందే చెప్పాము. చంద్రశేఖరునికి చెల్లెలవుతుంది. తండ్రిని ఒంటరిగా వదలివెళ్ళటం ఇష్టంలేక సుందరి ఎప్పుడూ తండ్రి వద్దనే వుంటూవుండేది, ఆమె భర్త శ్రీనాథుడు, ఇల్లరికవు

టిల్లుడు కాకపోయినా అప్పుడప్పుడు వచ్చి అత్తవారింట్లో వుంటూవుండేవాడు. శ్రీనాథుడు శైవలినికి ఆపదవచ్చినప్పుడు వేదగ్రామంలోనే వున్నాడనేవిషయం ముందే చెప్పాము. ఆ ఇంటినంతా చక్కదిద్దుకునేది సుందరే. తల్లి జబ్బుమనిషి, ఏమీ చేయలేదామె. సుందరికి మరొకచెల్లెలుకూడా వుంది. ఆమెపేరు రూపసి. ఆమె తన అత్తవారింట్లోనే వుంటూంది.

సుందరి ఖరీదైనచీర, ఆభరణాలు ధరించి "నేనూ రూపసినిచూచి వస్తాను" అని చెప్పింది తండ్రితో "నాకామెను గురించి పీడకలలొస్తున్నాయి" అనికూడా అంది. సుందరితండ్రి కృష్ణకమలచక్రవర్తి కుమార్తె చెప్పుచేతుల్లోని మనిషి. రెండు మూడు ఆటంకాలు చెప్పినా చివరకు అంగీకరించారు. సుందరి రూపసి అత్తవారింటికి వెళ్ళింది. శ్రీనాథుడు తనయింటికి వెళ్ళాడు.

రూపసి భర్త ఎవరు? మనకు చిరపరిచితుడైన ఆ ప్రతాపే. చంద్రశేఖరుడు శైవలినిని వివాహమాడిన తర్వాత అత్తవారింటి పొరుగునవున్న ప్రతాపుడ్ని తరుచు చూస్తూండే వాడు - ప్రతాపుని చరిత్రనుచూచి చంద్రశేఖరుడు సంతుష్టి చెంది, సుందరిచెల్లెలు రూపసి యుక్తవయస్కురాలు కాగానే అతనికిచ్చి వివాహంచేయించాడు. అంతేగాదు, చంద్రశేఖరుడు కరీమ్‌ఆలిమ్‌ఖాన్‌కు గురువు, చాలా సన్నిహితసంబంధాలు కూడా వున్నాయి, ప్రతాపునికి ప్రభుత్వోద్యోగంకూడా ఇప్పించాడు. ప్రతాప్ తన గుణగణాలవల్ల దినదినాభివృద్ధి గాంచాడు. రాగారాగా నేటికొక జమీందారయ్యాడు. విశాలమైన స్వంతభవనాలున్నాయి. అతడిపేరు దేశమంతట్లో

ప్రసిద్ధి చెందింది. సుందరి పల్లకీ ఆ నగరానికే చేరింది. రూపసి ఆమెను చూచి నమస్కరించి, ఆదర సత్కారాలతో లోనికి తీసుకొని వెళ్ళింది. ప్రతాప్ వచ్చి వదినగారిని క్షేమ సమాచారాలడిగాడు. ఆ తర్వాత మాటలసందర్భంలో వేదగ్రామ విశేషాలన్నీ అడిగాడు. చివరకు చంద్రశేఖరుని గురించికూడా అడిగాడు. "నేనావిషయమే చెప్పాలని వచ్చాను. విను చెప్తాను" అని సుందరి. చంద్రశేఖరుడు, శైవలిని విషయాలన్నీ వివరంగా చెప్పింది. విని ప్రతాపునికి చాలా విస్మయంకల్గింది. నిశ్చేష్టుడై కాస్సేపాగి ఇన్ని రోజులనుంచి ఈవిషయం కల్గింది.
నిశ్చేష్టుడై కాస్సేపాగి "ఇన్నిరోజులనుంచి ఈ విషయం నాకెందుకు చెప్పలేదు ?" అని కొంచెం తీక్షణంగానే అడిగాడు.

"ఎందుకు నీతో చెప్తేమాత్రం జరిగేదేముంది ?" అంది సుందరి.

"ఏం జరుగుతుందా ? మీరు స్త్రీలు, మీ ఎదుట గొప్పలు చెప్పుకోవటంకాదుగాని నాకు కబురంపివుంటే కొంత మేలు జరిగేదని చెప్పగలను." అన్నాడు చంద్రశేఖరుడు

"నువ్వు మేలుచేస్తావో లేదో నాకెలా తెలుస్తుంది ?"

"ఏం, నీకు తెలియదా ఏం - నాకు ఉన్నదంతా చంద్రశేఖరునితోనేగా ?"

"మనుష్యులు గొప్పవారయ్యేసరికి పూర్వపు విషయాలన్నీ మర్చిపోతారట" అంది సుందరి.

ప్రతాపుడు క్రోధంతో, వివశుడై శూాసం వహించాడు. ఆ కోపాన్ని చూచి సుందరికి చాలా సంతోషం కల్గింది.

మరునాడు ప్రతాపుడు ఒక వంటవానిని, ఒక నౌకర్ని

మాత్రమే వెంటతీసుకొని ముంగేరుకు బయలుదేరాడు. నౌకరినిపేరు రామచరణుడు. ప్రతాపుడు ఎక్కడికి వెళ్తుందీ ఎవరికీ చెప్పలేదు, చంద్రశేఖర శైవలనీలను వెదకటానికి వెళ్తున్నానని రూపసితో మాత్రం చెప్పాడు. జాడ తెలియనిదే తిరిగి రానని కూడా చెప్పాడు. బ్రహ్మచారి దలనీబేగంను వుంచిన గృహమే ముంగేరులో ప్రతాపుని నివాసము.

సుందరి కొద్దిరోజులు చెల్లెలివద్దవుండి నిరాశతో శైవలినిని తిట్టింది. ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము తీరిక చేసుకొని రూపసివద్ద కూర్చుని శైవలినివంటి పాపాత్మురాలింత వరకు జన్మించలేదని! నిరూపించ యత్నించేది "అటువంటప్పుడు ఆమె కోసం ఇంతగా ప్రాణాలొడ్డి పరుగులు పెడతారెందుకు ?" అని అడిగిందొకనాడు రూపసి.

"ఆమె తల చితగ్గొట్టాలని, ఆ యమధర్మరాజువద్దకు పంపాలనీ, ఆ ముఖాన్ని నిప్పులో వేసి తగలెట్టాలనీ" అంటూ చెప్పింది.

"అక్కా, నీకు బహుకోపమే !"

"నన్నింత ముక్కోపిగా చేసిందామే !"

# 5

నవాబుతో యుద్ధం జరుగుతుందనే కలకత్తా కౌన్సిలు నిర్ణయించింది. ప్రస్తుతం అజామాబాదు (పాట్నా)కు కొంత సైన్యాన్ని పంపటం అవసరం అందుకని ఒకనొకనిండా ఆయుధాలునింపి పంపారు.. . . . .

అజమాబాదులోని అధ్యక్షుడు ఎలిస్ దొరగారికి ఒక రహస్య ఆదేశాన్ని పంపటం అవసరమయింది. ఆమిటయ్ దొరగారు నవాబుగారితో వచ్చిన వివాదాన్ని పరిష్కరించేందుకు ముంగేరులో వున్నారు - అక్కడ ఆయన చేస్తున్నదేమిటో తెలియనిదే ఎలిస్ దొరగారికి సరియైన ఆదేశాలివ్వటానికి వీలు లేదు. అందువల్ల ఒక చతుర కార్యకర్తను పంపటం అవసరం అయింది. అతడు ఆమిటయ్ దొరగారిని కడుసుకొని, వారి అభిప్రాయాన్ని తెలుసుకొని ఎలిస్ దొరగారివద్దకు వెళ్తాడు. కలకత్తా కౌన్సిలు అభిప్రాయాన్ని వారికెరింగిస్తాడు.

ఈ పనులన్నీ చేయటానికే గవర్నర్ వాంసిటార్ట్ ఫాస్టరును పురందరపురాన్నుంచి పిలిపించాడు. అతడు ఆయుధాలు తీసుకుపోయే నావలో వెళ్ళి, ఆమిటయ్ దొరగారిని కలుసుకొని పాట్నా వెళ్తాడు. అందువల్ల ఫాస్టరు కలకత్తా రాగానే పశ్చిమ యాత్రకు వెళ్ళాల్సివచ్చింది. అతనికీ విషయాలన్నీ ముందుగానే తెలిసివుంచటంవల్ల అతడు శైవలినిని కలుసుకొన్నాడు. ఫాస్టరు ఆయుధాల నౌకనుకూడా చేర్చి శైవలినివున్న నౌకను ముంగేరు రేవులో ఆపాడు. ఆమిటయ్ దొరగారిని కలుసుకొని శలవుతీసుకొని బయలుదేరగానే గుర్గన్ ఖాన్ నావల్ని ఆపివేశాడు. అప్పుడే ఆమిటయ్ దొరగారికి నవాబుగారికి మధ్య చర్చలు ప్రారంభమయినై. నవాబుగారు నావల్ని వదలిపెట్టకపోతే ఫాస్టరు ఆయుధనౌకను ముంగేరులోనే వదలి పాట్నాకు వెళ్ళిపోవాలని ఫాస్టరుదొరగారు నిర్ణయించుకున్నారు.

ఫాస్టరు రెండు నౌకలూ ముంగేరులో ఆగివున్నాయి.

ఒకదేశీనౌక, చాల పెద్దది, రెండవది బోటువంటిది. దేశీ నావపై నవాబుగారి సైనికులు కాపలా వున్నారు. ఒడ్డున కూడా అనేకమంది సైనికులున్నారు, ఆ నావలోనే ఆయుధాలున్నాయి - గుర్గన్ ఖాన్ ఆపగోరిందికూడా ఆ నావనే.

రెండవ నౌకలో మాత్రం ఆయుధాలు లేవు. రెండింటికి మధ్యయాభై గజాల దూరముంది. అక్కడ నవాబుగారి పహారా లేదు. ఆ నావ పైభాగాన 'తిలంగా' అనే ఒక సైనికుడు మాత్రం కాపలా వున్నాడు.

రాత్రి రెండుజాములైంది, అంధకారం అలముకుంది. నావపై నున్న పహారా సైనికుడు కూర్చుంటూ, లేస్తూ, కునుకుపాట్లు పడుతూ పచారుచేస్తూవున్నాడు. రేవు పక్కన ఒక చిన్న అడవివుంది. దానిలోంచి ఒక మనిషి ఆసక్తగా చూస్తూవున్నాడు. చూచేది ప్రతాపరాయే.

ప్రతాప్‌రాయ్ సైనికుడు పచారుచేస్తూ వుండటం గమనించాడు. నెమ్మదిగా వచ్చి నీటిలోదిగాడు. ఆ శబ్దాన్ని విని కాపలా సైనికుడు పచారుచేస్తూనే "ఎవరక్కడ" అని కేక వేశాడు. ప్రతాప్‌రాయ్ మారుపలుకలేదు. పహారా సైనికుడు అలా పచారు చేస్తూనేయున్నాడు. ఘాట్టు నావలో మేల్కొని సావధానంగా వున్నాడు. పహారావాని పిలుపులిని అతడుకూడా దిగుతూ చుట్టూపరిశీలనగా చూచాడు. ఒక మనిషి స్నానంచేయటానికి వుండటం గమనించాడు.

ఇంతలో అకస్మాత్తుగా ఆ అడవిలోనుంచి తుపాకి శబ్దం విన్పించింది. నావపైనున్న కాపలావాడు గుండుదెబ్బతిని నీళ్ళల్లోకి దొర్లాడు. అప్పుడు ప్రతాప్, నావనీడకు వచ్చి తల

వరకు మునిగినిల్చున్నాడు.

తుపాకిశబ్దం వినగానే రెండవనావలోని సైనికులు "ఏమి ఏమిటి?" అంటూ గందరగోళంచేశారు. నావలో మిగిలివున్న వారందరూ మేల్కొన్నారు. ఫాస్టరు తుపాకి చేత్తోపట్టుని బైటకు వచ్చాడు.

లారెన్సు ఫాస్టర్ బైటకువచ్చి చుట్టూ దృష్టిసారించి చూచాడు. మెల్లగా మాయమవటం గమనించాడు. అతని శవం నీళ్ళలో మునుగుతూ తేలుతూ వుండటం కన్పించింది. నక్షత్రాల క్షీణకాంతిలో మొదట, నవాబుగారి సైనికులే చంపారనుకున్నాడు. కాని ఇంతలో అడవిలో ఒక సన్న ధూమ్రరేఖ కన్పించింది. రెండవ నావలోని వారందరూ విషయమేమిటో తెలుసుకోవాలనే ఆదుర్దాతో వస్తూ వుండటం గమనించాడు. ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తు న్నాయి. గంగానదీతీరాన పెద్దపెద్ద నావ లనేకం వరుసగా చచ్చిపడివున్న రాక్షసులవలె శాంతంగా నిలిచివున్నాయి. కలకలధ్వనితో గంగానది ప్రవాహం సాగిపోతుంది. ఆ ప్రవా హంలోనే కాపలావాని శవం కొట్టుకొని పోతుంది, ఫాస్టరు ఇదంతా ఒక క్షణకాలంలో గమనించాడు. ఫాస్టరు తన చేతిలోని తుపాకిని పైకెత్తి, ఆ అడవిలో కన్పించిన ఆ క్షీణ ధూమ్రరేఖను గురిపెట్టాడు. ఆ అడవిలోనే శత్రువున్నాడని ఫాస్టరు వెంటనే గ్రహించాడు. శత్రువు దాగివుండి సైని కుణ్ణి కాల్చాడనికూడా ఫాస్టర్ అర్థంచేసుకున్నాడు. అత డిప్పుడు తననుకూడా చంపవచ్చు. కాని అతడు భారతదేశా నికి వచ్చింది ప్లాసీయుద్ధం జరిగిన తర్వాతనే. ఈ దేశస్థుడు

ఇంగ్లీషు వానిని చంపగలడని అత నింతవరకు విశ్వసించలేక పోయాడు. ఇంగ్లీషువాడై వుండి. ఈదేశస్తునికి భయపడటం కంటె చావటమే ఉత్తమం. ఈ ఆలోచనతోనే అతడునిలబడి తుపాకి గురిచూస్తున్నాడు. కానీ ఇంతలో మళ్ళీతుపాకి శబ్దం విన్పించింది. ఫాస్టరు తలమీద దెబ్బతగిలింది. అతని చేతిలో తుపాకి క్రిందపడింది. అతని శవం నీళ్ళలో దొర్లిపోయింది.

ప్రతాప్‌రాయ్ వెంటనే మొలనున్న కత్తిని తీసి నావ త్రాళ్ళన్నిటినీ కోసివేశాడు. అక్కడ ప్రవాహవేగంతక్కువగా వుందని నావికులు లంగరు వేయలేదు. లంగరువేసివున్న ప్రతాపుని శక్తిముందు అదెంత? ప్రతాపుడు ఒక్క దుముకు నావ పైకి చేరుకున్నాడు.

ఈ సంఘటనను వర్ణించిన దానిలో నూరవవంతు సమయం పట్టివుంటుంది ప్రతాపునికి ఆ పనిలో. కాపలావాడు పడిపోవటం, ఫాస్టరుతుపాకి తీసుకు బయటకు రావటం. అతడు కూడా నీటనొరగటం, ప్రతాపుడు నావపైకిరావటం. ఇదంతా జరిగేలోపున రెండవ నావలోని వారు ఈ నావలోనికి కూడా రాలేక పోయారు.

క్షణంలో నౌక ప్రవాహంమధ్యకు చేరుకుంది. ఒక మనిషి నావనుపట్టుకునేందుకు నీటిలో దుమికాడు. ప్రతాపుడు నావగడతో అతడి నెత్తిపై బాదాడు. అతడు వెనుతిరిగి వెళ్ళి పోయాడు. తర్వాత మరెవ్వరూ ముందుకురాలేదు. ఆ గడతోనే ప్రతాపుడు నావను నెట్టాడు. నావతిరిగి ప్రవాహవేగంతో శాస్త్రు తూర్పుదిక్కుగా వెళ్ళిపోయింది.

గడతోపాటు వెనుదిరిగి చూచేసరికి మరొక తిలంగా

సైనికుడు మోకాళ్ళపై కూర్చుని తుపాకిగురి చూస్తున్నాడు. ప్రతాపుడు గడతిప్పి అతడిచేతిమీద కొట్టాడు. తుపాకి చేతి నుంచి జారి క్రిందపడింది, ప్రతాపుడా తుపాకిని, ఘోస్టుచేతి నుంచి పడిపోయినతుపాకినీ తీసుకున్నాడు. అప్పుడతడు నావలో వున్నవారందరినీ ఉద్దేశించి "అందరూవినండి నాపేరు ప్రతాప్ రాయ్, నవాబుగారికికూడా నాపేరు చెప్తేహడల్. ఈ రెండు తుపాకులు, ఈగడతోనే మీ అందరినీ హతమార్చగలను. మీరందరూ నామాట వినేట్లయితే నేను మిమ్మల్ని ఏమీ చేయను. నేను చుక్కానివద్దకు వెళ్తున్నాను నావికులందరూ తెడ్లువేయకండి, మిగిలినవారందరూ ఎక్కడివారక్కడే వుండి పొండి. కదలితేచాలు, ప్రాణాలకు ఆశవదలుకోవాలి నేను చెప్పినట్లువింటే ఏమీ భయంలేదు."

ఈ విధంగా చెప్పి ప్రతాప్‌గడతో ఒక్కొక్కరినే లేపాడు వాళ్ళందరూ మౌనంగా పడవనడపటానికి సిద్ధపడ్డారు. ప్రతాప్‌రాయ్ వెళ్ళి చుక్కానిపట్టుకున్నాడు. ఎవ్వరూఏమీ మాట్లాడలేదు, పడవ వడిగాపోతుంది. వెనుక నావలోనుంచి రెండూ మూడు పర్యాయములు తుపాకిధ్వని కాల్పులు విన్పించాయి, అయితే ఆనక్షత్రాల గుడ్డివెలుగులో దేనిని గురిచూచారో ఆ గుండ్లు గాలిలో లీనమైపోయాయి. ప్రతాప్ మెదలకుండా వూరుకున్నాడు. కానీ మరీ దగ్గరకు వస్తుండేప్పటికి రెండుసార్లు తుపాకికాల్చాడు. కొందరు గాయపడ్డారు, మిగిలినవారు నావను వెనక్కిమరలించుకొని పారిపోయారు.

అడవిలో దాగివున్న రాజుచరణుడు, ప్రతాప్ సురక్షితంగా బయటపడటం గమనించాడు, రెండవ నౌకలోని సైని

కులు అడవిలోకి రావటంచూచి అక్కడినుంచి మెల్లిగా తప్పుకున్నాడు.

# 6

రాత్రిసమయం, గంగానదిలో విహరిస్తున్న ఆ నౌకలో నిద్రనుండి లేచి కూర్చుంది శైవలిని.

నౌకలో రెండుగదులున్నాయి. ఒకగదిలో ఫాస్టరు వున్నాడు. మరొక గదిలో శైవలిని, ఆమెదాసీ వున్నారు. శైవలిని ఇప్పటికింకా దొరసాని దుస్తులు ధరించలేదు. అదే నల్లంచుచీర, చేతికి అదేగాజులు, కాళ్ళకు కడియాలు, వెంటవున్నది పురందరపురంలోని దాసీ పార్వతే. శైవలిని నిద్రిస్తున్నప్పుడు ఒకకలగన్నది. అదే భీమాచెరువు, నీళ్ళల్లోకి వంగి అందాలను తిలకిస్తున్న వృక్షాలు చుట్టూ ఎత్తైన గట్టు, ఆవృక్షాల వల్ల చిరుచీకట్లు క్రమ్మివున్న ఆతటాకం. శైవలిని పద్మంవలె అందులో తలముంచి వున్నట్లు, ఆ సరోవరంలో ఒక బంగారు రాజహంస విహరిస్తున్నట్లు, ఒడ్డున ఒక శ్వేత వరాహం తిరుగాడుతూవున్నట్లు కలగన్నది. ఆ రాజహంసను చూచి శైవలిని వుత్సాహంతో దానిని పట్టుకోవాలని చూసే సరికి, రాజహంస ఎగిరిపోయింది. తీరానవున్న వరాహం శైవలిని రూపంలోవున్న పద్మాన్ని పట్టుకొనుటకోసం ప్రయత్నిస్తూ వుంది. రాజహంస ముఖం కన్పించటంలేదు, కాని ఆ వరాహముఖం చూచినప్పుడు మాత్రం ఫాస్టరు ముఖం జ్ఞాపకం వస్తోంది. శైవలిని రాజహంసను పట్టుకొనుటకు

ముందుకు వెళ్ళబోతుంది. కాని ఆమె పాదాలు నేలపాతుకు పోయినట్లుంది. అడుగుపడటం లేదు. "నేను హంసను పట్టి ఇస్తాను. నాదగ్గరకు రా!" అని పిలుస్తోంది వరాహం. తుపాకి ధ్వనివిని శైవలిని నిద్రచెదిరిపోయింది. ఆ తరువాత పహరా సైనికుడు నీటిలో పడిపోవడం విన్పించింది. గాఢనిద్రనుంచి అకస్మాత్తుగా మేల్కొనటంవల్ల ఏమిజరిగినదీ వెంటనే అర్థం కాలేదు. ఆ రాజహంస, ఆ వరాహం ఇంకా కన్నులముందు మెదలసాగాయి. మరల తుపాకి ధ్వని విన్పించింది. కోలాహలం చెలరేగింది. ఆమె నిద్రమత్తు పూర్తిగా వదలిపోయింది. బయటగదిలోకివచ్చి తొంగిచూచింది. ఏమీ అర్థంకాలేదు. తిరిగి లోనికి వెళ్ళిపోయింది. లోన దీపం వెలుగుతోంది. పార్వతికూడ మేల్కొన్నది. "ఏమిటా గడబిడ? నీకేమైనా అర్థమౌతున్నదా?" అని అడిగిందామెను శైవలిని.

"లేదు. నాకేమీ తెలియటంలేదు. కాని వాళ్ళ మాటల్నిబట్టి నావలో దోపిడీ జరుగుతున్నట్లుమాత్రం అర్థమవుతోంది.. దొరగారిని చంపివేశారు - అది మన పాప ఫలమే!

"దొరగారిని చంపితే, అందులో మన పాప ఫలమేమున్నది? అతడు చేసుకున్న పాపఫలమే అది."

"దోపిడీ జరుగుతుంది - ఆపద వచ్చేది మనకేగా?" అంది పార్వతి.

"ఆపద ఏముంది? ఒకదొంగతో పాటున్నాను, మరొక దొంగచేతుల్లోకి వెళ్తాను. ఆ తెల్లదొంగల చేతుల్లోంచి నల్ల దొంగచేతుల్లో పడతాము. అందులో ఆపదేమున్నది?"

అని శైవలిని వీపుపై వ్రేలాడుతున్న జడను ముందుకు వేసుకొని వూపుకుంటూ వెళ్ళి అక్కడవున్న చిన్న మంచం మీద కూర్చుని నవ్వుకుంటోంది. ఇదిచూచి పార్వతి "ఇటు వంటప్పుడు మీనవ్వు నాకు చాలా ఏహ్యంగావుంది" అన్నది.

"ఏహ్యంగావుందా, వుంటే నువ్వు ఆగంగలో దూకి చావు. నాకు నవ్వేసమయం వచ్చింది. నేను నవ్వుతాను. ఒక దొంగనిలా పిలుచుకురా. ఒకవిషయం అడుగుతాను."

"పిలువనవసరం లేదు. వాళ్ళే వస్తారు." అంది కోపంగా పార్వతి. ఘూము గడచినా ఒక్క దొంగా రాలేదు. శైవలిని చింతిస్తూ "మన అదృష్టం ఏమిటి? దొంగలను పిలిచి అడగవా?" అని అంది. ఆమె నిలువెల్లా కంపిస్తుంది.

చాలాసేపటికి నావ ఒకతీరానికి చేరింది కొద్దిసేపు అక్కడే వుండిపోయింది. తర్వాత కొందఱు మనుష్యుల చేత లాంతీలు ఒకపల్లకీని తీసుకువస్తున్నారు. ముందు రామచరణుడు నడుస్తున్నాడు.

బోయీలు పల్లకీని దిగవిడిచారు. రామచరణుడు నావపైనున్న ప్రతాపుని దగ్గరకు వెళ్ళాడు. తర్వాత ప్రతాపునితో మాట్లాడి విషయాలన్నీ తెలుసుకొని గదిలో కూర్చున్నాడు. ముందు అతడు పార్వతివంక తర్వాత శైవలినివంక చూచాడు, "మీరు దిగండి!" అన్నాడు శైవలినితో.

"మీరెవరు? ఎక్కడకు వెళ్తారు?" అని అడిగింది శైవలిని.

"నేను మీసేవకుడ్ని. మీ క్షేమం విచారించకండి. నావెంట రండి, ఆద్వారా చనిపోయారు" అన్నాడు రామచరణుడు.

శైవలిని లేచి రామచరణుని వెనుక బయలుదేరింది.

నావలోనుంచి అతని వెనుకనే క్రిందికి దిగింది. పార్వతికూడా వెంటవస్తుంది రామచరణుడు ఆమెను అడ్డగించాడు. భయపడి పార్వతి నావలోనే వుండిపోయింది. రామచరణుడు శైవలినిని పల్లకీనెక్కమని చెప్పాడు. శైవలిని మాటుమాట్లాడకుండా పల్లకీనెక్కింది. రామచరణుడు పల్లకివెంట ప్రతాపుని నివాసానికి వెళ్ళిపోయాడు.

అప్పటికింకా దలనీ, కుల్‌సమ్ లిద్దరూ ఆ ఇంట్లోనే వున్నారు. వారికి నిద్రాభంగం కలుగుతుందేమోనని అతడు శైవలినిని అక్కడికి తీసుకువెళ్ళకుండా పైగదిలోకి తీసుకు వెళ్ళాడు. దీపం వెలిగించి ఆమెకు నమస్కరించాడు. విశ్రాంతి తీసుకోవల్సిందని చెప్పి రామచరణుడు తలుపులుమూసి వెళ్ళిపోయాడు.

"ఇది ఎవరి యిల్లు ?" అని అడిగింది శైవలిని. కానీ, రామచరణుడు ఆమె మాటను విన్పించుకోలేదు.

రామచరణుడు స్వబుద్ధితో దూరం ఆలోచించి శైవలినిని ప్రతాపుని నివాసానికి చేర్చాడు. ప్రతాపుని ఆదేశం అది కాదు. పల్లకీని జగత్ శేట్టిగారింటికి తీసుకువెళ్ళమని అతడు రామచరణునితో చెప్పాడు. "ఇంతరాత్రప్పుడు జగత్ సెట్టి గారింట్లో మేల్కొని వుంటారో లేదో ? ద్వారపాలకుడు లోనికి వెళ్ళనిస్తాడో లేదో ? అడిగితే ఏమి జవాబు చెప్పాలి ? జరిగినదంతా చెప్తే అంతఃపురస్త్రీని నేను పట్టుబడతానేమో ? ఇదంతా ఆలోచించుకొని పల్లకీని అక్కడకు తీసుకొచ్చాడు."

ఇట్లు పల్లకీ వెళ్ళిపోవటం గమనించిన ప్రతాప్ నావలో నుంచి క్రిందికి దిగాడు. అతని చేతిలో పొపాకనిచూచి అందరూ

చల్లబడ్డారు. ఇప్పుడు అతనివెంట లాఠీలున్న సహాయకుల్ని చూచేసరికి ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ప్రతాపుడు నావ దగ్గరనుంచి తిన్నగా యింటికి బయలుదేరాడు. ఇంటికివచ్చి తలుపుతట్టగానే రామచరణుడువచ్చి తలుపులు తెరిచాడు. రామచరణుడు తన ఆదేశానికి వ్యతిరేకంగా చేశాడనే విషయం ఇంటికివచ్చినతరువాతగాని తెలియలేదు. తెలియగానే కొంచెం కోపం కల్గింది. ముందు వెంటనే ఆమెను తీసుకొని జగత్ సెట్టిగారింటికి వెళ్ళు. వెళ్ళి, ఆమెను పిలుచుకురా" అన్నాడు.

రామచరణుడువచ్చి చూచేసరికి శైవలిని నిద్రపోతోంది. ఇది నిండా మీ అందరికీ ఆశ్చర్యం కలగవచ్చు. ఇటువంటి స్థితిలో నిద్రరాదు. వస్తుందో రాదో మాకు అది తెలియదు – మేముమాత్రం అలాజరిగింది జరిగినట్లు వ్రాస్తున్నాము. రామచరణుడు శైవలినిని మేల్కొల్పలేదు. అతడు తిరిగివచ్చి "వారు నిద్రపోతున్నారు, మేల్కొల్పమంటారా ?" అని అన్నాడు. ఇది విని ప్రతాపునకు చాలా ఆశ్చర్యం కల్గింది "నిద్ర పురుషులకంటే స్త్రీలకు పదహారురెట్లు ఎక్కువ – అని ఆ చాణుక్యపండితులవారు వ్రాయటం మర్చిపోయారు" అనుకున్నాడు. "అంత బాధెందుకు. నువ్వూ నిద్రపో. పడినశ్రమ ఫలించింది. నేనుకూడా కాస్సేపు విశ్రమిస్తాను" అన్నాడు ప్రతాప్ రామచరణునితో రామచరణుడు నిద్రించటానికి వెళ్ళిపోయాడు. బయట నగరమంతా నిశ్శబ్దంగా అంధకారంగా వుంది. ప్రతాపుడు ఒక్కడే మౌనంగా లేచి. తన గదిలోకి బయలుదేరాడు అక్కడికివెళ్ళి తలుపులు తెరచి

చూచేసరికి ఎదుటమంచంపై శైవలిని నిద్రిస్తోంది. శైవలిని ప్రతాపుని గదిలోనే వుందన్న విషయం రామచరణుడు చెప్పటం మర్చిపోయాడు. ప్రతాపుడు దీపకాంతిలో తెల్లని చయ్యపై వికసించిన ఎన్నో సుందర పుష్పములు రాశిగా పడి వుండటం చూచాడు. వర్షాకాలంలో గంగానదిలో నిండుగా వున్న శ్వేతజలప్రవాహంపై వికసించిన కమలములు గుట్టగా బడుచున్నట్లుంది. ఆకర్షణీయంగా వున్న ఆ నిశ్చలశోభను చూచి ప్రతాపుడు కొంచెమే దృష్టిని మరల్చుకోలేకపోయాడు. ఆ సౌందర్యానికి వశీభూతమైనందువల్లనో అతను దృష్టిని మరల్చుకోలేక పోయాడనేది మాత్రం కాదు - అన్యమానస్కుడై ఉండడంవల్ల మాత్రమే అతను విముగ్ధునివలె చూస్తూ వుండిపోయాడు. చాలా కాలంనాటివిషయం అతనికి గుర్తొచ్చింది. ఆకస్మికంగా జరిగిన స్మృతిసాగరమథనంవల్ల కెరటాలపై కెరటాలు లేస్తున్నాయి.

శైవలిని నిద్రించటంలేదు. కళ్ళుమూసుకొని తన పరిస్థితిని గురించి ఆలోచిస్తూవుంది. కళ్ళుమూసుకొని వుండటం వల్ల రామచరణుడు ఆమె నిద్రించిందనే భావించాడు. విచార సాగరంలో మునిగిపోయివుండటంవల్ల ప్రతాప్‌వచ్చిన పాద ధ్వనికూడా విన్పించలేదామెకు ప్రతాపుడు రుపాణతీసుకొనే పైకివచ్చాడు అతడాకృపాణిని గోడకు ఆనించి నిలబెట్టాడు. అన్యమనస్కంగా వుండటంవల్ల సరిగా పెట్టనందున క్రిందపడి పోయింది. శైవలిని ఆ చప్పుడుకు కళ్ళు తెరచి లేచికూర్చుంది. "ఏమిటిది ? ఎవరునువ్వు ? అని అడిగింది. శైవలిని బిగ్గరగా ఆ మాట అని శైవలిని స్పృహతప్పి మంచంపై పడిపోయింది.

ప్రతాపుడు నీరు తెచ్చి ఆమె ముఖంమీద జల్లాడు. అప్పుడు ఆ ముఖం శిశిర ఋతువులో మంచుబిందువులతో శోభించే కమలంవలె ప్రకాశిస్తోంది.

శైవలినికి త్వరగానే తెలివి వచ్చింది. ప్రతాప్ లేచి నిల్చున్నాడు. "ఎవరునువ్వు ? ప్రతాప్వా ! లేక ఎవరైనా దేవత మోసగించవచ్చారా ? అని శాంతభావంతో అడిగింది.

"నేను ప్రతాపునే" అన్నాడు ప్రతాప్.

"నావలో నీమాట విన్పించింది. కానీ భ్రమేమోనను కున్నాను. అప్పుడే కలగంటూ లేచికూర్చోవటంవల్ల భ్రమను కున్నాను." అని శైవలిని దీర్ఘంగా నిట్టూర్చి కొంచెంసేపు మెదలకుండా వూరుకుంది. శైవలిని పూర్తిగా కుదుటబడిందని నిశ్చయించుకొని ప్రతాపుడు మరేమీ మాట్లాడకుండా వెళ్ళిపో బోయాడు. "వెళ్ళిపోవద్దు" అన్నది శైవలిని.

ప్రతాప్ అయిష్టంగానే నిల్చున్నాడు. "నువ్విక్కడికి ఎందుకొచ్చావు ?" అని అడిగింది శైవలిని.

"నా నివాసస్థానమిదే" అన్నాడు ప్రతాప్.

శైవలిని స్వస్థచిత్తకాలేదింకా అప్పటికి హృదయంలో అగ్ని రాజుకుంటోంది. ఆమె శరీరమంతా కంపిస్తోంది. శరీర మంతా రోమాంచితమైంది. ఆమె కాస్సేపు మౌనంగావుండి, ధైర్యంకూడ దీసుకొని "నన్నిక్కడకెవరు తీసుకొచ్చారు ?" అని అడిగింది.

"మేమే తీసుకొచ్చాము."

"మేమా ? మేమంటే ఎవరు ?"

"నేను, నా స్నేహితుడూ,"

"మీారిక్కడికి ఎందుకు తీసుకొచ్చారు ? మీా వుద్దేశ్య మేమిటి ?"

ప్రతాపునికి చాలాకోపం వచ్చింది. "నీ వంటి పాపా త్మురాలిముఖం చూడటానికేమీా లేదు. నిన్నా మ్లేచ్ఛుని బారి నుంచి విముక్తిచేశాను—ఇక్కడికెందుకు తీసుకొచ్చావ్ అని అడుగుతున్నావా నువ్వు?"

అతని కోపాన్నిచూచి శైవలినికూడా కోపగించుకో లేదు నమ్రభావంతో దుఃఖాన్ని దిగమింగుతూ "మ్లేచ్ఛాని ఇంట్లో వుండటమే అంత దౌర్భాగ్యంగా భావించివుంటే నన్ను అక్కడే ఎందుకు చంపివేయలేదు ? మీా వద్ద తుపాకి కూడా వుందిగా" అన్నది.

ప్రతాపుడు చాలా క్రుద్ధుడై "అదీ చేసేవాడినే స్త్రీ హత్యా భయంవల్లనే అలా చేయలేదు. కానీ, నువ్వు చావ టమే మంచిది" అని అన్నాడు. శైవలిని ఏడ్వసాగింది. చివ రకు ఒక ఏడ్పు ఏడ్చి "నేను చావటం మంచిదే - ఇతరు లేమైనా అననీ, కానీ నువ్వుమాత్రం అటువంటి మాటలన వద్దు. నాకీ దుర్దశ ఎవరినిమిత్తం కల్గింది ? నీ కోసమే నా జీవితాన్ని అంధకారమయం చేసిందెవరు ?—నువ్వే. నిరా శతో మంచి చెడు అనే విచక్షణకూడా లేకుండా పోయిందె వర్నిగురించి ? నీ వల్లనే. నేను దుఃఖాలపాలైందెవరి కార ణంగా ? నీ వల్లనే. నేను గృహధర్మనిర్వహణలో మనస్సును కేంద్రీకరించుకోలేకపోయిందెవరిగురించి ? నీ గురించే. నువ్వు నన్ను తూలనాడకు" అని అంది.

"నువ్వు పాపాత్మురాలవు. అందుకనే నిన్ను తూల

నాడుతున్నాను. నాదాతప్పు ? నా దేమీ తప్పులేదని ఆ పర మాత్మునికి తెలుసు. ఇప్పుడు నిన్ను నేనొక సర్పంగా భావించి భయపడి నీ మార్గంనుంచి తొలగాననీ, నీలోని విషానికి భయ పడే నేను వేదగ్రామం వదలివేశానని ఆ ఈశ్వరునికి తెలుసు. దోషమంతా నీ హృదయానిదే — దోషమంతా నీ స్వభా వానిది. నువ్వు పాపాత్మురాలవు. అందుకనే నన్ను నిందిస్తు న్నావు. నేను నీకేమి చెడుచేశాను ?"

ప్రతాపుని మాటలు విని శైవలిని గర్జించింది - "నువ్వేమి చేశావా ? నువ్వే అనుపమ దైవమూర్తి వలలా నా ఎదుట కెందుకొచ్చావ్ ? వికసించుచున్న నా యౌవన కాలంలో అటువంటి రూప జ్యోతిని నా ముందుకు ఎందుకు వెలిగించావ్ ? ఒకసారి మర్చిపోయిన దానిని, మరల ఎందుకు మేల్కొలిపావ్ ? నేను నిన్నెందుకు చూచాను ? మరి చూచి నప్పుడు ఎందువల్ల పొందలేకపోయాను ? పొందలేకపోయి నప్పుడు, చనిపోలేదెందువల్ల ? నీ రూపాన్ని ధ్యానించటం వల్లనే నా గృహం అరణ్యమైపోయిందని నీకు తెలియదా ? నీతో సంబంధాలు తెగిపోయిన తర్వాత నిన్నెప్పటికైనా పొందగలననే ఆశతోనే గృహత్యాగం చేశానని నీకు తెలి యదా ? లేకపోతే ఫాస్టరుతో నీకు సంబంధం ఏముంది ?"

ఆ మాట వినేసరికి ప్రతాపునిపై పిడుగుపడినట్లుంది, తేలుకుట్టినవానివలె బాధపడుతూ అక్కడినుంచి గబగబ బైటకు వెళ్ళిపోయాడు. అదేసమయాన బైటద్వారంముందు ఏదో గోల జరుగుతూంది.

# 7

రామశరణుడు శైవలినిని పల్లకీపై తీసుకువెళ్ళిన తరువాత ప్రతాపుడుకూడా నావవదలి వెళ్ళిపోయాడు. ప్రతాపుని దెబ్బకు గాయపడి నావపై పడివున్న తెలంగా సైనికుడు నెమ్మదిగా లేచి ఒడ్డుకు చేరుకున్నాడు. ఆ తర్వాత శైవలిని పల్లకీ వెళ్ళిన దారినే బయలుదేరాడు. చాలా దూరంగావుండి పల్లకీ ననుసరించి వెనకనే వెళ్ళసాగాడు. అతను ముసల్మాను, పేరు బకాఉల్లాఖాన్ క్లైవుతో పాటు బెంగాలుకు వచ్చిన సైన్యం, మద్రాసునుంచి వచ్చినదే. అందుకని ఆంగ్లేయుల సైన్యంలోని దేశీసైనికుల్ని అప్పుడు తెలంగాలు అనేవారు, కానీ, ఇప్పుడైతే భారతీయులనేకమంది హిందువులు, ముస్లిములుకూడా ఆంగ్లేయుల సైన్యంలో చేరారు. బకా ఉల్లా ఖాన్ గాజీపుర నివాసి.

బకాఉల్లాఖాన్ పల్లకి వెనుక రహస్యముగా దాగి ప్రతాపుని ఇంటివరకు వచ్చాడు. శైవలిని ప్రతాపుని ఇంటిలోనికి వెళ్ళడం చూచి, తిన్నగా అతడు ఆమిటయ్ దొరగారి బసకు వెళ్ళాడు.

బకాఉల్లా అక్కడికి వచ్చి చూచేసరికి అక్కడంతా గడబిడగా వుంది. విషయాలన్నీ ఆమిటయ్ దొరగారికి తెలిశాయి, ఇవాళ తెల్లవారేలోగా ఆ విషయాన్ని గురించి ఆచూకీ యిచ్చినవారికి వెయ్యిరూపాయలు బహుమానం యిస్తానని ఆమిటయ్ దొరగారు చెప్పినట్లు తెలిసిందతనికి, బకాఉల్లా ఆమిటయ్ దొరగారి వద్దకు వెళ్ళి విషయమంతా

విపులంగా చెప్పాడు. "నేను దోపిడీగాని యిల్లు చూపగలను" అనికూడా తెలియజేశాడు. దొరగారి ముఖం వికసించింది—నలుగురు సైనికుల్ని, ఒక నాయకుడ్ని బకాఉల్లా వెంట వెళ్ళవల్సిందిగా ఆదేశించాడు. "ఆ దుర్మార్గుల్ని బంధించి నా ముందుకు తీసుకురండి" అని చెప్పాడు.

"అలా అయితే ఆంగ్లేయు లిద్దర్ని సహాయంగా పంపండి ప్రతాప్‌రాయ్ చాల దుష్టుడు. ఈ దేశ సైనికులు అతణ్ని బంధించ లేరు" అన్నాడు బకాఉల్లా దొరగారితో.

గస్టన్, జాన్సన్ అనే యిద్దరు ఆంగ్లేయులు దొరగారి ఆదేశా న్ననుసరించి ఆయుధాలు ధరించి బకాఉల్లా వెంట బయలు దేరారు.

"ఆ ఇంటికి నువ్వెప్పుడైనా వెళ్ళావా?" అని అడిగాడు గ్లస్టన్ బకాఉల్లాను బయలు దేరేముందు.

"లేదండి!"

"అయితే లైటు, అగ్గిపెట్టె తీసుకురండి, ఖర్చయి పోతుందని హిందువులు దీపం వెలిగించి వుంచరు" అన్నాడు గ్లస్టన్, జాన్సన్‌తో.

జాన్సన్ కొవ్వొత్తి, అగ్గిపెట్టె జేబులో వేసుకున్నాడు. వారు రణరంగానికి బయలుదేరినట్లు బయలుదేరారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఆంగ్లేయు లిద్దరు ముందు, నలుగురు-సైనికులు, నాయకుడు బకాఉల్లా వారి వెనుక, నగరంలోని పహరా జవానులు వారిని చూచి భయంతో పక్కకు తప్పుకున్నారు. గ్లస్టన్, జాన్సన్లు, సైనికుల వెంట మెదలకుండా యింటిముందుకు వచ్చి నెమ్మదిగా తలుపు తట్టారు.

రామచరణుడు లేచి తలుపు తెరవటానికి వచ్చాడు.

అన్నివిధాలా రామచరణుడు సాటిలేని నౌకరు. కాళ్ళకు మాలీసు చేయటంలో, శరీరానికి మాలీసు చేయటంలోనూ బాగా ఆరితేరిన చేయి లతనివి. దుస్తులు మడత వేయటంలోనూ, అత్తరు రాయటంలోనూ కూడా దక్షుడు రామచరణుని వంటివారు ఉండనే వుండరు – అతనివలె వస్తువుల్ని కొనేవారు దొరకటం దుర్లభం, కానీ యివన్నీ మామూలు గుణాలే. మర్షిదాబాదు ప్రాంతంలో రామచరణుడు కర్రసాముకు ప్రసిద్ధి. హిందు, ముస్లిం లెందరో అతడి హస్తనైపుణ్యముతో నేలగరచారు. తుపాకి కాల్చటంలో అతడి గురి ఎలా వుంటుందో ఫాస్టరు రక్తంతో గంగాజలంలో వ్రాయనే వ్రాశాడు.

కానీ వీటన్నింటినీ మించి రామచరణునిలో సమయోచితమైన మరొక గుణం వుంది – నేర్పరితనం. రామచరణుడు నక్కవలె జిత్తులమారి: అసమానమైన స్వామిభక్తి విశ్వాసం గలవాడూను.

రామచరణుడు తలుపు తెరవటానికి వచ్చి, ఇప్పుడు తలుపు కొడుతున్న దెవరా అని ఆలోచించాడు. డాకుక్ మహాశయులేమో. కానీ ఏమైనా ఒక కాండ జరిపివచ్చాము గనుక, రాత్రులందు చూడనిదే తలుపు తెరవగూడ దనుకున్నాడు. ఈ ఆలోచనతో నెమ్మదిగా వచ్చి ద్వారం చెంత నిలబడి బైటవున్న వారిమాటలు వినసాగాడు. ఇద్దరు మనుష్యులు ఏదో అపభ్రంశ భాషలో మాట్లాడుతూ వుండటం విన్నాడు. రామచరణుడు దానిని ఇంశితమిండిత అనేవాడు.

ఇప్పుడు దానిని ప్రజలు ఇంగ్లీషు అంటున్నారు." తగ్గు బాబూ, తగ్గు! తలుపు తెరిస్తే తుపాకి దగ్గరుండాల్సిందే - ఇండితమిండితగాళ్ళను నమ్మే తెలివితక్కువ వాడెవడు" అనుకున్నాడు తనలో తానే.

"ఒక్క తుపాకే కాదనుకుంటా' రెండు తుపాకులకు పని వుందనుకుంటాను. యజమానిని కూడా పిలుస్తాను" అని కూడా ఆలోచించుకొని ప్రతాప్‌రాయ్‌ను పిలవటానికి తలుపు దగ్గరనుంచి వెనుదిరిగాడు.

ఇంగ్లీషువాళ్ళల్లోకూడా ఓర్పు నశించిందప్పటికే. "ఎందుకు చూస్తారెందుకు, లాఠీలతో విరగ్గొట్టండి. హిందూ దేశపు తలుపులు ఆంగ్లేయుల లాఠీలముందు నిలవలేవు" అన్నాడు జాన్సన్.

గ్లాస్టర్ లాఠీతో మోదాడు. తలుపు కిరకిర, పెటపెటలాడాయి. రామచరణుడు పరుగెత్తాడు. ప్రతాపుని చెవిని బడిందా శబ్దం. ప్రతాపుడు పైనుంచి దిగివస్తున్నాడు. అప్పటికింకా తలుపులు విరిగిపోలేదు.

తర్వాత జాన్సన్ గట్టిగా లాఠీతో మోదాడు. తలుపులు విరిగిపోయాయి.

"ఇలాగే ఆంగ్లేయుల కాలితాపులకు భారతదేశపు ద్వారాలన్నీ విరిగిపోయాయి" అంటూ ఆంగ్లేయులిద్దరూ ఇంట్లో జొరబడ్డారు. వెనుకనే సైనికులుకూడా ప్రవేశించారు. రామచరణుడు పైకి వస్తూ మెట్లమీదే కలుసుకున్నాడు ప్రతాపేను. "చీకట్లో దాగండి" ఇంగ్లీషు వాళ్ళొచ్చారు. "ఆమీ బాబూ బసనుంచే సనుకుంటా" అన్నాడు రామచరణుడు,

కామచరణుడు ఆ యియట్‌ను ఆమ్‌బాత్ అంటాడు.

"అయితే భయమెందుకు ?"

"ఎనిమిదిమందే వచ్చారు ?"

"నేను దాక్కొంటానే అనుకో, ఈ యింట్లో వున్న స్త్రీల పరిస్థితి ఏమవుతుంది మరి? వెళ్ళి నా తుపాకి తీసుకురా ?"

రామచరణునికి ఆంగ్లేయుల్ని గురించి విపులంగా తెలిసి వుంటే ప్రతాప్‌ను దాక్కోమని సలహా యిచ్చేవాడు కాదు. వారిద్దరూ మాట్లాడుతూవున్న సమయాననే అకస్మాత్తుగా యిల్లంతా వెలుగుతో నిండిపోయింది. జాన్సన్ వెలుగుతున్న వత్తిని ఒక సైనికుని చేతికిచ్చాడు. ఆ కొవ్వొత్తి కాంతిలో ఇద్దరు మనుషులు మెట్లమీద నిలబడి వుండటం ఆంగ్లేయులు గమనించారు. "వాళ్ళేనా ?" అని ప్రశ్నించాడు బకాడుల్లాను జాన్సన్. బకాడుల్లా సరిగ్గా గుర్తించలేకపోయాడు. అతడు ప్రతాప్‌ను, రామచరణుణ్ని చీకట్లో చూచాడు, అందువల్ల బాగుగా గుర్తించలేకపోయాడు. కానీ విరిగి చెయ్యి అమితంగా బాధపెడుతోంది — తన బాధకు ఎవరు కారణమైతేనేం "వీళ్ళే, వీళ్ళే" అని చెప్పాడు అప్పుడిహ ఆంగ్లేయులిద్దరూ పెద్దపులివలె లంఘించి మెట్లు చేరుకున్నారు. సైనికులు కూడా వెనుకనే వస్తున్నారు - యిది గమనించి రామచరణుడు ప్రతాపుని తుపాకి తేవటానికి గబగబా పైకివెళ్ళాడు.

జాన్సన్ ఇది గమనించి గురిచూచి పిస్తోలు కాల్చాడు. రామచరణుని కాలికి తగిలింది దెబ్బ. నడవలేక మెట్లమీదే కూలబడ్డాడు.

ప్రతాపుని చేతుల్లో ఏమీ లేదు, పారిపోవాలనే కోర్కె కూడా లేదు, పారిపోయినందువల్ల రామచరణునికి ఏమి జరిగిందో కూడా చూచాడు. ప్రతాపు ఆ ఆంగ్లేయుల్నుద్దేశించి "మీ రెవరు ? ఎందుకొచ్చారు ? అని శాంతంగానే అడిగాడు.

"మీ రెవరు ?" అని అడిగాడు గ్లాస్టన్ ప్రతాప్ను.

"నాపేరు ప్రతాప్‌రాయ్" అని జవాబిచ్చాడతడు. బకాఉల్లాకు ఆపేరు బాగాగుర్తు. నౌకమీద ప్రతాపుడు తుపాకి చూపిస్తు "వినండి అందరూ, నాపేరు ప్రతాప్‌రాయ్" అని ధీమాగా పలికాడు.

"అయ్యా, ఇతడే నాయకుడు" అన్నాడు బకాఉల్లా. జాన్సన్ ప్రతాప్ చేయి పట్టుకున్నాడు. బలప్రదర్శన వ్యర్థమనుకున్నాడు ప్రతాప్, మెదలకుండా సహించాడు అన్నీ. నాయిర్ చేతిలోవున్న సంకెళ్ళను ప్రతాప్ చేతులకు తగిలించారు. గ్లాస్టర్ పడిపోయిన రామచరణుడ్ని చూపుతూ "ఇతడే" అన్నాడు. "ఇతడ్నికూడా తీసుకురండి" అని ఇద్దరు సైనికులకు ఆదేశించాడు జాన్సన్.

ఇద్దరు సైనికులు రామచరణుడ్ని కూడా తీసుకొని బయలుదేరారు.

ఈ గోలంతావిని దలనీ కుల్‌సమ్‌లు మేల్కొని చాలా భయపడ్డారు. వారు తలుపుల్ని కొద్దిగా తెరచి తొంగిచూస్తున్నారు. మెట్లసమీపానే వారి శయనాగారం.

ఆంగ్లేయులు ప్రతాప్, రామచరణుడ్ని తీసుకొని మెట్లు దిగి వస్తూవుండగా. సైనికుని చేతిలోవున్న కొవ్వొత్తి కాంతి కొద్దిగా తలుపు తెరచి తొంగిచూస్తున్న దలనీకళ్ళపై బడింది.

బకాఉల్లా ఆకళ్ళను చూచాడు. "శాస్త్రుగారి భార్య" అన్నాడు వెంటనే.

"నిజంగానా! ఎక్కడ? అన్నాడు గ్లాస్టన్.

బకఉల్లా పైనచెప్పిన తలుపు కేసి చూపిస్తూ "ఈగది లోనే అన్నాడు. జాన్సన్, గ్లాస్టన్‌లు ఆగదిలో దలనీ కుల్ సమ్‌లను చూచి "మీరు మా వెంటరండి" అన్నాడు.

కుల్‌సమ్, దలనీలు చాలా భయపడి, విధిలేక వారి వెనుక బయలుదేరారు. ఇక ఆయింటిలో శైవలిని వక్కతే మిగిలివుంది, శైవలినికూడా జరిగినదంతా గమనించింది.

# 8

ఆ ముస్లిం కన్యలిద్దరూ తమ శయనాగారంలోనుంచి తలుపులు ఓరగా తెరచి ఏవిధంగా చూస్తూవున్నారు, శైవలినికూడా అదేవిధంగా చూచింది. ముగ్గురేస్త్రీలున్నారు. అందువల్లస్త్రీల స్వభావాన్ని ననుసరించి ముగ్గురు కుతూహలంగా చూస్తున్నారు. ముగ్గురూ అతిభీతి జెందారు. భయంలోని స్వభావం ఏమిటంటే అది భయంకర వస్తువులను మాటిమాటికి చూడగోరుతుంది. శైవలినికూడా ఆదినుంచి అంతంవరకూ జరిగినదంతాచూచింది. అందరూ వెళ్ళిపోయిన తరువాత ఇంట్లోతాను ఒంటరిగా వుండటంచూచి ఆమెకూడా కూర్చుని చింతించసాగింది.

ఆమె తనలోతానే యోచించుకో సాగింది. "ఇప్పుడేం చేయాలి? ఒంటరిగా వున్నాను. అందువల్ల నాకేం భయం? ప్రపంచంలో నాకేభయమూలేదు. మృత్యువును మించిన ఆప

దేమీలేదు. నిత్యమూ మృత్యువును కోరేవారికే భయం? నాకెందుకు చావురాలేదు? ఆత్మహత్య చాలా తేలిక అంటారు కాని తేలికకాదే! ఇంతకాలం నీటిలోనే వున్నాను, కానీ మునిగి చావలేక పోయానే. రాత్రులంతా అందరూ నిద్రించిన తర్వాత నెమ్మదిగా నావలోనుంచి బయటకువచ్చి నీటిలో దూకివుంటే ఎవరు పట్టుకొనేవారు? పట్టుకొనేవారే, నావ మీద కాపలావుంది. అయినా, నేనేమీ ప్రయత్నమే చేయ లేదు. చావాలనే కోర్కెవుంది కానీ, చావటానికేమీ ప్రయ త్నించలేదు. అప్పటికింకనాలో ఆశారేఖలున్నాయి. ఆశవుండగా మనిషి చచ్చిపోలేడు. కానీ, మరినేడు? ఇవాళ కావాల్సినరోజు. కానీప్రతాప్‌ను పట్టుకుపోయారు. – అతడేమయ్యాడో తెలుసు కోనిదేచావలేను. ఇంతకూ ప్రతాప్ ఏమయ్యాడు? ఏమైతేనేం? నాకెందుకు? ప్రతాపునితో నాకేమి సంబంధం? నేనతని దృష్టిలో పాపాత్మురాలిని. అతనితో నాకేమి పొత్తు? ఏమిటో అది నాకు తెలియదు. అతడు శైవలిని అనే కీటకమునకు మండుతున్న అగ్నిలాంటివాడు. పాడుబడిపోయిన ప్రపంచంలో నాపాలిటి గ్రీష్మఋతువులోని తొలిమెరుపువంటివాడు—— అతడు నామృత్యువు. నేను గృహాన్నెందుకు వదిలాను. విషాదంతో ఎందుకొచ్చాను? సుందరివెంట తిరిగి ఎందుకు వెళ్ళలేదు?

శైవలిని తలబాదుకుంటూ ఎంతో విలపించింది. వేద గ్రామంలోని తన గృహము, గోడప్రక్కన తాను నాటిన పూలమొక్క గుర్తుకొచ్చాయి. ఆ పూలమొక్క ఎత్తైన గోడనుకూడా మించి ఎదిగి అరుణ పుష్పాలతో విలసిల్లుతూ

నీలాకాశాన్ని శుంభించటానికన్నట్లు అగ్రసలుచాచుతూ వుంది. అప్పుడప్పుడు తుమ్మెదలు చిన్నచిన్న పక్షులువచ్చి దాని కొమ్మపై వాలటంకూడా ఆమెకు గుర్తొచ్చింది. తెలసికోట దానిచుట్టూ పరిశుభ్రముగా గచ్చుచేయబడిన ప్రదేశము పెంపుడుపిల్లి పంజరంలోని చిలుక, ఇంటచేసువనే ఉన్న తియ్య మామిడిచెట్టు ఒక్కొక్కటే మనస్సులో మెదలసాగాయి. ఎన్నివిషయాలు గుర్తుకొచ్చాయో అంతులేదు. డాబాపై కూర్చుని అందమైన నీలాకాశాన్ని చూస్తూవుండేది, వికసించిన సుగంధిత శ్వేత పుష్పాలెన్నింటినో ఏరి చంద్రశేఖరుని పూజకు సంసిద్ధం చేస్తూవుండేది. సువాసనలు మోసుకొని పోవు మందపవనపు శీతలస్పర్శ ననుభవించేది, ఆ సరోవరంలోని చిరుకెరటాల్లో చంచలమైన తళతళలు చూచేది, దానితీరాన ఎన్నో కోయిలలు కూసేవి! శైవలిని ఒకసారి నిట్టూర్చి తిరిగి ఆలోచనలో మునిగిపోయింది, ఇంటినుంచి బయటబడగానే ప్రతాప్‌ను చూస్తానని వూహించాను. పురందరపుర నివాసానికి తిరిగి వెళతానని భావించాను - ప్రతాపునిఇల్లు, పురందర పురముదగ్గరే, కిటికీలోకూర్చుని కటాక్షజాలాన్నిపన్ని ప్రతాపుడనే పక్షిని పట్టుకుంటా ననుకున్నాను. అవకాశం చిక్కగానే ఆంగ్లేయుడ్ని మోసగించి అక్కడినుంచి పారిపోయి ప్రతాపుని పాదాలపై పడాలనుకున్నాను. నేను పంజరంలోని పక్షిని ప్రపంచపు నడకేమిటో ఏమీ తెలియనీ తెలియదు, మనిషి సృష్టించేదానిని బ్రహ్మ ధ్వంసం చేస్తాడనుకున్నాను. ఆంగ్లేయుల పంజరం ఇనుముతో తయారైందనీ - నా అభిలాషలన్నీ భగ్నమైపోతాయనీ తెలియదు నాకు. వ్యర్థంగా కళంకం కొని

తెచ్చుకున్నాను. జాతిని, ఇహాన్ని పరాన్నికూడా పాడుచేసు కున్నాను.

పాపపు నిరర్థక, సార్థకాలేమిటో ఆ పాపాత్మురాలు శైవలినికి ఆలోచనే కలుగలేదు. పైగా నిరర్థకమే సరియైనది. అనే యోచనకూడా రాలేదు. కానీ ఒకనాటికి ఈవిషయాన్నే అర్థం చేసుకొంటుంది. ఆనాడు ప్రాయశ్చిత్తం చేసుకొనటానికి తనను తాను పూర్తిచేసుకోటానికికూడాసిద్ధమవుతుంది. అలాంటి ఆశలేప్పుడు మేమీా పాపపు చిత్రాన్నెందుకు చిత్రిస్తాం? తిరిగి ఆమె ఆలోచనల్లో పడింది. "పరలోకమా? అది ప్రతాపను చూచిననాడే పోయింది. ఆ అంతర్యామి ఆరోజునే నానొసట లిఖించాడు. ఈజన్మలోకూడా నాకునరకమేనామనస్సే నరకము- లేకపోతే ఇన్నికష్టాలెందుకు కలుగుతున్నాయి? లేకపోతే చూస్తూ చూస్తూ విషంవంటి మ్లేచ్ఛుని వెంటబడి ఎందుకు తిరుగుతాను? అంతేగాక నాకు మంచిదిగావున్న ప్రతిదానిలో అన్నిప్పట్టుకొస్తున్నట్లు కన్పిస్తోంది. నామూలంగానే ప్రతాప్ ఈ ఆపదలో చిక్కుకున్నట్లు తోస్తుంది - నేనెందుకు చావలేదు?"

శైవలిని మరల వేద్వసాగింది. క్షణమాగి కళ్ళు తుడుచుకొంది, ముఖం చిట్లించింది. పెదవి కొరుక్కుంది. క్షణకాలంలో వికసించిన పద్మమువంటి ఆమె వదనం క్రుద్ధ సర్పమువలె భీకరకాంతితో శోభించసాగింది. "నే నెందుకు చనిపోలేను" అనుకుంది. శైవలిని చటుక్కున నడుమునున్న ఒరనుంచి ఒక కత్తి లాగింది, దానిని చేతితో పట్టుకొని "వ్యర్థంగా కత్తినెందుకు తీశాను. ఇంతకాలంవరకు ఈ కత్తి నా పాపపు హృదయాన్నెందుకు ఛేదించలేదు? ఎందుకని -

పనిలేనట్లు వుండిపోయింది. ఇప్పుడు ?" అని ఆమె కత్తిమొనను
గుండెపై గురిజేసి ఆనించింది. ఎలా ఆనించినదంలాగే ఉండి
పోయింది. "ఒకనాడు ఈ కత్తినే నిద్రించిన ఫాస్టరు గుండె
లపై గురిపెట్టాను. ఇవ్వాళ ఆత్మహత్యకు కూడా సాహసించ
లేకపోతున్నాను. ఈ కత్తి భయంతో ఆ పాపాత్ముడు ఆంగ్లే
యుడు లొంగిపోయాడు. నా గదిలోకి వస్తే ఈ కత్తితో
అతనో నేనో చావటం ఖాయమనేది అనుకున్నాడతను.
ఆ పాపాత్ముడు దీని భయంవల్లనే లొంగిపోయాడు, కాని
నా పాపప్రహృదయం మాత్రం దీనికి భయపడి ఏమాత్రం లొంగ
లేదు. చావనా ? కాదు, ఇవాళ కాదు. చస్తే ఆ వేదగ్రామా
నికి వెళ్ళి చస్తాను. నాకు జాతిలేదు, మతంలేదు - ఏమీలేదు,
కానీ ఒక పాపమనే దానివల్ల నేను పాపాత్మురాలిని కాను
అని సుందరితో చెప్తాను. అప్పుడే చస్తాను — మరి వారు —
నా భర్త - వారితో కూడా యిదే చెప్పి చావనా ? మాట
మనస్సులో నిలవటంలేదు. అది తలచుకుంటేనే వందలు వేలు
తేళ్లు కుట్టి బాధిస్తున్నట్లుంది - నరనరాన అగ్నిజ్వాలలు లేస్తు
న్నాయి. నేను ఆయనకు తగినదానినే, అందుకనే వారిని
వదలి వచ్చాను. దానివల్ల వారికేమీ కాను. ఆ గ్రంథాలే
వారికి సర్వము. వారు నన్ను గురించి చింతించరు. ఎవరైనా
కన్పించి వారెలా వున్నారో, ఏమి చేస్తున్నారో చెప్తే బాగుం
డుననే కోర్కె కలిగిందొకప్పుడు. వారిని నే నెప్పుడూ
ప్రేమించలేదు - ఎన్నడూ ప్రేమించలేనుకూడా - అయినప్ప
టికీ వారిని నేనేమి కష్టపెట్టినా నా పాపభారమింకా పెరిగిం
దన్నమాటే. మరొక విషయం కూడా వారికి చెప్పాలని

కోర్కెగా వుంది. కానీ ఫాస్టరు చనిపోయాడు. దానికి సాక్ష్యం ఎవరున్నారు ? నా మాట విశ్వసించే దెవరు ?"

శైవలిని విచారంతో, ఆలోచనలతో అలాగే నిద్రపోయింది. ఉదయం ఆమెకు నిద్రవచ్చింది - నిద్రలో దుస్వప్నాలెన్నెన్నో చూసింది, ఆమె నిద్రనుంచి మేల్కొనేసరికి చాల ప్రొద్దెక్కింది. తెరచిన కిటికీగుండా లోన ఎండపడుతోంది. శైవలిని కళ్లు తెరచి చూచింది. ఎదుట చూడగానే భయము, విస్మయము ఒకేసారి పెనవేసుకొని కొయ్యబారి బొమ్మవలె వుండిపోయింది. ఆమె యెదుట చంద్రశేఖరుడు నిలబడి వున్నాడు.

# మూడవ అధ్యాయము

ముంగేరులోని ఒక మఠంలో ఒక పరమహంసగారు చాలాకాలంగా వుంటున్నారు. వారి పేరు స్వామి రామచరణ్. స్వాములవారే వారితో చాలా వినయంగా సంభాషిస్తున్నాడు. స్వామి రామానంద సిద్ధులని ప్రజలు భావించేవారు. ఆయన అద్వితీయమైన జ్ఞాని అని వారి ఉద్దేశ్యం. భారత దేశంలో అనాదిగా వుంటూవుండి దూరమైపోయిన తత్వజ్ఞానమంతా వారికి క్షుణ్ణంగా తెలియునని చెప్పేవారు. "వత్సా, చంద్రశేఖరా! విను! నీవు పొందిన విద్యలన్నింటినీ, సావధానచిత్తుడవై సార్థకం చెయ్యి, దుఃఖాని కెన్నడూ హృదయంలో చోటివ్వకు. ఎందుకు యివ్వవద్దు అంటే, దుఃఖం అనే స్వతంత్ర పదార్థ మొకటి లేనేలేదు. సుఖ దుఃఖములు సమానములే, లేదా జ్ఞానిదృష్టిలో రెండూ ఒకటే, భేదంగా చూచినట్లయితే, పుణ్యాత్ములు, సుఖవంతులు అని చెప్పబడేవారు చిరదుఃఖితులవుతారు" అని స్వామివారు చెప్తున్నాడు.

ఇలా చెప్పి స్వామిరామానంద ముందు యయాతి, హరిశ్చంద్రుడు, దశరథుడు మొదలైన ప్రాచీనకాలపు రాజులను గురించి కూడా ప్రసంగించాడు. శ్రీరామచంద్రుడు, యుధిష్ఠిరుడు, నల అదిగాగల రాజులను గురించి పేర్కొన్నాడు. ఈ పృథ్వీతలంలోని చక్రవర్తులు, సామ్రాట్టులు, పుణ్యాత్ములైన రాజులు ఏమాత్రము సుఖాల ననుభవించలేదు, నిత్యదుఃఖితులుగానే వున్నారు. రాక్షసులచే బాధించ

బడి, శాపగ్రస్తులైన ఇంద్రుడు మొదలైన దేవతలు కూడా దుఃఖాలలో మునిగివుండేవారని చెప్పాడు. చివరకు మనస్సును మోహింపజేయు వాక్కులోని దైవోద్దీపనము కావించి చిర పరమాత్మను హృదయంలో అన్వేషించసాగాడు. సర్వజ్ఞులైన వారు ఈ దుఃఖమయ అనంతవిశ్వంలో అపారదుఃఖరాశిని చిరకాలమూ హృదయంలో తప్పక అనుభవిస్తానేవుంటారు. దయామయులైనవారు ఈ అపార దుఃఖాలను చూచి దుఃఖితులు కారా? అలా అయితే వారు దయామయు లెలా అవుతారు? దుఃఖముతోపాటే దయకు నిత్యసంబంధము వుంటుంది - దుఃఖమే లేకపోతే దయ ఎలా ఉత్పన్నమౌతుంది? దయామయులైన ప్రభువు ఈ అనంతవిశ్వంలో అనంత దుఃఖాలతో అనంతకాలంవరకు దుఃఖితుడుగా వుంటారు - లేనిచో వారు దయామయులే కారు. ఆయన నిర్వికారుడు, వారికి దుఃఖం ఏమటి? అని భావిస్తే, దానికి జవాబు - నిర్వికారుడైన ఆయన సృష్టి, స్థితి, సంహారాలకు అతీతుడే. అయినను సృష్టికర్త, విధాతయని నే సంగీకరించను. సృష్టికర్త, విధాత అయిన వారెవరైనావుంటే వారిని నేను నిరాకారుడని అంగీకరించను, ఆయన దుఃఖితుడు, కానీ, అది కాదు, ఎందుకు కాదంటే ఆయన నిత్యానందస్వరూపుడు. కనుక దుఃఖమనేది ఒక ప్రత్యేక వస్తువేమీ కాదనే నిజమైంది. ఒకవేళ అది దుఃఖమనేది వున్నదని అంగీకరించినట్లయితే ఆ దుఃఖాన్ని తొలగించే ఉపాయమేదీ లేనేలేదా? ఉపాయం లేదు, సర్వజనులు దుఃఖాలను తొలగించు యత్నంలోవుంటే తప్పక దుఃఖాలు తొలగిపోవచ్చు. చూడు విధాత తానే, సృష్టిలోని దుఃఖా

లను బాపుటకు నిత్యము నిమగ్నమై వుంటాడు. ప్రాపంచిక దుఃఖాలు తొలగిపోయినప్పుడు ఐహిక దుఃఖాలుకూడా అంత రిస్తాయి. దేవతలు జీవుల దుఃఖాలను తొలగించుటకే నియమించబడ్డారు; దానివల్లనే స్వర్గసుఖం వుంది. లేనట్లయితే ఇంద్రియ వికార రహితులైన దేవతలకు మరే సుఖమూ వుండదు. ఋషుల లోకోపకారాన్ని కీర్తించే భీష్మాదులు దేవతల పరోపకారాలను వర్ణించారు. పరోపకారం చేయువారే సుఖవంతులనీ, అన్యులెవరూ సుఖవంతులు కారనీ వారు నిరూపించారు అని స్వామిరామానంద పరోపకారాన్ని గురించి వేనోళ్ళ కొనియాడసాగాడు. ధర్మశాస్త్రములు, వేద, పురాణాదులను మథించి అనేక ప్రమాణాలను చూపించసాగాడు. శబ్దసాగరాన్ని మథనంచేసి మహత్తరమైన పలు అర్థాలను వినుటకు అత్యంత మనోహరంగా వుండే వాక్యాల మాలను పూలమాలవలె గుచ్చెడు సాహిత్యభాండారమును వెదజల్లి సారపూర్ణమైన, రసయుక్తమైన, ఉత్తమ అలంకార యుత కవితలను వికసింపసాగాడు. వారి మధురకంఠంనుంచి వెలువడిన ఉచ్చారణ కౌశల్యయుతమైన ఆ అపూర్వవాక్యములన్నియు చంద్రశేఖరుని వీనులకు తూర్యనాదంవలె ధ్వనించాయి. ఆ వాక్యము లొకప్పుడు మేఘగర్జనవలె గంభీర శబ్దములతో ధ్వనించేవి, మరొకప్పుడు మధుర వీణానాదం వలె వీనులవిందుగా నుండేవి చంద్రశేఖరుడు విస్మయంతో ముగ్ధుడైపోయాడు. శరీరము పులకించింది. అతడు లేచి వారి పాదధూళి శిరమున దాల్చాడు. "గురుదేవా! నేడు నేను మీనుండి గ్రహించిన మంత్రం ఇదే" అన్నాడు. రామానంద స్వామి చంద్రశేఖరుణ్ణి ప్రేమతో కౌగలించుకున్నాడు.

## 2

బ్రహ్మచారి పంపిన ఉత్తరము నవాబుగారికి చేరింది. దలనీవున్న ప్రదేశం నవాబుగారికి తెలిసింది. కుల్‌సమ్ దలనీలను తీసుకొని వచ్చుటకు పల్లకీ పంపారు.

కానీ సమయం మించిపోయింది. అప్పటికే యింటిలో శైవలిని మినహా మరెవ్వరూ లేరు. ఆమెనుచూచి నవాబుగారి మనుష్యులు బేగమ్ అనుకున్నారు. తను కోటలోకి వెళ్ళాలని విన్నది శైవలిని. చటుక్కున ఆమె మనస్సులో ఒక కుట్ర ఉత్పన్నమైయింది. కవిపుంగవులు, ఆశయొక్క గొప్పతనానికి ముగ్ధులవుతూ వుంటారు. ఆశ అనేదే ప్రపంచంలో అనేక సుఖాలకు కారణం. కాని ఆ ఆశే దుఃఖాలకు మూలం కూడా. జరుగుచున్న పాపాలన్నీ లాభం పొందాలనే ఆశతోనే ఉత్తమ కార్యమేదీ ఆశతో చేయబడదు. స్వర్గప్రాప్తిని ఆశించి ఉత్తమకర్మలాచరించే వారి కర్మలు సత్కర్మలనబడవు. ఆశప్రేరితమైన శైవలిని పల్లకీలో కూర్చుంది.

బోయీలు శైవలినిని కోటకు తీసుకొనివచ్చి అంతఃపురంలో వున్న నవాబుగారి ముందు హాజరుపర్చారు. చూస్తే ఆమె దలనీబేగం కాదు. కానీ, దృష్టివుంచి చూచేసరికి ఆమె వంటి జగన్మోహిని ఆ అంతఃపురంలో మరెవరూ లేరని బోధపడింది. "నువ్వెవరవు ?" అని ప్రశ్నించాడు నవాబు.

"నేనొక బ్రాహ్మణయువతిని"

"రాజుగారి మనుష్యులు తీసుకొచ్చారు."

"నిన్ను బేగం అనుకొని తీసుకొచ్చారు. బేగం ఎందుకు రాలేదు ?"

"ఆమె అక్కడలేదు".

"మరి ఆమె ఎక్కడకు వెళ్ళింది ?

గ్లాస్టన్ జాన్సన్‌లు దలనీ, కుల్‌సమ్‌లను తీసుకొని వెళ్ళునప్పుడు శైవలిని వారిని చూచింది. వారెవరో అప్పుడామెకు తెలియలేదు. దాసీలో, నాట్యగత్తెలో అనుకుందప్పుడు. కానీ నవాబుగారు పంపిన మనుష్యులు, బేగం ప్రతాపునియింట్లో వుందని నవాబుగారు ఆమెను తీసుకొని రమ్మనుటకే తమను పంపారని చెప్పినప్పుడు ఇంగ్లీషువాళ్ళు బంధించి తీసుకు వెళ్ళింది బేగమ్‌నేనని శైవలినికి అర్థమయింది. శైవలిని ఏదో ఆలోచిస్తూ వుంది.

శైవలిని జవాబు చెప్పకపోయేసరికి నవాబు "నువ్వామెను చూచావా ?" అని తిరిగి ప్రశ్నించాడు.

"చూచాను"

"ఎక్కడ చూచావ్ ?"

"మేము రాత్రి వున్న చోటనే."

"ఏదా చోటు ? ప్రతాప్‌రాయ్ గృహమా ?"

"అవునండీ"

"బేగం అక్కడనుండి ఎక్కడికి వెళ్ళిపోయిదో తెలుసా?"

"ఇద్దరు ఆంగ్లేయులు వారందర్నీ పట్టుకుపోయారు."

"ఏమిటి నువ్వనేది ?"

శైవలిని తిరిగి అదేజవాబిచ్చింది. నవాబు మౌనం వహించి, పెదవి కరచుకున్నాడు, గడ్డం మెలిబెట్టాడు. గుర్గన్ ఖాన్‌ను పిలవమని ఆదేశించాడు. "ఆంగ్లేయులు బేగంను ఎందుకు బంధించి తీసుకువెళ్ళారు. నీకు తెలుసా" అని అడిగాడు

నవాబు.

"తెలియదు"

"అప్పుడు ప్రతాప్ ఎక్కడవున్నాడు ?"

"వాళ్ళు వారినికూడా బంధించి తీసుకువెళ్ళిపోయారు."

"వాళ్ళందర్ని ఎందుకు తీసుకుపోయారో నీకు తెలుసా?" అని నవాబు మరల ప్రశ్నించాడు.

శైవలిని ఇంతవరకు నిజమే చెప్తోంది, ఇక ఆమె అబద్ధాలు చెప్పనారంభించింది. "నాకు తెలియదండీ"

"ప్రతాప్‌రాయ్ ఎవరు ? అతని నివాసమెక్కడ ?"

శైవలిని ప్రతాప్‌రాయ్‌ను గురించిన వివరాలన్నీ చెప్పింది.

"అతను ఇక్కడకు ఎందుకు వచ్చాడు ?"

"ప్రభుతో ఉద్యోగంచేయటానికి"

"అతనికి నీకూ సంబంధం ఏమిటి ?"

"నా భర్త"

"నీ పేరు ?"

"రూపసి"

శైవలిని అప్రయత్నంగానే ఈ జవాబు చెప్పింది.

"సరే ఇక నువ్వు వెళ్ళవచ్చు" అన్నాడు నవాబు.

"నాకు చోటెక్కడున్నది – ఎక్కడికని వెళ్తాను ?"

నవాబుకు చాలా ఆశ్చర్యం కల్గింది "అయితే, మరెక్కడికి వెళ్తావని ?" అని అడిగాడు.

"భర్త వద్దకు. మీరు నన్ను నా భర్తవద్దకు పంపండి ఖీరు రాజులు మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నా భర్తను

ఆంగ్లేయులు తీసుకుపోయారు. వీలైనచో నా భర్తను విముక్తి చేయండి. లేనిచో నన్నుకూడా వారివద్దకు పంపండి. దీనిని మీరు అంగీకరించక, ఏ ప్రయత్నమూ చేయనట్లయితే నేనిక్కడే మీ ఎదుట ప్రాణత్యాగం చేయాలని వచ్చాను."

గుర్గన్ ఖాన్ వచ్చాడనేవార్త తెలిసింది. "సరే నువ్విక్కడే వుండు నేను ఇప్పుడే వస్తాను." నవాబు సైవలినితో అని వెళ్ళాడు.

## 3

నవాబు గుర్గన్ ఖానును అన్ని విషయాలు అడిగిన తర్వాత "ఆంగ్లేయులతో యుద్ధం చేయుటమే మంచిది. యుద్ధానికిముందు అమియట్ దొరను బంధించటం మనకర్తవ్యమని నా ఉద్దేశ్యం. ఎందుకని కూడదు ? అమియట్ మనకు బద్ధవిరోధి. ఏమంటావ్ ?" అని అడిగాడు.

"యుద్ధానికి నేనెప్పుడూ సిద్ధమే, అయితే దూతను మనమేమీ చేయకూడదు. దూతను బాధించుటవల్ల మనము విశ్వాస ఘాతకులుగా పరిగణించ బడతాం - దోషం మనదే అవుతుంది - ఇంకా —" అన్నాడు గుర్గన్ ఖాన్.

"అమియట్ నిన్నరాత్రి ఈపట్టణంలోనే ఒకయింటిమీద దాడిచేసి ఆయింట్లోని వారందర్ని పట్టుకుపోయాడు. నా అధీన ప్రాంతంలోవుండి అపరాధం చేసినప్పుడు, దూత అయినంత మాత్రాన శిక్షించకుండా వదలివేయనా?" అన్నాడు నవాబు.

"అతడు ఆవిధంగా చేసివుంటే తప్పక శిక్షించవలసిందే, కానీ అతడ్ని బంధించే దెలా ?"

తక్షణం అతడు వుండేచోటుకు సైనికుల్ని పంపి ఇప్పుడు బంధించు."

"వారెవ్వరూ ఈపట్టణంలో లేరిప్పుడు. ఇవాళ మధ్యాహ్నమే వెళ్లిపోయారు."

"అదెలా ? నాకు తెలియ చేయకుండానే?"

"మీకు తెలియ జేయుటకు 'హేం' అనేవ్యక్తిని ఇక్కడ వదలి వెళ్లారు."

"ఈ విధంగా మన అనుమతి లేకుండా పారిపోవటంలో అర్థం ఏమిటి ? అలాచేయటం అంటేనాయెడ అమర్యాదగా ప్రవర్తించినట్లే అవుతుంది, ఇదిఅతడు తెలిసిచేసినపనే" అన్నాడు నవాబు.

"వారి ఆయుధాల నౌకపైవుండే ఒక ఆంగ్లేయుడ్ని రాత్రి ఎవరో చంపివేశారు. అందుకనే కోపంవచ్చి వెళ్లిపోయాడు. ఇక్కడవుంటే ప్రాణాలకే ముప్పువస్తుందని అన్నాడు" అని జవాబిచ్చాడు గుర్గిన్‌ఖాన్.

"ఎవరు హత్యచేశారో నీకు తెలిసిందా ?"

"ప్రతాప్‌రాయ్ అనే ఒకవ్యక్తి చేశాడట."

"మంచిపనేచేశాడు. అతడు నాముందుకువస్తే బహూకరిస్తాను. ప్రతాప్‌రాయ్ ఎక్కడున్నాడు ?"

"వాళ్ళందర్ని బంధించి తీసుకుపోయాడు. వెంటతీసుకుపోయాడో, లేక అజీమాబాదుకు పంపారో సరిగా తెలియలేదు."

"ఇంతవరకు నాకీవార్త ఎందుకు తెలియ జేయలేదు ?"

"నేనుకూడా ఇంతకుముందే విన్నాను."

గుర్గన్‌ఖాన్ చెప్పినమాట పూర్తిగా అబద్ధం, గుర్గన్‌కు ఆసాంతం విషయాలన్నీ తెలుసు, అతడి అనుమతి లేకపోతే అమియట్ ముంగేరునుంచి కదలకలిగేవాడా? గుర్గన్ వుద్దేశాలు రెండు – ఒకటి, దలనీబేగం ముంగేరువదలి వెళ్ళిపోవడమే మంచిది; – రెండోది, అమియట్‌ను వశమందుంచుకోవటం కొంత అవసరం, ముందుముందు అతనివల్ల కొన్నిలాభాలు కలుగవచ్చు.

గుర్గన్‌ను వెళ్ళవచ్చునని చెప్పాడు నవాబు. గుర్గన్ వెళ్ళిపోవునప్పుడు నవాబు అతనికేసి గుర్రుగా చూచాడు, "యుద్ధం ముగియునంతకాలం నిన్నేమీ అనను – యుద్ధకాలంలో నువ్వే నా ఆయుధం ఆ తర్వాత దలనీబేగం ఋణాన్ని నీ రక్తంతో తీరుస్తాను" అనే ఆ చూపులోని అర్థం.

నవాబు వెంటనే ముంశీని పిలిపించి, "అమియట్ నౌక ముర్షిదాబాదుకు చేరగానే. అతణ్ని బంధించి, అతనితో వున్న ఖైదీలను విముక్తంచేసి మాముందు హాజరు పర్చవలయును" అని ముర్షిదాబాదులోని మహమ్మద్ తకీకి ఆజ్ఞలు జారీ చేయవల్సిందనీ ఆదేశించాడు." ప్రత్యక్ష యుద్ధానికిదిగక తెలివితో, యుక్తిగా బంధించవల్సిందని కూడా వ్రాయండి ఫర్మానాను జలమార్గాన గాక స్థలమార్గానే పంపండి."

నవాబు జనానాకు వెళ్ళి శైవలిని పిలిపించాడు. "ప్రస్తుతం నీభర్త విడుదల పొందలేదు. ఆంగ్లేయులు వారందర్ని కలకత్తాకు తీసుకుపోయారు. ముర్షిదాబాదుకు ఆజ్ఞలుపంపాము, వారిని అక్కడే పట్టుకుంటారు. నువ్వు ప్రస్తుతం..." అన్నాడు

నవాబు.

శైవలిని చేతులుజోడించి "ఈ అప్రస్తుత ప్రసంగినిని మీరు మన్నించాలి; వెంటనే మనుషుల్ని పంపితే పట్టుకోవటం సాధ్యం కాదా?" అని అంది.

"ఆంగ్లేయుల్ని పట్టుకోవటం కొద్దిమందితో అయ్యేపని కాదు. సాయుధ సైనికుల్ని పంపాలి, పెద్దనౌక కావాలి. వెంటబడి తరిమితే ముర్షీదాబాదువద్ద పట్టుబడవచ్చు, ఇంత పెద్ద యుద్ధప్రయత్నాలను చూచి ఆంగ్లేయులు ఖైదీలను చంపివేసినా చంపివేయవచ్చు. ముర్షీదాబాదులో తెలివైన సర్దారులు చాలామంది వున్నారు. వాళ్ళు తెలివిగా, యుక్తితో ఆంగ్లేయుల్ని పట్టుకుంటారు."

అందమైన ముఖంవల్ల అనేక ఉపకారాలు జరిగాయనేది శైవలిని గ్రహించింది. నవాబు ఆమె అందమైన ముఖమండలాన్ని చూచి ఆమె మాటలన్నింటినీ విశ్వసించాడు, ఆమె యందు ఎంతో దయ చూపిస్తున్నాడు. లేకపోతే విషయాలన్నీ ఇంత విశదంగా ఎందుకు చెప్తారు? శైవలిని మరల ధైర్యంచేసి నమస్కరించి "ప్రభూ, ఈ అనాథయందు ఇంతదయ చూపిస్తున్నారు, నేను మరొక భిక్ష వేడుతున్నందుకు క్షమించండి. నా భర్తను విడుదల చేయుట చాలా తేలిక, వారు చాలా గొప్పవీరులు. వారి చేతిలో ఆయుధం వున్నట్లయితే ఆంగ్లేయులు వారిని బంధించి వుంచలేరు. ఆయనకు ఇప్పుడు ఆయుధం లభిస్తే ఆంగ్లేయులు వారిని ఆపి వుంచలేరు. ఎవరైనా వెళ్ళి వారికి ఆయుధం ఇచ్చిరాగల్గిన, వారు తనుంతట తానే విముక్తిచెంది, తనతోటివారినికూడా విడి

పించగలుగుతారు" అని చెప్పింది.

నవాబు నవ్వి "నువ్వింకా చిన్నదానవు, ఆంగ్లేయులంటే ఎవరో నీ కింకా తెలియదు. ఆంగ్లేయుల నావపైకి వెళ్ళి ఆయుధం ఎవరు ఇచ్చి రాగలరు ?"

శైవలిని తలవంచి నమ్రంగా "ఏమైనా అనుజ్ఞనిచ్చి, ఒక నావ దొరికితే, నేనే వెళ్తాను" అని అంది.

నవాబు బిగ్గరగా నవ్వాడు. వారి నవ్వు చూసి శైవలిని ముఖం ఎరుపెక్కింది."ప్రభూ, చేయలేకపోతే చనిపోతాను—దానివలన ఎవరికీ ఏమీ నష్టం కలుగదు. చేయగలిగినట్లయితే నా పనీ నెరవేరుతుంది, మీ పనీ పూర్తవుతుంది" అంది శైవలిని.

నవాబు ఎరుపెక్కిన శైవలిని ముఖాన్ని చూచి ఈమె మామూలు స్త్రీ గాదని గ్రహించాడు. చస్తే చావనీ, నాదేం పోతుంది ? చేయగలిగితే మంచిదే, లేకపోతే ముర్షిదాబాదులో మహమ్మదు తకీ ఎలాగో పూర్తి చేస్తాడు, అని ఆలోచించి "నువ్వు ఒంటరిగానే వెళ్తావా ?" అని అడిగాడు.

"నేను స్త్రీని, ఒంటరిగా వెళ్ళలేను. దయవుంచి ఒక దాసిని ఒక కాపలా వానిని మాత్రం పంపించండి" అని అడిగింది శైవలిని.

నవాబు ఆలోచించి ఒక విశ్వాసపాత్రుడైన నౌకరును పిలిపించాడు. అతడు గొప్పసాహసి, అతి బలవంతుడు. అతడు వచ్చి నవాబుముందు శిరమువంచి నిల్చున్నాడు. "ఒక హిందూ దాసీని వెంటదీసుకొని ఈమెతో వెళ్ళు. ఈమె ఏ ఆయుధాలు కావాలంటే అవన్నీ తీసుకో, నావల మేస్త్రీని

అడిగి త్వరగా పోయే నౌక నొకదానిని తీసుకోండి. ఇవన్నీ సమకూర్చుకొని తక్షణం బయలుదేరి ముర్షిదాబాదుకు వెళ్ళండి"అని ఆదేశించాడు నవాబు.

"పోయి చేయవలసిన పనేమిటి ప్రభూ?" అని అడిగాడు ముసీబుద్దీను.

"ఈమె చెప్పిన పనే చెయ్యి. బేగంలవలె ఈమెనుకూడా గౌరవించు. దలనీబేగం కల్పించిన వెంట తీసుకురా ?"

తరువాత శైవలిని, ముసీబుద్దీనులు నవాబుకు నమస్కరించి శలవు తీసుకున్నారు. కొజ్జా ఏ విధంగా సలాము చేశాడో చూచి శైవలినికూడా ఆ విధంగానే భూమిని తాకి వెనుకకు తగ్గుతూ సలాం చేసింది. నవాబుకు నవ్వాగలేదు.

వెళ్ళిపోవునప్పుడు నవాబు "బిడ్డా! గుర్తుంచుకో, ఎప్పుడైనా ఏదైనా కష్టం కలిగితే మీర్ కాశీంను మాత్రం మరచిపోకు" అని చెప్పాడు శైవలినితో.

శైవలిని తిరిగి సలాం చేసింది, మరచిపోకుమా ? వీలైనచో రూపసి భర్తను తీసుకొని మీ కొలువుకే వస్తాను" అనుకుంది మనస్సులో. ముసీబుద్దీను దాసీని, నౌకను ఏర్పాటు చేసుకొని, శైవలిని ఆదేశం ప్రకారం లపాకి, పిస్తోలు, కత్తి, ఒక బాకు తీసుకున్నాడు. ముసీబుద్దీను 'ఇవన్నీ ఎందుకోసం ?' అనిమాత్రం అడగ సాహసించలేకపోయాడు. ఈమె మరొక చాంద్ సుల్తానా అని మనస్సులో యోచించాడు. ఆ రాత్రే నావలో బయలుదేరారు.

101

# 4

వెన్నెల విరుగగాస్తోంది. గంగానదికి ఇరువైపుల విశాలమైన ఇసుక మైదానముంది. చంద్రకిరణములు సోకి నంతనే ఆ మైదానము మరింత శ్వేతశోభను ధరించింది. ఆ వెన్నెలలో గంగాజలము మరింత ముదురు నీలవర్ణంగా వుంది. గంగాజలము ముదురు నీలవర్ణము, ఒడ్డునవున్న వృక్ష సముదాయము మేఘములవలె శ్యామలవర్ణంగా వున్నాయి. పైన రత్నాలు పొదజల్లిన నీలాకాశము. ఈ విధమైన విస్తారమును తెలుసుకొన్నప్పుడు, అప్పుడప్పుడు మనస్సు చంచల మౌతూ వుంటుంది. అనంతమైన నది, కనుచూపుమేర నదికి అంతమే కన్పించదు, మానవుని అదృష్టంవలె అస్పష్టమై భవిష్యత్తులోకి పోయి లీనమైపోయింది. క్రింద నది అనంతమే, ప్రక్కనున్న యిసుక మైదానాలు అనంతమే.

"అది ఏమిటి ?" అన్నాడు.

"ఎవరిది ! రాజు చచ్చాడా ?" అన్నాడు జాన్సన్.

ఏడ్పు మరింత హెచ్చింది. కంఠస్వరం అంత హెచ్చు స్థాయిలో లేకపోయినా ఆ ప్రశాంత నదీతీర మైదానంలో ఆ అర్ధరాత్రపు సమయంలో ఏడ్పు బిగ్గరగానే విన్పిస్తుంది. ఆమియట్ ఆటవదలి లేచాడు. బైటకువచ్చి చుట్టూ చూచాడు. ఎవరూ కన్పించలేదు. చూస్తే, సమీపమందు స్మశానం కూడా ఏమీలేదు. ఆ యిసుక మైదానం మధ్య నుంచి ఏడ్పు వినవస్తోంది.

ఆమియట్ నౌకలోనుంచి దిగి ఏడ్పు వినవస్తున్న దిక్కుగా వెళ్ళాడు. కొంచెందూరం వెళ్ళి చూచేసరికి ఆ ఇసుక

మైదానంలో ఎవరో ఒంటరిగా కూర్చొని వున్నారు.

ఆమియట్ దగ్గరకు వెళ్ళి చూచాడు, ఒక స్త్రీ కూర్చొని బిగ్గరగా ఏడుస్తోంది.

ఆమియట్‌కు ఆమె భాష సరిగా రాదు. "ఎవరు నువ్వు ? ఎందుకేడుస్తున్నావు ?" అని తనకు వచ్చిన భాషలో అడిగాడు.

అతడి భాష సరిగా అర్థంకాక స్త్రీ మరింత బిగ్గరగా ఏడ్వసాగింది. ఆమియట్ ఎన్ని పర్యాయములు ప్రశ్నించినా, జవాబు చెప్పకపోయేసరికి తనవెంట రావలసిందిగా సైగ చేశాడు. ఆ స్త్రీ లేచి ఆమియట్ వెనుకే ఏడుస్తూ బయలు దేరింది. ఆమె మరెవ్వరో కాదు — శైవలినే.

# 5

నావలోనికి తిరిగివచ్చి ఆమియట్, గ్లాస్టన్‌తో "ఈ స్త్రీ ఒంటరిగా ఆ దిబ్బమీద కూర్చొని ఏడుస్తూవుంది. ఈమెకు నామాట అర్థం కావటంలేదు; నాకు ఆమె మాట తెలియటం లేదు. నువ్వామెతో మాట్లాడు" అని చెప్పాడు.

గ్లాస్టన్‌కూడా యించుమించు ఆమియట్‌వంటి పండితుడే హిందీలో. కానీ, ఆ ఆంగ్లేయుల్లో హిందీ బాగా మాట్లాడగలడని ఇతనికి చాలా పేరుంది. "ఎవరు నువ్వు ?" అని ప్రశ్నించాడామెను.

శైవలిని జవాబేమీ చెప్పకుండా ఏడ్వసాగింది.

"ఎందుకు ఏడుస్తున్నావ్ ?"

శైవలిని దానికీ ఏమీజవాబు చెప్పలేదు, ఏడుస్తూనేవుంది.

"ఎవ్వరు మీది ?"

శైవలిని అలాగే వుంది.

"నువ్విక్కడికి ఎందుకొచ్చావ్ ?"

... ... ...

గ్లాస్టన్ విసిగిపోయాడు. ఆమె ఏమాటకూ జవాబు చెప్పకపోవటం చూచి ఆంగ్లేయులు వెళ్ళిపొమ్మన్నారు. శైవలినికి ఆమాటకూడా అర్థంకాలేదు. అక్కడినుంచి కదలనేలేదు.

"మనమాట ఈమెకు అర్థం కావటంలేదు, దుస్తులను బట్టి బెంగాలీ స్త్రీవలె వుంది. ఒక బెంగాలీని పిలిచి అడిగి తెలుసుకోండి" అన్నాడు ఆమియట్.

ఆంగ్లేయులవద్ద వుండే వంటవాళ్ళు తరచు బెంగాలీ ముస్లిములై వుండేవారు. ఆమియట్ వారిలో ఒకనిని పిలిచి మాట్లాడమని చెప్పాడు.

"ఎందుకేడుస్తున్నావ్ ?" అని అడిగాడు వంటమనిషి. శైవలిని పిచ్చిదానివలె నవ్వేసింది.

"ఈమె పిచ్చిది" అన్నాడు దొరలతో వంటమనిషి.

"ఏమి కావాలో అడుగు" అన్నారు దొరలు.

వంటమనిషి అడిగాడు. "ఆకలిగా వుంది" అని చెప్పింది శైవలిని. వంటవాడు దొరలకీ విషయం చెప్పాడు.

"ఆమెకు ఏదైనా ఆహారం పెట్టు" అని చెప్పాడు ఆమియట్.

వంటవాడు చాలా సంతోషించి ఆమెను భోజనాలు నావలోకి తీసుకు వెళ్లాడు. సంతోషంతో శైవలిని మరింత

అందగా వుంది. ఆమెఏమీ తినలేదు. "తిను!" అన్నాడు వంట వాడు. "బ్రాహ్మణస్త్రీని, మీరు తాకిన ఆహారం తినను" అని చెప్పింది శైవలిని.

వంటవాడు ఆవిషయాన్ని దొరలకు చెప్పాడు. "ఈ నౌకలో బ్రాహ్మణు లెవరూ లేరా ?" అనిఅడిగాడు ఆమియట్.

"ఒకసైనికుడు, ఒకఖైదీ వున్నారు" అని చెప్పాడు వంట మనిషి. "వారివద్దవుంటే కొంచెం అన్నం పెట్టించు" అన్నాడు ఆమియట్.

వంటవాడు శైవలినిని మొదట సైనికుని వద్దకు తీసుకు వెళ్లాడు. అతనివద్ద ఏమీ లేదు. అప్పుడిహ వంటమనిషి శైవలినిని ఖైదీవున్న నావలోకి తీసుకు వెళ్లాడు.

ఆ బ్రహ్మణఖైదీ మరెవ్వరోకాదు, ప్రతాప్‌రాయ్ ఒక చిన్ననావలో ప్రతాప్ ఒక్కడే వున్నాడు. చుట్టూకాపలావుంది. నౌకలో అంధకారంగా వుంది. "ఓ ఠాకుర్ !" అని పిల్చాడు వంట మనిషి.

"ఎందుకు ?" అన్నాడు ప్రతాప్.

"ఒకబ్రాహ్మణస్త్రీకి చాలాఆకలిగావుంది. నీవద్దఏమైనా వుంటే ఇవ్వగలవా ?" అని అడిగాడు.

ప్రతాపుని వద్దకూడా అన్నమేమీలేదు. కానీ, ప్రతాపు డావిషయం చెప్పలేదు "ఇస్తాను, నాసంకెళ్లు తీసివేయమని చెప్పు" అని అన్నాడు.

వంటవాడు కాపలావానితో సంకెళ్లు తీసివేయమని చెప్పాడు. "ఆజ్ఞాపత్రం చూపించు" అని అడిగాడు సైనికుడు.

వంటవాడు ఆజ్ఞాపత్రం కోసం వెళ్లాడు. ఇతరుల కోసం

ఇంతశ్రమ ఎవరు చేస్తారు ? ముఖ్యంగా పీర్‌బఖ్ను దొరగార్ల వంటవాడు, తనంతట తానుగా ఇతరుల కెన్నడూ సహాయం చేయడు. భూమిమీదవున్న అన్నిరకాల మనుష్యుల్లోనూ ఆంగ్లేయుల వద్దవుండే ముస్లింలు అందరికంటే బహునీచులు. కానీ, ఇక్కడ పీర్‌బఖ్నుకు తనస్వప్రయోజనంకూడా కొంత వుంది. ఈస్త్రీ భోజనం చేసిన తరువాత ఆమెను తనవెంట నది లోకి తీసుకువెళ్ళి కూర్చోబెట్టాలని ఆలోచించాడు. ఆమెకోసం భోజనం సంపాదించే ప్రయత్నంలో నిమగ్నమై పోయాడు. శైవలిని ప్రతాపుడు వున్న నావలోనే బైటనిలబడివుంది. వంట వాడు ఆజ్ఞాపత్రం తేవటానికని ఆమియుట్ వద్దకు వెళ్లాడు. శైవలిని నిండా ముసుగు వేసుకొని నిలబడివుంది.

అందమైనముఖం సర్వత్రా జయం పొందుతుంది. ముఖ్యంగా ఆ అందమైనముఖం ఒక యువతివుంటే, అప్పుడా మానం అమోఘ అస్త్రంగా పనిచేస్తుంది. ఆస్త్రీ అత్యంత సౌందర్య వతి అని ఆమియుట్ గమనించాడు. ఆమె పిచ్చిదని విన్నప్పుడు చాలా దయగల్గింది. ఆమెపై ప్రతాపుని సంకెళ్ళు తీసివేయు టానికి, శైవలిని ఆనావలో భోజనం చేయటానికి ఆమియుట్ జమాదారుపేర ఆజ్ఞాపత్రం వ్రాసియిచ్చాడు

వంటవాడు ఒకదీపం తెచ్చియిచ్చాడు, కాపలా సైని కుడు అతని సంకెళ్ళు తీసివేశాడు. వంటవానిని ఆ నావలోనికి రావద్దనిచెప్పి ప్రతాపుడు ఆ దీపం తీసుకొని ఆదరబాదరాగా భోజనం తేవటానికి లోనికి వెళ్ళాడు. పారిపోవాలనేదే - తలంపు.

శైవలిని కూడా లోనికి వెళ్ళింది. సైనికులు చుట్టూ

నిలబడి కాపలాకాస్తున్నారు. లోన ఏమిజరుగుతుందో ఎవరికీ కన్పించదు. శైవలిని లోనికి వెళ్ళగానే ముసుగు తీసివేసి ప్రతాపుని ముందు కూర్చుంది.

అతనికి అమితాశ్చర్యం కల్గింది. కొంచెం తేరుకొని చూచేసరికి శైవలిని పెదవి కొరుక్కుంటుంది. ముఖం ఆనందంతో విప్పారింది. ముఖమండలంలో ఒక దృఢ ప్రతిజ్ఞ వ్యక్తమవుతోంది. ఈమె సింహానికి తగిన సింహానేనని ప్రతాప్ తనలో తాను అనుకున్నాడు.

"చేతులు కడుక్కో, నేను అన్నానికి అల్లాడిపోతున్నాననుకున్నావా యేం" అంది శైవలిని అతనిచెవిలో మెల్లగా.

ప్రతాపుడు చేతులు కడుక్కున్నాడు. "ఇక పారిపో, ఆ నది మలుపులో వున్న నావ నీకోసమే" అని చెప్పిందామె.

"ముందు నువ్వువెళ్ళు. లేనిచో చాలా ఆపదలో చిక్కుకుంటావ్" అన్నాడు ప్రతాప్ కూడా నెమ్మదిగా.

"నువ్విప్పుడే పారిపో సంకెళ్ళు వేస్తే పారిపోలేవు. వెంటనే నదిలో దుముకు. ఆలస్యం చేయకు ఆగు నాకొక ఉపాయం తోస్తుంది. నేను పిచ్చిదానివలె నదిలో దూకుతాను నన్ను రక్షించటానికని నువ్వుకూడా దుముకు" అని చెప్పింది శైవలిని.

ప్రతాపునితో ఈవిధంగాచెప్పి శైవలిని బిగ్గరగా నవ్వసాగింది. బిగ్గరగా నవ్వుతూ "నేను అన్నం తింటాను." అని అంటూ బైటకివచ్చి ఏడుస్తూ" నాకు ముస్లింలు అన్నం పెట్టారు, నా జాతిపోయింది. ఓ గంగామాతా, నాకు ఆశ్రయ మివ్వు" అని శైవలిని గంగాప్రవాహంలో దూకింది.

"ఏమిటి? ఏం జరిగింది?" అంటూ ప్రతాపుడుకూడా బైటకు వచ్చాడు. కాపలా సైనికుడు ఎదురుగా నిలబడి అడ్డగిస్తున్నప్పటికీ "విశ్వాసఘాతకుడా! స్త్రీ నదిలో మునిగి చనిపోతూవుంటే చూస్తూ నిల్చున్నావా?" అని ప్రతాప్ కాపలా వానిని గట్టిగా తన్నాడు. ఆ తన్నుతో సైనికుడు నావఅంచున పడ్డాడు.

"ఆ స్త్రీని రక్షించండి!" అంటూ ప్రతాప్ రెండవ వైపుకు దుమికాడు. ఈలోగా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ శైవలిని ఈదుకుంటూ ముందుకు వెళ్తూవుంది, ప్రతాపుడు ఈదుతూ ఆమె వెనుకనే వెళ్తున్నాడు.

"ఖైదీ పారిపోయాడు!" అంటూ పైన వున్న సైనికుడు అరిచి తుపాకి గురిపెట్టాడు. ప్రతాప్ ఈదుకుంటూ పోతూనే వున్నాడు.

ప్రతాప్ బిగ్గరగా అరుస్తూ "భయపడకండి, పారిపోవటం లేదు. ఈ స్త్రీని తీసుకొస్తాను — స్త్రీ హత్యను చూస్తూ ఎలా వూరుకుంటాను? మీరు పాపాత్ములు, హిందువులై వుండికూడా బ్రహ్మహత్యకు పాల్పడతారా?" అని అన్నాడు.

సైనికుడు తుపాకిని కిందికి దించేశాడు.

అప్పటికి శైవలిని అన్నిటికంటె చివరవున్న నావ వద్దకు చేరుకొంది. ఆ నావనుచూచి అకస్మాత్తుగా శైవలిని త్రుళ్ళిపడింది. లారెన్సు ఫాస్టరుతో శైవలిని వున్న నావ అదే; శైవలిని కంపించిపోతూ ఒక క్షణకాలం ఆ నావ కేసి చూస్తూ వుండిపోయింది. ఆ నావ పైభాగాన వెన్నెలలో ఒక దొరగారు చిన్న మంచంపై అచేతనావస్థలో పరుండి

వున్నాడు. అతడి ముఖంపై తెల్లని వెన్నెల పడుతోంది. శైవలిని బిగ్గరగా కెవ్వున అరచింది—చూస్తే, అతడు లారెన్స్ ఫాస్టరు.

లారెన్స్ ఫాస్టరుకూడా ఈదుతున్న వ్యక్తిపైకి దృష్టి మరల్చాడు, గుర్తించాడు - శైవలిని పాడవుగా వుంది. అతడుకూడా "పట్టుకోండి, పట్టుకోండి నా వైఫ్" అని అరచాడు, ఫాస్టరు చాలా బలహీనంగా, రోగంతో చిక్కి శల్యమై మంచంలో పడున్నాడు. లేచేశక్తికూడా లేదు.

ఫాస్టరు మాటలు విని నలుగురైదుగురు వెనుక ముందు చూడకుండా నదిలో దూకారు. ప్రతాపుడు ఆ సమయమందు వారందరికంటే ముందున్నాడు. వాళ్ళందరు ప్రతాపుణ్ని పిలచి "పట్టుకో! ఆమెను పట్టుకో! ఫాస్టరుదొర బహుమాన మిస్తారు" అని చెప్పారు అతనితో. "ఫాస్టరుకు నే నింతకు ముందొక పర్యాయం బహుమాన మిచ్చాను—సరే, ఇంకొక సారి చూస్తాను" అనుకున్నాడు తనలో. తర్వాత వారి కేసి తిరిగి "మీరు పైకి వెళ్ళండి, నేను పట్టుకొని తీసుకొస్తాను" అని చెప్పాడు.

ఆ మాటను విశ్వసించి అందరూ తిరిగి వెళ్ళిపోయారు. ముందువెళ్తున్న వ్యక్తి ప్రతాప్ అని ఫాస్టరు గుర్తించలేక పోయాడు.

## 6

ఈదుకుంటూ వారిద్దరూ చాలాదూరం వెళ్ళిపోయారు. ఎంత మనోహర దృశ్య మది! ఏదో సుఖసముద్రంలో

ఈదుతున్నారు. ఈ అనంత దేశ వ్యాప్తమైన విశాల హృదయము, చిరుకెరటాలలో నీలవర్ణమైన నది వక్షముపై జ్యోత్స్న సాగరంలో ఈదుతూ పైన ఆ అనంత నీల సముద్రంపైకి దృష్టిపోయింది. అప్పుడు ప్రతాప్ "ఈ సముద్రంలో ఈదటం మానవుని అదృష్టంలో వ్రాసిలేదెందువల్ల ? ఏమి పుణ్యంచేసుకుంటే ఈ సముద్రంలో ఈదే జీవిని కాగలుగుతాను ? అల్పమైన ఈ నదిలో ఈదటంకూడా ఈదటమేనా ? జన్మించినప్పటినుంచి భయంకర కాలంతో సమానమైన ఈ అలపై తిరుగాడుతున్నాను —ఇప్పుడేమో ఈదటమైందది ?" అని ఆలోచించసాగాడు.

"ఈనదికి ఒక అంతువుంది- నేనింతవరకు అగాధ జలంలో వుండిపోయాను" అనుకుంది శైవలిని.

"నువ్వు స్వీకరిస్తే స్వీకరించు, లేకపోతే మానుకో" అన్నంత మాత్రాన జడప్రకృతి వదలిపెట్టదు. సౌందర్యమనేది దాగి వుండదు నువ్వీసముద్రంలో ఈదినాసరే జలంలోని నీలివర్ణం మాత్రం చెదరిపోదు — చిరుకెరటాలు మాసిపోవు - నక్షత్రాలు అదేవిధంగా ప్రకాశిస్తాయి - ఒడ్డునవున్న వృక్షాలా విధంగా వుయ్యాల లూగుతూనే వుంటాయి, చంద్రకిరణకాంతి నీటిలో ఆడుకుంటూనే వుంటుంది. జడ ప్రకృతియొక్క కాఠిన్యము స్నిగ్ధమాయవలె ఎప్పుడూ ఆదరాన్నే కోరుతుంది.

ప్రతాపుని దృష్టిలో ఇవన్నీ వున్నాయి. కానీ శైవలిని దృష్టిలో ఇవేమీ లేవు. శైవలిని నావమీద చిక్కిశల్యమై పాలిపోయిన ముఖాన్ని చూచింది. అదే ఆమె మనస్సులో మెదులుతూవుంది. శైవలిని కాంపుబొమ్మవలె ఈదుతోంది.

ఆమెకు శాంతి లేనే లేదు. ఇద్దరూ ఈతలో నిపుణులే. ఈతలో ప్రతాపుని ఆనందం సముద్ర తరంగాలవలె లేస్తుంది.

"శైవలినీ—శై" అని పిల్చాడు ప్రతాప్.

శైవలిని ఉలిక్కిపడింది, హృదయం వేగంగా కొట్టుకో సాగింది. చిన్నతనంలో ప్రతాపుడు ఆమెను 'శై' అనో 'శైలూ' అనో పిలుస్తూ వుండేవాడు. ఆ ముద్దుపేరుతోనే పిల్చాడు. ఎన్నినాళ్ళ కెన్నినాళ్ళకో, సంవత్సరాల లోకాన్ని ఏమి కొలుస్తాం? శైవలిని ఎన్నోసంవత్సరాలుగా 'శై' అనే శబ్దం వినలేదు. అది ఆమెకొక మన్వంతరంవలె తోస్తుంది. ఇప్పుడా మాటను విని ఆమె ఆ అనంతజలరాశిలో కన్నులు అర మోడ్చింది. లోలోపల చంద్రుడ్ని, నక్షత్రాలను సాక్షులుగా గ్రహించింది. కన్నులు అరమోడ్చి "ఇవాళకూడా నగరంలో చంద్రునికాంతి ఎంతుంది?" అని అంది.

"చంద్రుని కాంతా? కాదు సూర్యుడు ఉద యించాడు — శై ఇహ భయంలేదు. గ్రహించటానికేవరూ రారు?" అన్నాడు ప్రతాప్.

"అయితే ఒడ్డుకు వెళ్దాంపద"

"శై"

"ఏమిటి?"

"గుర్తుకొస్తుందా?"

"ఏమిటది?"

"ఒకప్పుడిలాగే ఈదవల్సింది."

శైవలిని జవాబు చెప్పలేదు. ఒక పెద్దదుంగ కొట్టుకొని పోతూవుంది. శైవలిని దానిని పట్టుకొంది...పట్టుకో, భారం

తగ్గిస్తుంది. విశ్రమించు దాని సహాయంతో" అన్నాడు ప్రతాప్. అతనుకూడా ఆ దుంగను పట్టుకొని "గుర్తుస్తోందా? నువ్వు మునగలేకపోయావు, నేను మునిగాను" అని అన్నాడు.

"గుర్తుంది. ఆ పేరుతో నువ్వావాళ పిలిచి వుండకపోతే దానికి ప్రాయశ్చిత్తం చేసేదానినే ఇప్పుడు. అలా ఎందుకు పిలచావ్?" అంది శైవలిని.

"అయితే మనస్సులో వుందన్నమాట. గుర్తుచేస్తే నేను మునగగలను" అన్నాడు. శైవలిని భయపడి – ప్రతాప్ తీరానికి చేరుకుందాం పద అంది.

"నేనురాను ఇవ్వాళ చస్తాను."

ప్రతాప్ ఆ దుంగను వదలివేశాడు.

"ఎందుకు ప్రతాప్?"

"నేను నవ్వుతూ చెప్పటంలేదు, నిజంగానే మునుగుతాను, నీ చేతుల్లో."

"ప్రతాప్ ఏమికావాలి నీకు? నువ్వెలాచెబితే అలాగే చేస్తాను."

"ఒక ప్రమాణం చెయ్యి, అలా అయితేనే వస్తాను."

"ఏమిటా ప్రమాణం ప్రతాప్?"

శైవలిని కూడా ఆ దుంగను వదలివేసింది. ఆమె కళ్ళకు నక్షత్రాలన్నీ అస్తమించాయి. చంద్రుడు వెలవెలబోతున్నది. నీలాజలం నీలిరంగు అగ్నివలె మెరుస్తుంది. ధైర్యం కత్తితీసుకొని ఎదురుగా నిలిచినట్లుంది. శైవలిని మంద్ర కంఠంతో "ప్రతాప్, ఏమిటా ప్రమాణం?" అని అడిగింది.

ఇద్దరూ ఆ దుంగను వదలి దగ్గర దగ్గరగా ఈదు

తున్నారు. గంగానది కలకలారావం మధ్య ఈ భయంకర సంభాషణ జరుగుతోంది. చుట్టూ చెదిరివున్న జలకణాల్లో చంద్రుడు నవ్వుతున్నాడు. జడప్రకృతి హృదయం ఎంత కఠోరమైనది.

"ఏమిటా ప్రమాణం ప్రతాప్ ?"

"ఈ గంగాజలంలో"

"గంగతో నీకేం పని ?"

"ధర్మసాక్షిగా అని చెప్పు ?"

"నాకొక ధర్మమనేది ఎక్కడుంది ?"

"అయితే నామీద ప్రమాణంచేసి చెప్పు."

"దగ్గరకు రా – నీ చేతినిలా యివ్వు."

ప్రతాపుడు దగ్గరకు వెళ్ళి కొంతతడవు ఆగి శైవలిని చేతిని పట్టుకున్నాడు.

"ఇప్పుడిక నీ యిష్టం, నువ్వే ప్రమాణం చేయమన్న చేస్తాను. అది ఎంతకాలానికి ప్రతాప్ ?"

"నామీద ప్రమాణంచేసి చెప్పు. లేనిచో నేను మునుగుతాను. ఇహ ఈ ప్రాణాలుమాత్రం ఎందుకు. దేని నాశించి ఈ పాపమయ జీవితభారాన్ని మోయాలి ? ఈ వెన్నెలలో, ఈ నిర్మల గంగాప్రవాహంలో ఈ భారాన్ని తగ్గించుకో గలిగితే అంతకంటె సుఖమైనదేముంది ?"

పైన చంద్రుడు నవ్వుతున్నాడు.

"అయినా నీ సాక్షిగా – ఏం చెప్పమంటావ్ ?"

"నన్ను తాకి, నాపై ప్రమాణంచేసి చెప్పు – నేను చావటానికి బ్రతకటానికి, శుభా అశుభములకు, అన్నింటికీ

నువ్వే బాధ్యురాలవు."

"నీ సాక్షిగా, నీపై ప్రమాణంచేసి చెప్తున్నాను. నువ్వు చెప్పేదే ఈ జన్మలో నా నిశ్చయం" అంది శైవలిని.

ప్రతాపుడు అతి భయంకరమైన శపథం చేశాడు. ఆ శపథం శైవలినికి బహుకష్టమైనటువంటిదే. చాలా నిర్ద యతో కూడినది, దానిని పాలించటం అసంభవమైన విషయం, ప్రాణాలు హరించే శపథమది. శైవలిని శపథం చేయలేక పోయింది "ప్రతాప్, ఈ ప్రపంచంలో నావంటి దుఃఖితు లెవరున్నారు ?" అంది ఆమె.

"నేను" అన్నాడు ప్రతాప్.

"నీలో అధికారము - బలము - కీర్తి - మిత్రులు - ఆజ్ఞలు - రూపసి - ఎన్నో ఉన్నాయి - నావద్ద ఏమున్నాయి ప్రతాప్ ?"

"ఏమీ లేవు - అయితే రా. ఇద్దరమూ మునుగుదాం".

శైవలిని కొద్దిక్షణాలు ఆలోచించినందువల్ల ఆమె జీవిత ప్రవాహంలో ఒక ఎదురు అల లేచింది. నేను చని పోతాను. అందువల్ల నష్టం ఏముంది ? కానీ, నన్నుగురించి ప్రతాప్ చనిపోవటం ఎందుకు ? అని ఆలోచించి "ఒడ్డుకు వెళ్దాం పద" అని అంది.

ప్రతాప్ ఆమె చేతిని వదలి మునిగిపోయాడు. అప్పటి కింకా అతని చెయ్యి శైవలిని చేతిలోనే వుంది. శైవలిని గట్టిగా లాగింది. ప్రతాప్ పైకివచ్చాడు.

"నేను ప్రతిజ్ఞ చేస్తాను. కానీ నువ్వొకసారి ఆలోచించి చూడు, నా సర్వస్వము అపహరించావు. నేను నిన్న చూడ

లేను. అంతమాత్రాన నిన్నుగురించిన ఆలోచన నెలా మానేస్తాను ?'' అన్నది శైవలిని.

ప్రతాప్ ఆమె చేతిని వదలించుకున్నాడు. శైవలిని మళ్ళా అతని చేతిని పట్టుకొంది. దుఃఖంతో రుద్ధమైన నిండు గొంతుకతో గంభీరంగా ''ప్రతాప్ - నా చేతిని గట్టిగా పట్టుకో. ప్రతాప్ విను నీపై ప్రమాణంచేసి ప్రతిజ్ఞ చేస్తున్నాను. విను, నీ జీవన్మరణాలు శుభాశుభములు నా అధీనం. నీ శపథమా ? నేటినుంచి నిన్ను మర్చిపోతాను. నేటినుంచే నా సుఖాలన్నింటికి తిలాంజలి వదులుతాను. నేటినుంచి నా మనస్సును స్వాధీనంలో వుంచుకుంటాను. నేటినుంచి శైవలిని మరణించింది'' అని స్పష్టంగా విప్పి చెప్పింది.

శైవలిని ప్రతాప్ చేతిని, ధీంగను వదలివేసింది. ప్రతాపుడు గద్గదస్వరంతో ''ఒడ్డుకు వెళ్దాం పద'' అన్నాడు.

ఇరువురు ఒడ్డుకు చేరుకున్నారు.

ఇద్దరూ కాలినడకనే వచ్చి మలుపు తిరిగాక, నావ సమీపానికి చేరారు, ఇద్దరూ నావపై ఎక్కారు.

రామానందస్వామి వారిద్దర్ని ప్రత్యేక ధ్యానపూర్వకంగా చూస్తున్నట్లు ఇద్దరిలో ఎవరూ గ్రహించలేదు.

ఇక్కడ ఆంగ్లేయులు ఖైదీ పారిపోయాడని తెలుసుకొని వెంబడించారు, కానీ అంతలోనే నౌక కనుమరుగుకు పోయింది.

# 7

ప్రతాపుడు పారిపోయిన తర్వాత రామచరణుని విడుదల తేలికయింది. రామచరణుడు ఆంగ్లేయుల నావలో ఖైదీగా లేడు. అతడి కాల్పులకే ఫాస్టరు గాయపడినట్లుగానీ, కాపలా సైనికుడు చనిపోయినట్లుగానీ ఎవరికీ తెలియదు. అతణ్ని సామాన్య నౌకరుగా భావించి ముంగేరునుంచి వెళ్ళే ముందు ఆమియట్ అతణ్ని వదలివేశాడు. "మీ యజమాని చాలా దుర్మార్గుడు, మేము అతణ్ని తప్పక శిక్షిస్తాం నీతో మాకేమీ పనిలేదు. నీయిష్టం వచ్చినచోటుకు వెళ్ళవచ్చు" అన్నాడు దొర అతనితో, అతనిమాటవిని రామచరణుడు చేతులు జోడించి "నేనొక గొల్లవానిని - మాట్లాడటం తెలియదు - చేస్తారా - నాతో మీకేమైనా సంబంధం వుందా?" అన్నాడు.

ఆమియట్‌కు ఈ విషయం తెలియజేయగానే "ఏం. ఎందుకు ?" అని అడిగాడు.

"లేకపోతే, మీరు నాతో తమాషాచేయటమేమిటి?" అని అడిగాడు రామచరణుడు.

"తమాషా ఏముంది?" అన్నాడు ఆమియట్ దొర.

"నాకాలు విరగ్గొట్టి నాయిష్టం వచ్చినచోటుకు వెళ్ళమంటున్నారంటే, నేను మీయింట్లో వివాహమాడినట్లు తోస్తుంది" అని అన్నాడు. "నేను జాతిగొల్లను, ఇంగ్లీషువాడితో బుట్టువుల్ని చేసుకుంటే జాతి మంటగలసిపోతుంది."

ఆ విషయం తర్జుమాచేసి చెప్పినా ఆమియట్ దొరకు అర్థం కాలేదు, ఇక్కడి నివాసులు ముఖస్తుతిగా 'సోదరా!

తండ్రీ! అమ్మా!' అని సంబంధాలు కలుపుకొని పిలుస్తువుం టారు. రామచరణుడు కూడా అటువంటి శబ్దాన్నే ప్రయో గించి తమతో సంబంధం కలుపుకుంటున్నాడని ఆమియట్ మనస్సులో అనుకొని ఏమాత్రం కోపగించుకోలేదు. "నీకేమి కావాలి?" అన్నాడు.

"నాకాలు బాగు చేయించవల్సిందిగా అనుజ్ఞ ఇప్పిం చండి" అని అడిగాడు రామచరణుడు.

ఆమియట్ నవ్వి, "సరే, మంచిదే. నువ్వు కొద్ది రోజులు మావెంట వుండు, మందు వేయిస్తాను" అనిచెప్పాడు.

రామచరణుడు కోరుకున్నది కూడా అదే. ప్రతాపుడు ఖైదీగా వెళ్ళాడు, రామచరణుడు అతనివెంట వుండగోరు తున్నాడు. అందువల్ల రామచరణుడు తన యిష్టప్రకారమే వారివెంట వెళ్ళాడు. అతడు ఖైదీకాడు.

ప్రతాపుడు పారిపోయినరాత్రి రామచరణుడు ఎవరి తోను ఏమీ చెప్పకుండా నావనుంచి దిగి నెమ్మదిగా వెళ్ళి పోయాడు. వెళ్ళేప్పుడు రామచరణుడు ఇండిల్ పిండిల్‌ల దన్ని - తాండ్రి - అక్క - చెల్లెండ్రను కసిదీరా తిడ్తూ వెళ్ళిపోయాడు.

అప్పటికి అతనికాలు బాగై పోయింది.

## 8

ఆరాత్రి ఇంతవరకు ఆకాశంలో చంద్రదర్శనం కాలేదు. మేఘాలు దట్టంగాపట్టి చంద్రుణ్ణి, నీలాకాశాన్ని కమ్మి వేశాయి. ఆకాశ నలుదిశల పొగరంగు నీటి మేఘాలు కమ్ము

కొచ్చాయి. దానితో నది, ఇసుకమైదానము, తీరమందున్న పర్వతపంక్తి అన్నీ ఏకాకారమైపోయాయి; ఆ అంధకారంలో కాండా టురిమలో ఒంటరిగావుంది శైవలిని.

రాత్రి అంతిమయామము, తరుముకొస్తున్న ఆంగ్లేయుల నౌకర్లు ఎంతో వెనకబడి పోయారు. చాలాదూరం ముందుకువచ్చి నావ తీరానికి చేరింది - నది తీరాల విశాలమైన నిర్జన ప్రదేశాలు వున్నాయి. అలాంటి ఒక నిర్జనప్రదేశం చెంత నావ ఆగింది. ఆ సమయానే శైవలిని రహస్యంగా నావనుంచి పారిపోయింది. ఈ పర్యాయం మాత్రం శైవలిని చెడు తలంపుతో పారిపోలేదు. ఏ భయంతో అయితే, మండుతున్న అడవిజంతువులు పారిపోతాయో, శైవలిని ఆ భయంతోనే ప్రతాప్ వద్దనుంచి పారిపోయింది. శైవలిని ప్రాణభయంతో సుఖ సౌందర్యాలు, ప్రేమ ఆదిగాగల సంపూర్ణ ప్రపంచంనుంచి దూరమైంది. సుఖ సౌందర్యాలు, ప్రేమ ఐశ్వర్యాలు వీటన్నిటియందు శైవలినికి ఇప్పుడేమీ మమత లేదు ఆశకూడా లేదు. ఆ కోర్కెలుకూడా ఇప్పుడిహ త్యాజ్యములే దగ్గరవుండి కోర్కెల్ని ఎవరు త్యజించగలుగుతారు? మరుభూమిలో దాహంతోవున్న బాటసారి, స్వచ్ఛమైన శీతలజలం లభించినప్పుడు త్రాగకుండా వుండగలుగుతాడా? సముద్రపు అట్టడుగున వుండే భయంకరమైన, రాక్షసస్వభావం గలిగి మనుష్యులను తినే జీవుల్ని గురించి విక్టర్ హ్యూగో వర్ణించాడు. ఆశ, కోర్కెలనేవి కూడా అటువంటి స్వభావం గలిగినవిగానే కన్పిస్తాయి. ఇవి అత్యంత స్వచ్ఛమైన, స్ఫటికం కంటే ఉజ్వలంగా వుండే జలంలో వుంటాయి, వీటి నివాసములందు

కాషాయరంగు ఖనిజపుమట్టి మొదలైనవి ప్రకాశిస్తూ వుంటాయి, వీటి భవంతులందు, ముత్యములు, పగడాలు, తమ కాంతికిరణాలను వెదజల్లుతూ వుంటాయి; కానీ ఇవిమాత్రం మానవ రక్తాన్ని త్రాగుతూవుంటాయి; వాటి భవంతాల సౌందర్యాన్ని చూసి ముగ్ధులై అక్కడకు వెళ్ళేవారి రక్తాన్నే త్రాగుతూ వుంటాయి. వందచేతులు గలిగిన ఈ రాక్షసులు క్రమంగా ఒక్కొక్క చేతినే చాచి అతడ్ని పట్టుకుండాను. పట్టుకన్నాయంటే. ఆ చేతులుబడితే బ్రతికి బైటపడి రావటం దుర్లభం వందచేతులతో మెలికలుత్రిప్పి బంధిస్తుంది. త్రాగే తన శతముఖాలను తెరచి మానవ శరీరాలను చీల్చివేసి, రక్తం పీల్చేస్తుంది.

శైవలిని యుద్ధంలోతాను అసమర్థురాలనని గ్రహించి రణరంగాన్ని వదలి పారిపోయింది. తాను పారిపోయిన సంగతి తెలియగానే ప్రతాప్ తనకై వెదక నారంభిస్తాడని ఆమె లో లోపల భయపడుతోంది. అందుకని సమీపంలో ఎక్కడా ఆగకుండా పారిపోగలిగినంత దూరం పారిపోయింది. భారత దేశపు నడికట్టు చందమున సమీపమందే వున్న పర్వతపంక్తి కన్పించిందామెకు. పర్వతంపైకి వెళ్లినట్లయితే తనను వెదకుచు వెనుక వచ్చేవారికి కన్పించ వచ్చుననే ఉద్దేశ్యంతో పగలు ఆమె పర్వతంపైకి ఎక్కనేలేదు. అడవిలోనే దాగింది. రోజంతా నిరాహారంగానే గడిపింది. సాయంత్రంకూడా గడచి పోయింది, చీకటి పడ్తుంది, తర్వాత వెన్నెల వస్తుంది. శైవలిని చీకట్లోనే పర్వతం మీదికి ఎక్కనారంభించింది. చీకట్లో రాళ్ళపై ఎగుడు దెబ్బలుతగిలి ఆమె రెండుపాదాలు గాయాలతో పచ్చిపుండ్లు

అయినాయి. గజి బిజిగా అల్లుకొనివున్న ఆ చిన్ని చిన్ని పొదల్లో ఆమెకు మార్గమే దొరకటంలేదు! ముళ్లు, విరిగిపడివున్న ఎండు కొమ్మలు, చెట్లమోడులు తగిలి, కాళ్లు చేతులునుంచి రక్తం ధారలు గట్టింది. శైవలినికి ప్రాయశ్చిత్తం ప్రారంభమైంది.

దానికి శైవలినికి ఏమీ దుఃఖం కలగలేదు. శైవలిని తన యిష్టప్రకారమే ఈ ప్రాయశ్చిత్తంలో ప్రవేశించింది. ఆమె తన యిష్టంతోనే సుఖమయ ప్రపంచాన్ని త్యజించి ఈ భయంకరమైన ముళ్ళతోను, క్రూరమృగాలతోనూ నిండిన పర్వతారణ్యంలోనికి వచ్చింది. ఇంతకాలమూ ఘోరపాపంలో మునిగివుంది - అయితే యిప్పుడు యీ దుఃఖాలవల్ల పాపం పరిహారమవుతోంది?

అందువల్ల గాయాలు మయమైన పాదాలు, రక్తం ఓడుతున్న శరీరము, ఆకలి దప్పులతో బాధపడుతూ శైవలిని పర్వతంమీదికి ఎక్కసాగింది. ఒక దారీ, డొంకా లేదు - అల్లుకుపోయిన లతలు - పొదలు - రాళ్ళగుట్టల్లో పగలుకూడా మార్గం దొరకదు - అటువంటి ప్రదేశాన పైగా అప్పుడు గాడాంధకారంలో ఆమె ఎంత కష్టపడినా కొద్దిదూరం మాత్రమే ఎక్కగల్గింది.

ఇంతలో దట్టమైన కారుమేఘాలు కమ్ముకొచ్చాయి, ఎక్కడా ఏమాత్రం సందు లేకుండా ఒక కారునల్లని ముసుగు ఆకాశముఖాన్ని కప్పేసింది. తెరలు తెరలుగా దిగిన అంధకారం పర్వతశ్రేణుల్ని, క్రిందవున్న అడవుల్ని, దూరంగా వున్న నదిని సైతం కప్పేసింది. అంధకారమయంగా వున్న ప్రపంచమంతా. శైవలినికి, రాళ్లురప్పలు, ముళ్లు పొదలు,

అంధకారం తప్ప మరోవిధంగా కన్పించటమేలేదు. ఇంకా పర్వతంపైకి ఎక్కటం వ్యర్థం - శైవలిని హతాశురాలై ఆ ముళ్ళ అడవిలో కూర్చుంది.

ఆకాశంనుంచి దిగంతమువరకు, మెరుపులు మెరుస్తున్నాయి. దానితోపాటు భయంకర మేఘగర్జనలు ప్రారంభమయాయి. భయంకర గ్రీష్మఋతు తుపాను ఆ పర్వతశిఖరం మీదికి వస్తుందని భావించింది శైవలిని. వచ్చినా నష్టమేముంది! ఈ పర్వతపు అవయవాల్లో ఎన్ని వృక్షాలు, లతలు ధ్వంసమైపోవడంలేదు! శైవలినికి అటువంటి అదృష్టం కలుగదా?

వంటిమీద టపటప పడుతున్న వర్షపు చినుకులు సుఖకరమైన శీతలస్పర్శవలె కన్పించింది. ఆ తర్వాత దిగంతవ్యాప్తమైన మేఘగర్జన - ఆ గర్జన, వర్షము, గాలి, మేఘాలది! దానితోపాటే ఎక్కడో పెళపెళ ఒక వృక్షం విరిగి నేలగూలటం, భీతిజెందిన పశువేదో అరవటం, బడబడ దొర్లిపడుతున్న ఒకబండ చప్పుడు విన్పించాయి! విసరికొడుతున్న గంగానది కెరటాల కోలాహలం దూరంగా విన వస్తుంది. శైవలిని తలవంచుకొని ఒక శిలాఖండంపై కూర్చొని వుంది. తలపై శీతల జలధార పడుతోంది. గాలి విసుర్లకు, చెట్లకొమ్మలు, పొదలు, లతలు అదేపనిగా శరీరానికి కొట్టుకుంటున్నాయి. పర్వతం పైనుంచి ఒక ప్రవాహం అత్యంత వేగంగా దూకుతూవచ్చి శైవలినిని నడుమువరకు ముంచేస్తున్నది.

1. ఓ జడప్రకృతీ! నీకు కోటి నమస్కారాలు! నీలో

దయ, మమత, కరుణ లేవు; జీవుల ప్రాణాలు హరించటానికి ఏమాత్రం సంకోచించవు, కష్టాలన్నింటికీ జననివి నువ్వే! నేను సర్వము పొందుతున్నది కూడా నీనుంచే — సమస్త సుఖాలకూ నిలయం నీవే! సర్వమంగళ ప్రదాయినివి! అన్ని కోర్కెలు నెరవేర్చేదానివి, అర్థాలన్నింటినీ సిద్ధింపజేసే సర్వాంగ సుందరివి! నీకు నమస్కారం! ఓ మహాభయంకరీ! కాళీ! నీవు మకుట చంద్రుణ్ణి బొట్టుగా పెట్టుకొని శిరముపై నక్షత్రాల కిరీటం ధరించి, ప్రపంచాన్ని మోహింపజేయు హాస చంద్రికలను వెదజల్లుతూ ప్రపంచాన్ని మోహిస్తున్నావు! గంగానది చిరుకెరటాలతో పూలమాలను గుచ్చి ప్రతి పుష్పంలోనూ చంద్రుడ్ని మరపిస్తున్నావు. ఇసుక రేణువులో కోటానుకోట్ల వజ్రాలను మెరిపిస్తున్నావు! గంగ హృదయం నీలిరంగు పోసి, దానితో యువతీ యువకుల్ని ఎన్నో మధురసుఖాల్లో మునిగేటట్టు చేస్తున్నావు! ఆదరణ తెలిసి నట్లుగా ఎంత ఆదరించావు! కాని మరి నేడు, ఇదేమిటి? నిన్ను నమ్మ వీలులేదు! విశ్వసనీయవు కావు! సర్వనాశనము చేయుదానివి నువ్వు! ప్రాణాలతో చెలగాటమాడతా వెందుకు! ఇదిమాత్రం తెలియదు — నీకు బుద్ధిలేదు, జ్ఞానం లేదు, చైతన్యం లేదు; కానీ నువ్వు సర్వమయివి, సర్వము ధ్వంసంచేసే సర్వశక్తిమయివి! నీవు ఈశ్వరుని మాయవు, నీవు ఈశ్వరుని కీర్తివి; నువ్వే అజేయవు! నీకు కోటి కోటి ప్రణామములు!

చాలాసేపటికి వర్షం ఆగింది, కానీ తుపాను అణగిపోలే దింకా, కొద్దిగా తగ్గిందంతే, అంధకారం మరింత గాఢ

మయింది. వర్షంతో జారుతున్న పర్వతంపైకి ఎక్కటం, దిగటం రెండూ అసాధ్యమేనని అనుకున్న శైవలిని అక్కడే కూర్చొని చలితో గడగడ వణకిపోతోంది, అప్పుడామెకు సాంసారిక సుఖాలతో నిండివున్న వేదగ్రామంలోని భర్త యిల్లు గుర్తుకొచ్చింది. మరొకపర్యాయం ఆ సుఖాలను చవి చూచి చనిపోగలిగితేనైనా సుఖంగా చావవచ్చునేమో అనుకోసాగింది మనస్సులో. కానీ అది చాలా దూరస్థ విషయం, ఇప్పుడిహ చచ్చేముందు సూర్యోదయాన్ని కూడా చూడలేవనే తోస్తుంది. మాటిమాటికి ఏ మృత్యువునైతే పిలిచానో, అది ఇవ్వాళ సమీపంలోనే వుంది. సరిగ్గా ఆ సమయంలోనే ఆ నిర్జన పర్వతంపై, అగమ్యమైన ఆ అడవిలో, గాడాంధకారంలో ఎవరో మనిషి శైవలిని శరీరంపై చేయి వేశాడు. ఏదో అడవిమృగమై వుంటుందని భావించింది మొదట శైవలిని. శైవలిని కొద్దిగా జరిగి కూర్చుంది. కానీ తిరిగి అదే కరస్పర్శ ! అంధకారంలో ఏమీ కన్పించటంలేదు. శైవలిని భయకంపితయై "ఎవరు నువ్వు ? దేవతవా, మనిషివా ? మనిషివైతే శైవలిని కేమీ భయంలేదు - కానీ దేవతవైతేనే భయం, దేవతలు దండిస్తారు !" అని అంది.

ఎవరూ ఏమీ బదులు చెప్పలేదు. మనిషిగానీ దేవతగానీ తనను రెండు చేతులతోనూ పట్టుకొంటున్నట్లు గ్రహించింది శైవలిని. ఆమె భుజములపై వెచ్చని శ్వాస తగులుతూ ఉంది - ఒకచేతిని వీపుక్రిందవేసి మరొక చేతితో తన రెండు కాళ్ళనూ కలిపి పట్టుకుంటున్నట్లు ఆమె గమనించింది. ఎవరో తనను ఎత్తుకుంటున్నారని తెలియగానే ఆమె కెవ్వున అగ

చింది - మనిషో, దేవతో తనను చేతులమీద ఎత్తుకొని ఎక్కడికో తీసుకుపోతున్నట్లు మాత్రం ఆమె గ్రహించింది. ఆ వ్యక్తి తనను ఎత్తుకొని పర్వత శిఖరంమీదకి ఎక్కుతున్నట్లు కూడా శైవలిని అర్థం చేసుకుంది. అతడు మరెవరైనా కావచ్చుకానీ లారెన్స్ ఫాస్టసు మాత్రం కాదని శైవలిని తెలుసుకుంది.

## నాల్గవ భాగం

ప్రతాప్ జమిందారు, ప్రతాప్ బందిపోటుకూడా. మేము ఏ కాలాన్ని గురించి చెప్తున్నామో, అప్పటి జమిందార్లు చాలామంది బందిపోటులే. మానవజాతి కోతుల మునిమనుమలని డార్విన్ చెప్పారు. ఈ విషయం విని ఎవరూ ఆగ్రహించనట్లయితే, తన పూర్వుల అపకీర్తిని విని ఏ జమిందారూ మాయందు కోపగించడనే తలుస్తాము. నిజానికి బందిపోటుల వంశంలో జన్మించటమనేది గౌరవహీనం కాదు. ఎందుకనగా కొన్ని కొన్ని సందర్భాలలో బందిపోట్ల వంశస్థులే గౌరవంలో ప్రధానమైన వారుగా ఎంచబడుతూ వుండటం చూస్తున్నాము. తైమూర్ లంగ్ అనే ప్రసిద్ధ బందిపోటు వంశం వారే వంశమర్యాదలో ప్రపంచమందు శ్రేష్ఠులయ్యారు. ఇంగ్లండులోకూడా ప్రజలు వంశ మర్యాదకే ముఖ్యంగా గర్వపడుతూ వుంటారు. నార్మను, స్కాండినేవియా నావికులు, తమను బందిపోటుల వంశం వారనే పరిచయం చేసుకుంటారు. ప్రాచీన భారతదేశంలోకూడా కురువంశానికే ఎక్కువ ప్రతిష్ఠ వుండేది. వాళ్ళు గోవుల్ని దొంగిలించేవాళ్ళు. విరాటుని ఉత్తరపు గోశాలలోని గోవుల్ని దొంగిలించటానికి వెళ్ళారు. కొంతమంది బెంగాలీ జమిందార్ల వంశమర్యాద కూడా ఒక విధంగా ఇలాంటిదే.

అయినప్పటికీ పాత జమిందార్ల దోపిడీకి, ప్రతాపుని బందిపోటుతనానికీ చాలా వ్యత్యాసం వుంది. తన సంపదను రక్షించుకొనుటకో, లేదా ఒక భయంకర శత్రువును అణచ

టానికో మాత్రమే ప్రతాప్ బందిపోటుల సహాయాన్న పేక్షించే వాడు. వ్యక్తంగా ఇతరుల సంపదల్ని దోచుకోటానికీ, లేక ఇతరుల్ని బాధించటానికో దోపిడీ చేసేవాడు కాదు. అంటే దుర్బలులను, పీడితులను రక్షించి, వారికి మేలు చేకూర్చ టానికే బందిపోటువేషం ధరించేవాడు. ప్రతాపుడు ఇక ఆ మార్గాన వెళ్ళాలనే నిశ్చయించుకున్నాడు.

శైవలిని ఆ రాత్రి నావను వదలి పారిపోయింది. ఉదయం కాగానే ప్రతాప్ నిద్రనుంచి మేల్కొని, రామచర ణుడు వస్తూ వుండటం చూచి చాలా సంతోషించాడు. కానీ శైవలిని కన్పించకపోయే సరికి చింతాగ్రస్తుడయ్యాడు. కాస్సేపు ఆమెకోసం ఎదురుచూచి, ఆమె జాడ తెలియక, ఆమెక్కై అన్వేషణ ప్రారంభించాడు. గంగాతీరాన వెదికాడు, కన్పించలేదు. అప్పటికే చాలా ఆలస్యమైంది. ప్రతాప్ నిరాశ చెంది శైవలిని నదిలో మునిగి చనిపోయిందని నిశ్చయించు కున్నాడు. ఇప్పుడామె మునిగి చావటం అసంభవం కాదని ప్రతాప్‌కు తెలుసు.

"నేనే శైవలిని మరణానికి కారణం" అనుకున్నాడు మొదట ప్రతాప్. "నా దోషంమాత్ర ఏముంది? నేను ధర్మముతప్పి అధర్మమార్గాన నడవలేదు. శైవలిని చనిపోతే నేను నివారించవలసిందిఏమీలేదు" అనికూడా అనుకున్నాడు. అతనికి తనపై కోపగించుకోవల్సిన కారణం కన్పించలేదు. చంద్రశేఖరునిపై కొంచెం కోపం వచ్చింది—చంద్రశేఖరుడు శైవలినిని ఎందుకు వివాహమాడాడు? రూపసిమీదకూడా కోపం వచ్చింది కొద్దిగా - తన వివాహం శైవలినితో గాక

రూపసితో ఎందుకు జరిగింది ? సుందరిమీదకూడా కొంత కోపం వచ్చింది – సుందరిగనుక ఆమెను పంపివుండకపోతే ప్రతాపునితో కలిసి ఈదివుండేది కాదు, శైవలిని చనిపోయేది కాదు. కాని అందరికంటె లారెన్స్‌ఫాస్టరుపై ఎక్కువకోపం వచ్చింది—— అతడు శైవలినిని ఇంటినుంచి కదలించి వుండకపోతే ఇదంతా జరిగేదే కాదు. ఇంగ్లీషుజాతి బెంగాలులో అడుగు పెట్టకుండావుంటే శైవలిని లారెన్స్‌ఫాస్టరు చేతుల్లో పడేదికాదు. అందువల్ల ఆంగ్లజాతి అంతటిమీద ప్రతాపునికి కోపం వచ్చింది ఈ పర్యాయము ఫాస్టరును పట్టకొని, చంపి, అగ్నిసంస్కారం కావించాలని ప్రతాప్ నిశ్చయించుకున్నాడు; అలా చేయకపోతే అతడు తిరిగి బ్రతకవచ్చు——భూమిలో పాతిపెట్టినా సమాధిని బద్దలు చేసుకొని పైకి రావచ్చు. 'ఆంగ్ల జాతిని బెంగాలు హద్దులనుంచి తరిమి వేయడం నా కర్తవ్యం అని కూడా నిశ్చయించుకున్నాడు. తప్పకుండాను, వీళ్ళందరిలో ఎందరో ఫాస్టర్లు వున్నారు.

ఈ విధంగా ఆలోచిస్తూ, చింతిస్తూ ప్రతాప్ ముంగేరుకు తిరిగివచ్చాడు. ప్రతాప్ కోటలోనికి వెళ్ళాడు. అక్కడికి వెళ్ళి చూచేసరికి నవాబుగారు ఆంగ్లేయులతో యుద్ధానికి దిగడానికి గట్టిగా సన్నాహాలు చేస్తున్నారు.

ప్రతాప్‌కు చాలా సంతోషం కల్గింది. 'నవాబుగారు ఈ రాక్షసుల్ని బెంగాలునుంచి తరిమివేయగలుగుతారా ? ఫాస్టరు పట్టుబడతాడా ?' అనే అతడు ఆలోచించాడు.

శక్తి వున్నంతవరకు ప్రతివాడూ ఈ పనిలో నవాబుగారికి సాయపడటం వారి వారి కర్తవ్యమనీ, చిన్న చిన్న

సంగం కలిస్తే సముద్రానికికూడా సంతోషన కష్టవచ్చుననీ అనుకున్నాడు.

'నా వల్ల ఏమీ సహాయం జరగదా ? నేనేమీ చేయగలను—నావద్ద సైన్యంలేదు, సాము గరిడీల దళంమాత్రం వుంది—వాళ్ళూ బందిపోటులు, వారివల్ల ఎంతవరకు పనులవుతాయి ?' అని ఆలోచించాడు. 'ఏది జరిగినా జరగకపోయినా దోపిడీలు చేయగలను గదా ! ఆంగ్లేయులకు సహాయపడే గ్రామాలను దోచేస్తాను. ఆంగ్లేయుల ఆహార సామాగ్రి ఎక్కడ దొరికితే అక్కడ దోచేస్తాము. ఆంగ్లేయుల ఖజానా ఇతర సాధన సంపత్తి అందినంతవరకు దోచివేస్తాం. ఆ విధంగా చేసి కూడా నవాబుగారికి చాలా సాయపడవచ్చు. ముఖాముఖి యుద్ధంలో లభించే విజయం శత్రువినాశనపు సాధారణ ఉపాయం మాత్రమే. సైన్యమును వెనకనుంచి దెబ్బతీయటం, ఆహారసామాగ్రి వగైరాలను దోచి శత్రు సైన్యాన్ని ఇక్కట్లుపాలు చేయటం ప్రధాన యుద్ధసూత్రం. నేనదేచేస్తాను' అని నిశ్చయించుకున్నాడు.

'నేనెందుకింత చేయాలి? చేయాల్సిందే; ఇందుకు అనేక కారణాలున్నాయి. మొదటికారణం: ఆంగ్లేయులు చంద్రశేఖరుణ్ణి సర్వనాశనం చేశారు; రెండోది: శైవలిని చనిపోయింది; మూడోది: నన్ను బంధించారు; నాల్గోది ఈ విధంగా ఇంకా అనేకమందిని బాధించారు. ముందు బాధించవచ్చు; అయిదో: నవాబుగారికి ఈ విధంగా సాయపడటం వల్ల ఒకటి రెండు పరగణాలూ లభిస్తాయి. కనుక తప్పక చేసి తీరతాను' అని నిశ్చయించుకున్నాడు.

అప్పుడు ప్రతాప్ వజీర్లను కీర్తించి, వారిద్వారా నవాబును కలుసుకున్నాడు. నవాబుతో జరిగిన సంభాషణ రహస్యంగానే వుండిపోయింది. నవాబును కలుసుకున్నతర్వాత తన స్వస్థలానికి బయలుదేరాడు.

చాలారోజులకు తిరిగి స్వగృహానికి చేరుకునేసరికి రూప సికి విచారమంతా తొలగిపోయింది. కానీ శైవలిని మరణ వార్తవిని రూపసికి దుఃఖం కల్గింది. ప్రతాప్ రాకవిని సుందరి అతన్ని చూడటానికని వచ్చింది. శైవలిని మృత్యుసమా చారం విని ఆమె చాలా దుఃఖించింది. ఆవార్తవిని "జరగా ల్సిందే జరిగిపోయింది. కానీ శైవలిని ఇప్పుడు సుఖపడింది. ఆమె బ్రతికివుండటంకంటే చనిపోవటమే సుఖకరమని మరె ప్పుడూ అనను'' అని అంది సుందరి.

ప్రతాప్ రూపసిని, సుందరిని కలుసుకున్న తరువాత ఇల్లువదలి వెళ్ళిపోయారు. ముంగేరునుంచి కట్వావరకు ముతాగా ఏర్పడుతున్న బందిపోట్లకు, లాఠీదళానికి ప్రతాపే నాయకుడని త్వరలోనే దేశమంతటా తెలిసిపోయింది.

ఇదివిని గుర్గన్‌ఖాన్ చాలా విచారించారు,

## 2

నిబిడాంధకారమయమైన ఆకొండ గుహలో, ఒక శిలా శయ్యపై శైవలిని నిద్రిస్తూవుంది. దీర్ఘకాయుడగు పురుషుడు ఒకడు శైవలినిని పారవేసి పోలేదు. తుఫాను, వర్షము ఆగి పోయాయి - గుహలో ఇంకా అంధకారంగానే వుంది. ఎరు

చూసినా అంధకారమే - అంధకారము - ఆ అంధకారంలో భయంకర నిశ్శబ్దత. కళ్ళు మూసుకున్నప్పుడు కూడా అటువంటి అంధకారమే. నిశ్శబ్దం - అప్పుడప్పుడు ఎక్కడో చిన్న రంధ్రంలోనుంచి గుహలోని రాళ్ళమీద టపటప నీటిబిందువులు మాత్రం పడే శబ్దం విన్పిస్తూంది. మరొక జీవి. మనిషో జంతువో ఆ గుహలోనే శ్వాస పీల్చుకుంటున్న అలికిడికూడా అవుతూ వుంది.

ఇప్పటివరకు శైవలిని భయపడింది. భయమా? అదీ లేదు. మానవుని స్థిరబుద్ధికి కూడా ఒక హద్దువుంటుంది శైవలిని ఆ హద్దుకూడా దాటిపోయింది, శైవలినికి భయంలేదు. ఎందుకనిలేదు? జీవితం ఆమెకు దుస్సహంగావుంది - దుస్సహం మరీ భారం దానిని దించిపారవేయగలిగితేనే మంచిది. మిగిలిన సుఖము, ధర్మము, జాతి, కులము, మానమర్యాదలన్నీ కూడా మంటగలిసిపోయాయి. ఇక పోయేదేముంది? భయమనేది ఎందుకో ఇక?

కానీ శైవలిని చిన్నతనంనుంచి, చిరకాలంగా యత్నపూర్వకంగా ఏ ఆశనైతే రహస్యంగా పెంపొందించుకుంటూ వచ్చిందో, దేనికోసమైతే సర్వమూ త్యజించిందో దానిని అంతకుముందే విధ్వంసం చేసివేసింది, ఆమె మనస్సు చాలా వ్యాకులంగా వుంది - పూర్తిగా బలహీనమైపోయింది. పైగా రెండురోజులు నిరాహారంగావుండటం, మార్గాయాసము వానా గాలినపడి పర్వతం పైకి ఎక్కడం అలసట శరీరమంతా పూర్తిగా డస్సీ శక్తిహీనమైపోయింది. దానికితోడు ఈ భయంకర దైవీకోపము! దైవం అని చెప్పుకుని ఇంకెన్ని,

క్షణాలు స్వస్థతగా వుండగలుగుతాను; శరీరం కృంగిపోయింది మనస్సు విరిగిపోయింది అనిపించింది శైవలినికి. శైవలిని తెలివితప్పి అర్థచేతనావస్థలో పడివుంది. గుహలోపలవున్న రాతిబండమీద వీపు బాధపెడుతూ వుంది.

పూర్తిగా స్పృహతప్పింది. ఆమెకు ఎదురుగా ఒక విశాలమైన నది. కానీ నదిలో నీళ్ళులేవు, తీరాలనొరదుట్టచు రక్తం ప్రవహిస్తోంది. ఆ ప్రవాహంలో విరిగిపోయిన బాలికల గూళ్ళు, మానవశిరస్సులు, కంకాళాలు ప్రవహిస్తున్నాయి. చర్మమాంసాలు లేని మొసలి ఆకారపు ఎముకల గూడొకటి, భయంకర నేత్రాలతో అటునిటు తిరుగుచు కరిగిన శవాలను పట్టుకొని తింటూఉంది. తనును పర్వతం మీదినుంచి తీసుకొని వచ్చిన ఆనుహాకాయుడే తనను మరల పట్టుకొని ఈ నదీతీరానికి తీసుకొనివచ్చి కూర్చోబెట్టాడు. ఆ ప్రదేశంలో ఎండ లేదు. వెన్నెలలేదు. నక్షత్రాలు లేవు, మేఘాలు లేవు, వెలుతురూ లేదు, అంధకారమూ లేదు. అన్నీ కనపడుతూనే వున్నాయి. అయితే మసక మసకగా, రక్తపుటేరు, కరిగిన శవాలు, ప్రవహిస్తున్న అంధకంకాళాలు, ఎముకలగూడు మొసలి అన్నీ ఆభయంకరకారంలో కన్పిస్తున్నాయి నదీతీరాన ఇసుక లేదు-ఆ ప్రదేశమంతా వాడి సూదులతో నిండివుంది, సూదులన్నీ పైవంక చూస్తున్నాయి. ఆ విశాలకాయుడు శైవలినిని అక్కడే కూర్చొనబెట్టి నదిని దాటమని చెప్పాడు. ఆవలి తీరానికి చేరటానికి వేరే ఉపాయమేమీ లేదు. వంతెనగానీ, పడవగానీ లేవు. "ఈదుకుంటూ నదిని దాటు, నీకు ఈత తెలుసు. గంగానదిల్లో ప్రతాపునితో కలిసి ఎన్నో పర్యాయాలు ఈదేవున్నావు"

అని అన్నాడు ఆ విశాలకాయుడు. శైవలిని ఆ రక్తప్రవాహా
న్నెలా ఈదుతుంది? అప్పుడా భీమకాయుడు ఆమెను కొట్టు
టకు తనచేతిలోవున్న బెత్తాన్ని ఝుళిపించాడు. శైవలిని భయ
భీతురాలై బెత్తంకేసి చూచింది, అది మండుతున్న ఇనుప
బెత్తం - ఇనుముతో తయారైనదే. ఆమె ఆలస్యం చేయటం
చూచి ఆ పురుషుడు ఆమె వీపుమీద బాదసాగాడు. దెబ్బతో
శైవలిని దహించుకు పోసాగింది. దెబ్బలబాధకు తాళలేక
శైవలిని ఆ రక్తప్రవాహంలో దూకింది. వెంటనే మొసలి
కంకాళము ఆమెను పట్టుకోవాలని వచ్చిందే కాని పట్టుకో
లేదు ఆమె ఈదుకు పోసాగింది. రక్తధార ఆమె నోటిలోనికి
చొచ్చుకు పోసాగింది. ఆమహాకాయుడు ఆమె వెనుకనే
ఆరక్తధారపై నడిచివస్తున్నాడు - అతడు నీటిలో మునగలేదు
మధ్య మధ్య క్రుళ్ళినమాంసంతో దుర్గంధపూరితమైన శవాలు
ఆమె శరీరాన్ని తాకుతున్నాయి. ఈ విధంగా ఆమె ఆవలి
తీరానికి చేరింది, ఒడ్డుకుచేరి నలువైపుల తేరిచూచి "రక్షిం
చండి! రక్షించండి!!" అంటూ అరవసాగింది. ఎదురుగా
చూచేసరికి దానికి అంతూపంతూ లేదు, దేహము, రంగు,
ఊరూ పేరూ ఏమీ లేవు. అక్కడకూడ వెలుగు చాలా
తక్కువగావుంది, కానీ అదే సలసల కాగిపోతోంది, దాని
కిరణాలు కళ్ళల్లోకి ప్రవేశించి ఆమెకళ్ళు ఊడి పడిపో
తున్నాయి. విషజ్వాలలవంటి జ్వాలలు ఆమెను చుట్టుము
ట్టాయి. ఇహ అక్కడి దుర్గంధం సంగతి సరేసరి, ముక్కులు
మూసుకున్నప్పటికీ ఆ దుర్గంధం వల్ల ఆమెకు పిచ్చెత్తిపోతుంది.
కఠోర కర్కశధ్వనులు, భయంకరశబ్దాలు, హృదయం

బ్రద్దలయే దుఃఖితుల ఆక్రందనాలు రాక్షస వికటాట్టహాసం, భయంకర హుంకారాలు, పర్వతాలు బ్రద్దలవటం, భయంకర మేఘగర్జనలు, పిడుగులు, రాళ్ళవర్షము. జల ప్రళయం, అగ్ని కీలల గర్జనలు, చనిపోయేవారి ఏడ్పులు, ఈ భయంకరధ్వనులకు చెవులు బ్రద్దలవుతున్నాయి. క్షణక్షణమూ ఎదురునుంచి భయంకర గర్జనచేస్తూ వీస్తున్న ప్రచండవాయువు అగ్నిజ్వాలవలె ఆమెను దహించివేయసాగింది. శరీరంలో వందలాది సూదులలాగ గాలి అవయవాలను ముక్కలు ముక్కలుగా తరిగి ఛిన్నాభిన్నం చేయసాగింది. "ప్రాణాలు పోతున్నాయి! రక్షించండి!" అని అరిచింది శైవలిని. భరింపరాని దుర్గంధంతో కూడిన పురుగొకటివచ్చి శైవలిని నోటిలోజొరబడసాగింది. శైవలిని భీతితో అరుస్తూ "రక్షించండి! ఇది నరకం ఇక్కడనుంచి తప్పించుకొనుట కేమీ ఉపాయం లేదా?" అని అంది.

"ఉన్నది" అన్నాడు ఆమహాకాయుడు, నిద్రలోని తన కేకలకే శైవలిని మేల్కొంది. కానీ, భ్రమ మాత్రం తొలగిపోలేదు-వీపున రాతిబండ గుచ్చుకొంటుంది, శైవలిని మేల్కొని వున్నప్పటికీ భ్రమమూలకంగా "ఇప్పుడిహ చేసేదేమిటి? నన్ను రక్షించటానికి మరేఉపాయములేదా?" అని కేక బెట్టింది.

గుహలోనుంచి గంభీరంగా "ఉన్నది" అని విన్పించింది.

ఇదేమిటి? శైవలిని నిజంగానే నరకంలో వుందా? ఆమె విస్మయంతో, విముగ్ధురాలై, భీతిజెందిన మనస్సుతో "ఏమిటా ఉపాయం?" అని అడిగింది.

"పన్నెండు సంవత్సరాల వ్రతమాచరించు!" అని

విన్పించింది గుహలోనుంచి.

దైవవాణి విన్పించిందా ? శైవలిని కాతరస్వరంతో "ఏమిటా వ్రతం ? ఎవరు చెప్పుతారునాకు ?" అని అడిగింది.

"నేనే చెప్పుతాను."

"నువ్వెవరు ?"

"వ్రతమాచరిస్తావా ?"

"ఏమి చేయాలి ?"

"నీ దుస్తులు తీసివేసి, నేనిచ్చేదుస్తులు ధరించు. ఇదుగో చేతులుచాచు !"

శైవలిని చేతులు చాచింది. చాచినచేతుల్లో ఒకవస్త్రం వచ్చిపడింది. శైవలిని దుస్తులు మార్చుకొని "తరువాత ఏమి చేయాలి ?" అని అడిగింది.

"నీ అత్తవారిల్లు ఏది ?"

"వేదగ్రామం అక్కడికి వెళ్లాలా ఏం ?"

"అవును, వెళ్లి గ్రామసమీపాన ఒకకుటీరం నిర్మించుకో."

"తర్వాత ?"

"నేలమీద నిద్రించాలి."

"ఇంకా ?"

"కందమూల ఫలాలుతప్ప మరేమీ తినకూడదు. మిగిలినవన్నీ పూర్తిగానిషిద్ధం, మరేమీ తినకూడదు."

"ఇంకా ?"

"జడలు పెంచుకోవాలి !"

"తరువాత ?"

"ఒక్కపుష్పాహ్యం మాత్రం సాయంత్ర సమయాలందు

భిక్షకోసం గ్రామంలోకి వెళ్లాలి. భిక్ష మెత్తేసమయాన ఇంటింటా నీపాపపు కథను విన్పించాలి."

"నాపాపం చెప్పదగినది కాదా? దానికిక ప్రాయశ్చిత్త మేమీ లేదా?"

"ఉన్నది."

"ఏమిటది?"

"మృత్యువు."

"వ్రతమాచరిస్తాను. తమరెవరు?"

దానికి జవాబేమీ రాలేదు. అప్పుడు మళ్లీ శైవలిని దీనంగా "మీరు ఎవరైనా కావచ్చు; పర్వత దేవతగా భావించి మీకు నమస్కరిస్తున్నాను. మీరు నేనుఅడిగే ఇంకొక ప్రశ్నకు మాత్రం జవాబు చెప్పండి. నాభర్త ఎక్కడ ఉన్నారు?" అని అడిగింది.

"ఎందుకు?"

"నేను వారిని దర్శించుటకు వీలుపడదా?"

"నీ ప్రాయశ్చిత్తం పరిసమాప్తమైన తరువాతనే నీ భర్తను చూడగలుగుతావు."

"అంటే, పన్నెండు సంవత్సరాల తరువాతనా?"

"అవును, ఆ తరువాతనే."

"ఈ వ్రతం ఆచరిస్తూ ఎంతకాలం జీవించి ఉంటాను? వ్రతం పూర్తి అవకముందే చనిపోతే?"

"అలాగ జరిగినప్పుడు చనిపోయేముందు నీభర్తను చూడ గలుగుతావు."

"అంతకుముందే వారి దర్శనభాగ్యం గలిగే ఉపాయం

లేదా ? మీరు దేవతలు ! మీకు అన్నీ తెలుసు !"

"అంతకుముందే నువ్వు వారిని చూడదలచినచో అది ఒక వారం రోజులు తరువాత సాధ్యపడుతుంది. ఈ వారం రోజులూ నువ్వు రాత్రి పగలూకూడా నీభర్తను స్మరిస్తూవుండు– మరోవిషయమేదీ మనస్సులో ప్రవేశించ కూడదు. ఈ యేడు రోజుల్లోనూ ఒక్కపర్యాయం మాత్రం ఫలపుష్పాలు తీసుకోవటానికి సాయంత్ర సమయాన బైటకు వెళ్ళవచ్చు. అవికూడా కడుపునిండా భుజించవద్దు – ఆకలి చచ్చిపోకూడదు. మరేమనిషి వద్దకూ వెళ్ళకూడదు, ఎవరైనా ఎదురైనా మాట్లాడకూడదు. ఈ అంధకారపు గుహలో ఒక వారం రోజులుప్రండి స్థిరమైన మనస్సుతో తదేక ధ్యానంతో నీభర్తను మాత్రమే స్మరిస్తూ వుండగలిగితే, వారిని దర్శించ గలుగుతావు."

# 3

శైవలిని అదేవిధంగా చేసింది. ఏడురోజులవరకు ఆమె గుహనుంచి బయటకు రాలేదు – సాయంత్రం ఒక్కపర్యాయం మాత్రం ఫలపుష్పాలకోసం బైటకు వచ్చేది. ఏడురోజుల వరకు ఎవరితోనూ మాట్లాడలేదు. నిరాహారమై, ఆ భయంకరాంధకారంలో ఏకాగ్రచిత్తంతో భర్తనే స్మరించసాగింది – దేనినీ చూచేదికాదు, ఏమీ వినేదికాదు, దేనినీ తాకేది గాదు. ఇంద్రియాలను జయించింది, మనస్సును జయించింది, అంతటా భర్త. భర్తమాత్రమే చిత్తవృత్తులన్నింటికీ ఏకైక ఆలంబన అయ్యాడు. అంధకారంలో మరేమీ కన్పించేది

శాను - ఏడు రాత్రులు, ఏడు పగళ్లు భర్తముఖాన్ని మాత్రమే చూచింది. ఆ భయంకర నిశ్శబ్దంలో మరేమీ విన్పించేదికాదు - జ్ఞానపూర్ణమైన, భర్త ప్రేమస్నిగ్ధవాక్కులు మాత్రమే విన్పిస్తూవుండేవి. ఎదురుగా ఉన్న పాత్రలోని పూల వాసనలు మాత్రమే నాసికమునకు అందేది - చంద్రశేఖరుడు ఆమె శరీరాన్ని ఆదరభావంతో స్పర్శించినట్లు వుండేది. మరే ఆశా లేదు - వున్నదంటూ కూడా ఏమీ లేదు, భర్తను దర్శించాలనే కోర్కె మాత్రమే వుంది. ఉన్నతమైన ఫాల భాగం గల ఆ ముఖమండలం ఎప్పుడూ ఆమె స్మృతిపథం లోనే ప్రదక్షణ చేస్తూవుండేది. ఈ వ్రతాన్ని ఆచరించమని ఆదేశించిన వ్యక్తి మానవ హృదయాన్ని పూర్తిగా చవి చూచిన వాడవటంలో ఏమాత్రం సందేహంలేదు. నిర్జనము, నిశ్శబ్దము, అంధకారము - ఎక్కడా మనిషిజాడ లేదు, శరీ రము కష్టాన్ననుభవిస్తోంది, ఆకలితో బాధపడుతున్న మనస్సు అన్నమును గురించి ఆలోచించటమే లేదు. అటువంటి సమయా లందు ఏ విషయంలో మనస్సును లగ్నంచేస్తే ఆ విషయం లోనే మనస్సు తన్మయం చెందుతుంది. ఈ స్థితిలో ఏకాగ్ర చిత్తంతో భర్తను ధ్యానించే శైవలినిలో వికార మేర్ప డింది. వికారమా? లేక దివ్యచక్షువా? శైవలిని హృద యంలోని హృదయంతో దివ్యనేత్రాలను తెరచి - శైవలిని గాంచిన ఆ రూపం ఏమిటి! విశాలమైన దీర్ఘబాహువులు, ఉదాత్తమైన అంగసౌష్టవము, సుందర సుకుమార శరీరము కలిగి మహోన్నత సౌందర్య శిఖరంవలె వున్నది. ఆ లలాటము విశాలమై, చందనంబుల నలది, విచార రేఖలు ప్రస్ఫుట

మవుతూ, సరస్వతీదేవి శయ్యా అన్నట్లు, ఇంద్రుని రణభూమి వలె వుంది, కామదేవుని సుఖాల కీలకం. లక్ష్మీదేవి సింహాసనం! దీనిముందు ప్రతాపుడా? ఛీ! ఛీ!! సముద్రం ఎదుట గంగానదియా? ఆ కన్నులో - ప్రకాశిస్తున్నాయి, నవ్వుతున్నాయి, తిరుగుతున్నాయి. — పెద్దవి, విశాలమైన, తీక్షణ ప్రకాశం కల్గినవి - వీటిముందు ఆ ప్రతాపుని కన్నులా? నేనెందుకు పొరపడ్డాను? ఎందుకు మునిగాను - ఎందుకు చని పోయాను? ఈ అందమైన సుకుమారమైన బలిష్ఠదేహము - క్రొత్త చిగుళ్లు తొడుగు శాల్మలి వృక్షమువలె వుంది! మాధవీలత అల్లుకొన్న దేవదారు వృక్షంవలె, పుష్పాలతో కప్పబడిన పర్వతంవలె, అర్ధభాగం సౌందర్యం, సగంభాగం శక్తి - సగం సూర్యుడు, సగం చంద్రుడు, సగం గౌరి, సగం శంకరుడు. సగం రాధ మిగిలిన సగం కృష్ణుడు — సగం ఆశ, సగం భయం - సగం జ్యోతి మరి సగం ఛాయ - సగం అగ్ని, సగం ధూమ్రము - వీరిముందు ప్రతాపుడెంత? ఇదంతా ఎందుకు గమనించలేకపోయాను - ఎందుకు మునిగాను - ఎందుకు సర్వనాశనమైపోయాను? పరిష్కృతము, స్పష్టము. హాసయుక్తము, వ్యంగ్యభరితము, స్నిగ్ధపూర్ణము, కోమలము, మధురము, విశుద్ధమైన ఆ వాక్కు! దానిముందు ప్రతాపుడేమిటి? ఇవన్నీ ఎందుకు వదలి మునిగిపోయాను? వారి హాసము - పూలపాత్రలో శోభించే మల్లెపూల రాశి వలె, మేఘమండలంలో మెరుపు తీగవలె, నా సుఖస్వప్నంవంటి దానిని ఎందుకు చూడలేకపోయాను? సాగర సదృశ్యమైన వారి గంభీరప్రేమ, అపారము, అనంతము, అగాధము; తన

బలంతో తానే చంచలము. శాంతభావాలతో స్థిరము, గంభీరము, మాధుర్యంతో కూడిన చంచలత్వంతో తీరములను ముంచివేసే తరంగ భంగంవల్ల భయంకరము, అగమ్యము, అజేయమై భీతిల్ల జేయునది – ఇవన్నీ అర్థంచేసుకొని, హృదయంలో చోటివ్వలేదు – ఎందుకని నన్ను నాశనం చేసుకొని ప్రాణాలర్పించలేదు? నే నెవర్ని? వారికి యోగ్యురాలనేనా–బాలికను, అజ్ఞానురాలను, నిరక్షరకుక్షిని, మిథ్యావాదిని; వారి మహిమను గుర్తించు సామర్థ్యం నాకు లేదు, వారి ముందు నేనెంత? సముద్రంలో నత్తగుల్లలు, పుష్పంలో పురుగులు, చంద్రునిలో మచ్చ, పాదాలయందు ధూళికణాలు–వారిముందు నేనెంత? జీవితంలోని దుస్స్వప్నంవలె, హృదయంలోని భ్రమవలె, సుఖంలోని బాధవలె, ఆశలో అవిశ్వాసంవలె – వారిముందు నేనేమిటి? సరస్సులోని పంకమువలె, కమలనాళములోని ముల్లువలె, గాలిలోని దుమ్మువలె, అగ్నిలోని కీటకమువలె – నేను మునిగిపోయాను–చనిపోలే దెందుకని?

ఈ విధంగా భర్తను ధ్యానించమని చెప్పిన వ్యక్తి అంత మానవ హృదయసముద్రపు నావికుడే — అతనికి సర్వము తెలుసు. అనాదిగా ప్రవహిస్తూ వచ్చే ప్రవాహపు మార్గమే మారిపోతుందని అతనికి తెలుసు—ఈ వజ్రసంతో బండలన్నీ ముక్కలు ముక్కలై పోతాయని తెలుసు—ఈ మండూకంలో సముద్రం స్తబ్ధమై పోతుంది, ఇదే మంత్రంతో వాయువు స్థంభించి పోతుంది. శైవలిని హృదయంలో చాలా కాలంనుంచీ ప్రవహిస్తూ ఉన్న నదీ ప్రవాహం మరో దిశకు

మళ్ళింది, పర్వతం బ్రద్దలై పోయింది, సముద్రం ఇంకి పోయింది, వాయుగమనం ఆగిపోయింది. శైవలిని ప్రతాప్‌ను మరచి చంద్రశేఖరుణ్ణి ప్రేమించింది.

మానవుని ఇంద్రియాల మార్గాన్ని అడ్డగించండి, ఇంద్రియాలను విలుప్తం చేసి వేయండి మనస్సును కట్టివేయండి, కట్టివేసి ఒకేమార్గాన వదలిపెట్టండి ఇతర మార్గాలన్నింటినీ మూసివేయండి, మనస్సులోని శక్తినంతా కూడదీసుకొని— అప్పుడు మనస్సేమి చేస్తుంది ? ఆ ఒక్క మార్గానే వెళ్తుంది— దానియందే స్థిరమైపోతుంది—దానిలోనే లీనమైపోతుంది. శైవలిని అయిదవనాడు తెచ్చిన ఫలమూలాలను భుజించలేదు— ఆరవరోజున ఫలమూలాలకోసం వెళ్ళనేలేదు — ఏడవరోజు ఉదయం స్వామిని దర్శిద్దామావద్దాఅని ఆలోచించింది—ఇవాళ ప్రాణత్యాగం చేస్తాను. ఏడవనాడురాత్రి హృదయంలో కమల పుష్పం వికసించింది——దానిమీదే చంద్రశేఖరుడు పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు, శైవలిని ఉన్మాదగామారి వారి చరణ కమలములముందు ఝుంకారము చేస్తున్నట్లుగా వుంది ఆమెకు.

ఏడవనాడు రాత్రి అదే అంధకారమయమైన ప్రశాంత పర్వతగుహలో ఒంటరిగా భర్తను ధ్యానిస్తూ ధ్యానిస్తూ శైవలిని స్పృహతప్పిపోయింది. ఆమె పలు స్వప్నాలను చూడ సాగింది. తాను భయంకర నరకంలో మునిగిపోయినట్లూ, కొన్ని వందల యోజనాల పొడవైన సర్పాలు తమ నాలుకలు చాచి ఆమెను పట్టుకుంటున్నట్లూ—వాటి శ్వాసలన్నీ భయంకర తుఫానురూపం ధరించినట్లూ కన్పించసాగింది. చంద్రశేఖరుడు వచ్చి ఒక విశాలమైన సర్పపు పడగపై

కాలూని నిల్చున్నాడు, అప్పుడు సర్పాలన్నీ వరద నీటివలె అక్కడనుండి జారుకున్నాయి. మరొకసారి ఒక భయంకర అగ్నిగుండము, దానిలోంచి పర్వతమంత జ్వాలలు లేస్తున్నాయి, దాని జ్వాలలు ఆకాశాన్నంటుతున్నాయి, శైవలిని ఆ అగ్నిలో దహించుకు పోతోంది, ఇంతలో చంద్రశేఖరుడు వచ్చి దానిలో కొద్దిగా జలం చిలకరించాడు; వెంటనే అగ్ని ఆరిపోయింది. శీతలవాయువు వీచసాగింది; ఆ అగ్ని గుండంలో కలకలారావం చేస్తూ ఒకనది ప్రవహింపసాగింది, దాని ఒడ్డున పుష్పాలు వికసించాయి. నదీ జలంలో పెద్దపెద్ద కమలాలు వికసించాయి, చంద్రశేఖరుడు వాటిపై వెళ్తున్నాడు. మరొకసారి చూసేసరికి ఒక పెద్దపులివచ్చి శైవలినిని నోటగరచుకొని పర్వతంమీదికి పోతూవుంది; చంద్రశేఖరుడు వచ్చి పూజా పాత్రలోని పుష్పాలనుంచి ఒక పుష్పాన్ని తీసి పెద్దపులి మీదికి విసరివేశాడు, వెంటనే పెద్దపులి మెడ తెగిపోయి అక్కడికక్కడే ప్రాణాలు వదిలింది.

రాత్రి చివరి జామున శైవలినికి తాను చనిపోతూ వున్నట్లు కన్పించింది. ఎన్నో నల్లని మేఘాలు, పిడుగుల అగ్ని రాసులెన్నింటినో దాటి తన కేశములను పట్టుకొని ఎగిరిపోతూ వున్నట్లు చూచింది. ఆకాశంలో చరించే ఎందరో అప్సరలు, కిన్నెరలు మొదలైనవారు మేఘాల కెరటాలనుంచి తల బైటకు బెట్టి శైవలినివంక చూచి నవ్వుతున్నారు, ఆకాశంలో చరించే జ్యోతిర్మయ దేవతలనేకమంది సువర్ణ వర్ణ మేఘాలపై నెక్కి, బంగారువర్ణ మెరుపు తీగెల మాలలు ధరించి నల్లని కేశ కలాపంతో కప్పబడిన లలాటంపై ఆ మాలను ధరించి విహరిస్తు

న్నారు. శైవలినియొక్క పాపమయ శరీరాన్ని తాకి వీచుచున్న వాయు స్పర్శతో వారి కాంతి ఆరిపోతూ వుంది. ఎందరో గగన చారిణులు, అంధకారంవంటి శరీరంగల్గిన భయంకరులు, రాక్షసాంగనలు, నల్లని మేఘాలపై నెక్కి భయంకరమైన తుఫానులో తిరుగుచూ ఆటలాడుతున్నారు — దుర్గంధ పూరితమైన శైవలిని శవాన్ని చూచి వారికి నోరూరుతుంది. వారు హుంకరించుచూ ఆమెను తినుటకై ముందుకొస్తున్నారు. అసంఖ్యాక దేవతల విమానాల స్వచ్ఛమైన ప్రకాశ ఛాయలు మేఘాలపై పడుతున్నాయి; వెనుక పాపాత్మురాలైన శైవలిని శవం నీడ ఆ విమానాల పవిత్ర ఛాయతో కలిసినచో శైవలిని పాపాలన్నీ తొలగిపోతాయని యోచించి వారందరు తమతమ విమానాలను దూరదూరంగా నడుపుతున్నారు. నక్షత్ర సుందరీ మణులు నీలాకాశంలో తమ చిన్న చిన్న ముఖాలను బైటకు బెట్టి తమ కిరణాల వ్రేలెత్తి శైవలినిని చూపుతూ తమలో తాము "సోదరీ ! అదుగో చూడు ! చూచావా, మానవ జీవుల్లో ఇంకా పతితులున్నారు !" అని చెప్పుకుంటున్నారు. అది చూచి ఒకతార భయపడి కళ్ళు మూసుకుంటే, మరొక తార సిగ్గుతో మేఘాలచాటుకు పోయి ముఖం తప్పిస్తుంది, వేరొకతార పతిత పతిత అనే పేరు వినగానే భయంతో పారిపోతూవుంది. పిశాచాలు శైవలినిని నెత్తుకొని పైకి లేస్తున్నాయి, పైకి ఇంకా పైపైకెగిరి పోతున్నాయి. బాగా పైకి వెళ్ళి శైవలిని శవాన్ని అక్కడినుంచి నరక గుండంలో పడద్రోస్తామని చెప్పున్నాయి అవి పైకి పోగాపోగా అక్కడ అంతా అంధకారంగా, చలిగావుంది—మేఘాలు, నక్షత్రాలు,

వెలుగు, గాలి, శబ్దము ఏమీ లేవక్కడ. శబ్దమేమీ లేదు కానీ ఎక్కడో వెనుకనుంచి, చాలా దూరంగా అనేక ఘోరమైన కల కల - గర గర శబ్దాలు ఆకస్మికంగా వినవచ్చాయి. ఎక్కడో దూరాన క్రిందిభాగాన కొన్ని వందలవేల సముద్రాలు ఘోష పెడుతున్నట్లు విన్పించింది. "ఇదే! నరకపు కోలాహలం విన్పిస్తోంది, శవాన్ని అక్కడే పారవేయండి" అన్నవి పిశాచాలు. ఆ మాటతో పిశాచాలు శైవలిని తలపై గట్టిగా తన్ని క్రిందికి విసరి వేశాయి. శైవలిని గిర్రున తిరుగుతూ క్రిందికి పడుతోంది. క్రమంగా ఆ తిరుగుడు వేగం హెచ్చింది, చివరకు కుమ్మరి సారె వలె గిర్రున తిరగసాగింది. శవం నోటినుంచి, ముక్కునుంచి రక్తం స్రవించసాగింది. క్రమక్రమంగా నరకఘోష దగ్గరపడింది, దుర్గంధం హెచ్చిపోతోంది— తెలివిలోనే చనిపోయిన శైవలిని అకస్మాత్తుగా నరకాన్ని చూచింది. ఆ తర్వాత ఆమె అంధురాలైపోయింది, చెవులు విన్పించకుండా పోయాయి. అప్పుడిహ మనస్సులో చంద్రశేఖరుణ్ణి ధ్యానించుకో సాగింది, లోలోపలే అతణ్ని ఎలుగెత్తి పిలవసాగింది—"స్వామీ! ఎక్కడున్నారు మీరు? ప్రభూ ఎక్కడ? స్త్రీ జాతికి జీవిత సహాయ పూజా దేవత! సర్వమంగళ మయూ! చంద్రశేఖరా, మీరెక్కడున్నారు? మీ పాదాలకు సహస్ర సహస్ర ప్రణామములు! నన్ను రక్షించండి! మీ చెంత పాపంచేసి నేనీ నరకగుండంలో పడిపోతున్నాను. మీరే నను రక్షించకపోయినచో మరే దైవమూ నన్నుద్ధరించలేదు—నన్ను రక్షించండి. మీరు నన్ను రక్షించండి, ప్రసన్నంకండి, ఇక్కడకు విచ్చేసి మీ

చరణములను నా శిరమున ఉంచండి, వాటి వల్లనే నేనీ నరకంనుంచి ఉద్ధరించబడ గలుగుతాను !"

అంధురాలు, చెవిటిదైన శైవలినికి, తననెవరో ఒడిలో కూర్చోబెట్టుకున్నట్లనిపించింది — వారి శరీర సుగంధం దిక్కులెల్లా వ్యాపించింది. ఆ కఠోరనాద స్వరం చటుక్కున ఆగిపోతోంది, దుర్గంధానికి బదులు పూలవాసనలు వస్తున్నాయి. శైవలిని చెవిటి తనం తొలగిపోయింది, కళ్ళకు తిరిగి చూపు వచ్చింది. అకస్మాత్తుగా ఆమె కిది మృత్యువు కాదనిపించింది, ఇది జీవితమే, స్వప్నం కాదు, ఇది సత్యమేననిపించింది. శైవలిని మళ్ళీ వదలిపోయింది.

ఆమె కళ్లు తెరచి చూచేసరికి గుహలోనికి కొద్దిగా వెలుగు వస్తోంది, బయట పక్షులు ప్రాతఃకాలపు కలవరం విన్పిస్తోంది. కానీ, ఇదేమిటిమరి ? ఆ సుశిరస్సు ఎవరి ఒడిలోనో వుంది. ఆమెతలపై ఆకాశంలో ఉదయించిన పూర్ణచంద్ర బింబంవంటి ముఖమండలం ప్రాతఃకిరణాలలో ప్రకాశాన్నిస్తుంది. ఎవరిదాముఖం ? శైవలిని గుర్తించింది — బ్రహ్మచారి వేషంలోవున్న చంద్రశేఖరుడు !

## 4

"శైవలినీ !" అన్నాడు చంద్రశేఖరుడు.

శైవలిని లేచి కూర్చుంది. చంద్రశేఖరుని ముఖంలోకి చూడసాగింది, ఆమె శిరము చంద్రశేఖరుని పాదాలపై వాలిపోయింది. చంద్రశేఖరుడు ఆమెను పట్టుకొని లేవనెత్తాడు.

లేవనెత్తి తనశరీరానికి ఆనించి కూర్చోబెట్టాడు.

శైవలినికి దుఃఖం పొంగివచ్చింది. బిగ్గరగా ఏడుస్తూ మరల చంద్రశేఖరుని పాదాలపై బడి "ఇప్పుడు నాస్థితి ఏమిటి స్వామి ?" అని అడిగింది.

"నువ్వునన్ను చూడ దలచిందెందుకు ?" అని అడిగాడు చంద్రశేఖరుడు.

శైవలిని కన్నీరు తుడుచుకొంది, ఏడ్పుమాని, కుదుటపడి "నేనిహ బహుస్వల్పకాలం మాత్రమే జీవిస్తానని పిస్తుంది" అని ఆమె భయంతో కంపించింది; స్వప్నంలో చూచిన దృశ్యాలన్నీ గుర్తుకొచ్చాయి. ఒక క్షణకాలం తలపై చెయ్యిపెట్టుకొని కూర్చుంది. "కొద్దికాలమే జీవిస్తాను గనుక చనిపోయేముందు ఒకసారి మిమ్మల్ని చూడాలనే కోర్కెకల్గింది" అంది. ఈ విషయాన్నెవరు విశ్వసిస్తారు ? పతితయై భర్తను వదలివచ్చిన ఆమెకు భర్తను చూడాలనే కోర్కెఎందుకు ?

శైవలిని దీనంగా ఒక వికటహాసం చేసింది.

"నీమాటయందు నాకు అవిశ్వాసం లేదు, నిన్ను బలవంతంగా పట్టుకొచ్చారని నాకు తెలుసు" అన్నాడు చంద్రశేఖరుడు.

"అది అబద్ధం. నాఅంతట నేనే ఫాస్టరువెంట వచ్చాను. దోపిడి జరపటానికి ముందుగా ఫాస్టరు నావద్దకు మనిషిని పంపాడు" అని చెప్పింది శైవలిని.

చంద్రశేఖరుడు తలవంచుకున్నాడు. నెమ్మదిగా శైవలినిని మరల పరుండబెట్టాడు. నెమ్మదిగా లేచి నిలబడి ఆకాశంలోకి చూస్తూ కోమలమైన మధుర స్వరంతో "శైవలిని !

పన్నెండు సంవత్సరాలు ప్రాయశ్చిత్తం చెయ్యి! ఇద్దరము జీవించివుంటే మరల కలుసుకుందాం. ఇప్పటి కిదిచాలు" అన్నాడు.

శైవలిని చేతులు జోడించి "మరికొద్దిసేపు కూర్చోండి! ప్రాయశ్చిత్తం తుదివరకు సాగేఅదృష్టం వున్నట్లు కన్పించటం లేదు" మరల ఆమెకు ఆ స్వప్నమే మనస్సులో మెదిలింది — "కూర్చోండి, ఒక క్షణకాలం మిమ్మల్ని చూడాలి" అంది చంద్రశేఖరుడు కూర్చున్నాడు.

"ఆత్మహత్య పాపమా ?" అనిఅడిగింది శైవలిని స్థిర దృష్టితో. చంద్రశేఖరునివంక చూస్తూవుంది, వికసించిన ఆమె నయన కమలములు నీటిలో మునిగి తేలుతున్నాయి.

"ఏమిటి ? చనిపోవాలను కుంటున్నావా ?"

[illegible] భయం కల్గింది. "చావలేను, ఆ నరకంలోనే

[illegible] చేసుకుంటే ఆ నరకంనుంచి విముక్తి

అక్కడే కేంద్రీకరించి వుండటం చంద్రశేఖరుడు గమనించాడు. వాడిపోయివున్న ఆమె ముఖం ఎండిపోవటం, కళ్లువిప్పారటం, గగుర్పాటు కలగటం, ఆమె నిలువల్లా కంపించటం చంద్రశేఖరుడు గమనించాడు.

"ఏమిటి చూస్తున్నావ్ ?" అని అడిగాడు చంద్రశేఖరుడు.

శైవలిని జవాబేమీ చెప్పలేదు. అలాగే ఎప్పటిలా చూస్తూ వుండిపోయింది. వారికేమీ అర్థంకాలేదు. అకస్మాత్తుగా శైవలిని కెవ్వున అరుస్తూ "ప్రభూ, రక్షించండి. మీరే నన్ను స్వీకరించకపోతే మరెవరు స్వీకరిస్తారు ? అని అంది.

శైవలిని మూర్ఛజెంది క్రింద పడిపోయింది.

చంద్రశేఖరుడు సమీపమందున్న సెలయేటినుండి నీరు తెచ్చి ముఖంపై చిలకరించాడు. తన ఉత్తరీయంతో విసర సాగాడు. కొద్దిసేపట్లో శైవలినికి తెలివివచ్చి మెదలకుండా కూర్చుని ఏడ్వసాగింది.

"[illegible]

"మరేమీ చింతించకు – ఉపవాసము, మానసిక కష్టాలలో ఇవన్నీ వస్తున్నాయి. వైద్యులు దీనిని వాయురోగ మంటారు. నువ్వు వేదగ్రామానికి వెళ్ళి గ్రామం వెలుపల ఒక కుటీరం నిర్మించుకో. అక్కడ సుందరి నీకు సాయపడు తుంది, మందు మాకులు చూస్తుంది" అని చెప్పాడు చంద్ర శేఖరుడు.

శైవలిని అకస్మాత్తుగా కళ్లు మూసేసుకుంది. గుహలో సుందరి రాతితో చెక్కినట్లు నిల్చొని వుంది — గ్రేలెత్తి చూపుతోంది. సుందరి చాలా పెద్దదిగా కన్పించింది – క్రమంగా తాటిచెట్టు ప్రమాణంలో పెరిగి భయంకరంగా కన్పిస్తుంది. మరల ఆ గుహలోపల నరకం ప్రత్యక్షమైంది — అదే దుర్గంధం, ఆ భయంకర అగ్నిజ్వాలల గర్జనలే! ఆ తాపమే! అదే సర్పాలవనం, శరీరం గడ్డకట్టే చలి! హేయ [illegible]తో ఆకాశంలో అదే అంధకారం! అదే [illegible]లు ముళ్ళతీగెలూ, తేళ్ళబెత్తాలూ పట్టుకొని [illegible] బెత్తంతో

పెద్దవిచేసి రెప్పవేయకుండా వెలవెలబోతున్న ముఖంతో బెదిరి బెదిరి చూస్తోంది; బొమ్మవలె వుండిపోయింది, చలనమే లేదు, చంద్రశేఖరునికి చాలా విచారం కల్గింది — లక్షణాలు బాగా లేవు.

"శైవలినీ! నా వెంట రా!" అన్నాడు చంద్రశేఖరుడు.

మొదట శైవలినికి విన్పించలేదు. తర్వాత చంద్రశేఖరుడు ఆమె శరీరాన్ని తాకి, రెండు మూడుసార్లు గట్టిగా వూపి పిలిచాడు. "నా వెంట రా!" అన్నాడు.

చటుక్కున శైవలిని లేచి నిల్చుంది, అత్యంత భయకంపిత స్వరంతో "పదండి, పదండి! త్వరగా, త్వరగా పదండి! ఇక్కడినుంచి త్వరగా బయలుదేరండి!" అంటూ క్షణంకూడా ఆగక గుహాద్వారంకేసి పరుగెత్తింది, చంద్రశేఖరునికై నిరీక్షించకుండానే పరుగెత్తుకుపోతోంది. త్వరగా పరు[illegible]
మసక చీకట్లో ఒకరాయి తగిలి కాలు [illegible]
నేలపై పడపోయింది [illegible]

"నేను నిన్ను బైటకు తీసుకొచ్చాను" అని చెప్పాడు చంద్రశేఖరుడు.

శైవలిని కంపించింది - మరల భయపడింది. "నువ్వెవరు ?" అని అడిగింది. చంద్రశేఖరునికి కూడా భయంకల్గింది. "అలా అంటావేం ? ఏమిటి ? నేను నీ భర్తను, గుర్తించలేదా ?" అని అడిగాడు.

శైవలిని పిచ్చిదానివలె బిగ్గరగా నవ్వింది—

"నా భర్త పుష్పాలపై విహరించే బంగారు తుమ్మెద! దాగితప్పి. నన్ను కాటేయవచ్చావని తెలుసు నాకు ! నువ్వు లారెన్స్ ఫాస్టర్ ?"

ఏ దేవీ ప్రభావంవల్ల మానవ శరీరం సౌందర్యవంతంగా వుంటుందో, ఆ దేవీ ప్రభావం శైవలిని శరీరాన్ని
[illegible] నగలిపోవా [illegible] క్రర ఉన్మాదం ఆమె స్వప్నమంచిసంపై అధి
[illegible] శేఖరుడు గమనించాడు. చంద్రశేఖ
[illegible] రంతో, చాలా

చంద్రశేఖరుడు రుద్ధకంఠంతో దైన్యంగా "గురుదేవా! ఏమిటి ఇలా చేశారు? అయ్యో, ఏమిటిలా చేశారు?" అన్నాడు.

శైవలిని పాటపాడింది—

"ఏమి చేశావే ప్రాణసఖీ! ఏమి చేశావే ప్రాణసఖీ!
హృదయచోరుణ్ని బంధించావు నువ్వు!
ప్రేమనదిలో మునిగిపోయా డతడు.
రెండు తీరాలు నింపివేశావు నువ్వు —
హృదయచోరు డెవరు?
చంద్రశేఖరుడు.
పట్టుకుం దెవర్ని?
చంద్రశేఖరుణ్ని.
మునిగిం దెవరు?
చంద్రశేఖరుడు.
రెండు తీరా
తై

నీవెంట వస్తాను" అంది శైవలిని ఏడుస్తూ.

"పద!" అన్నాడు చంద్రశేఖరుడు.

"నన్ను చంపవుగదా ?" శై.

"లేదు."

దీర్ఘంగా నిట్టూర్చి చంద్రశేఖరుడు లేచి నిల్చున్నాడు. శైవలినికూడా లేచింది. చంద్రశేఖరుడు విచారవదనంతో ముందు బయలుదేరాడు – అతని వెనుక పిచ్చి శైవలిని ఏడుస్తూ, నవ్వుతూ – పాడుతూ బయలుదేరింది.

పంచాయతీ
వేమన గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా ద వ భా గ ం



ఆంగ్లేయుల నావలన్నీ ముర్షిదాబాదు చేరాయి. మీర్ కాశిం ఉద్యోగి మహమ్మద్ తకీకి ఆమియట్ పంపినవార్త అందింది.

మహమ్మద్ తకీ చాలా ఆడంబరంగా వచ్చి ఆమియట్ దొరను కలుసుకున్నాడు, ఆమియట్ చాలా సంతోషించాడు. చివరకు మహమ్మద్ తకీ ఆమియట్ దొరను తన యింటి కాహ్వానించాడు. అందుకు దగినట్లు ఆమియట్ అంగీకరించాడు కాని సంతోషంగా మాత్రం కాదు. ఇటు మహమ్మద్ తకీ దూరాన - ఆంగ్లేయుల నావ వెళ్ళిపోకుండా కాపలా వుంచాడు.

మహమ్మద్ తకీ వెళ్ళిపోయిన తరువాత, ఆహ్వానాన్ని పురస్కరించుకొని వెళ్ళటం మంచిదా కాదా అని ఆంగ్లేయులు తమలో తాము చర్చించుకున్నా [illegible]
టూరో ఆంగ్లేయులు ఎదుగరన, దా [illegible]
సరకూనేగా గాంక [illegible]

జరుగుతుందని భావిస్తున్నాను" అని అంది దలసీ.

"ఎందుకని ?"

నీకేమీ తెలియనట్లే; నవాబుగారి బేగంను బంధించి తీసుకొచ్చిన వారికి నవాబుగారి తరఫున గౌరవంగా విందు చేయబడుతుంది. దీనిలో ఏదో గూడార్థముంది. ఇవాళ ఆంగ్లేయులు వస్తారనే అనుకుంటున్నాను."

"అందుకు నీకు సంతోషంగా వుందా ?"

"ఎందుకు వుండదు ? రక్తపాతం జరగకుండా వుండటమే మంచిది. కారణం లేకుండానే మనను బంధించి తీసుకొచ్చినవాళ్లు చనిపోయి మనం విడుదల పొందితే, అది మనకు సంతోషమేగా !"

"కానీ, విడుదలకు అంత తహతహలాడటం ఎందుకు? మనను బంధించి వుంచటం తప్ప వీళ్ళకు మరో ప్రయోజనమేమీ మనను బంధించి వుంచారే కాని మనస్సై మనం స్త్రీలము. ఎక్కడకు ల్లో వుంటేనే

విడుదలచేస్తే మనను విడిచిపెడ్తారు. హే దొరగారి కేదైనా హాని కలిగినప్పుడే మనకు ఏదైనా హాని జరుగుతుంది." అంత వరకు మనకు భయం ఎందుకు ?"

దలనీబేగంకు మరింత ఆగ్రహం కల్గింది. నేను నీహే దొరగారినేమీ లెక్కచేయను, నీ ఆంగ్లేయుల పొగడ్తలను వినదలచుకోవటం లేదు, విడుదలచేసినా నువ్విక్కడనుంచి వదలివచ్చేట్లు లేవే ?" అంది దలనీ.

కుల్‌సమ్‌కుకూడా కోపంవచ్చింది. అయినా నవ్వి "నేను రాకపోతే మీరు నన్ను వదలి వెళ్ళిపోతారా ?" అని అడిగింది.

దలనీబేగం కోపం మరింత హెచ్చుసాగింది, "అయినా యిష్టంలేదా యే ?" అని అంది.

"నాసత్రవాలును గురించి నేనెలా చెపగలుగుతాను ?" అంది కుల్‌సమ్ గంభీరంగా.

దలనీబేగం ముఖం

కానీ చేతిని క్రిందికి

ఆమియట్

త్వరగా భగవంతుడు మృత్యువు తీసుకు రావాలి. అని అంది.

"ఆంగ్లేయులు విడుదలచేయగానే మనం తిరిగి నవాబు గారి చేతుల్లో పడతాము. కావాలంటే నిన్ను మన్నిస్తా రేమోగాని నన్నుమాత్రం మన్నించరు. అంతవరకు నాకు గట్టిగా తెలుసు. ఎక్కడైనా ఆశ్రయం దొరికితే తిరిగి నవాబు గారి నౌకరీలు చేరగూడదనే నాకోర్కె."

దలనీ కోపంవదలి ప్రేమగా: "నేను మరెక్కడికీ వెళ్ళ లేను. చచ్చినా వారిపాదాలచెంతనే చస్తాను." అని అంది.

ఇహ ఇక్కడ ఆమియట్ తనసైనికుల్ని సిద్ధంకమ్మని ఆదేశించాడు. ఇక్కడ మనకు అంతగా బలం లేదు. రెసిడెన్సీ వద్దకు నౌకను తీసుకుపోలేము" అన్నాడు జాన్సన్.

"ఏరోజునైతే హిందూదేశీయులకు భయపడి ఒక్క-ఆంగ్లేయుడైనా పారిపోతాడో, అనాడిహ భారతదేశాన్ని ... కూడా అంతరించిపోతుంది. ఇక్కడి ...కి ముసల్మానులు మనం భయ ...గా నిలబడే చద్దాం,

కాల్చటానికి రంధ్రాలుంటాయి. ఒక్కొక్క సైనికుడు ఒక్కొక్క రంధ్రం వద్ద తుపాకులతో కూర్చున్నాడు. ఆమియట్ ఆదేశానుసారం కుల్‌సమ్‌దలనీలు ఫాస్టునౌకలోకి వెళ్ళారు. ఇద్దరు సైనికుల సహాయంతో నావను వదలటానికి వెళ్ళారు. అదిచూచి మహమ్మద్ తకీ సైనికులు ఆవార్తను తకీ కెరింగించి వెళ్ళారు.

ఈ వార్తవిని, ఆంగ్లేయులు రావాల్సిన సమయం మించిపోవటం చూచి తకీ వారిని తీసుకొనివచ్చుటకు దూతను పంపాడు. ఒక ప్రత్యేకకారణం వల్ల తాము నావను వదలి రావలసలేదని ఆమియట్ జవాబు చెప్పాడు.

దూత నావను దిగి కొద్దిదూరం వెళ్ళి ఒక సంకేతధ్వని చేశాడు. ఆ ధ్వనితో పాటే ఒడ్డునుంచి పది పన్నెండు తుపాకి కాల్పులు వినిపించాయి. నావపై గుండ్లవర్ష[illegible] టం, అక్కడక్కడ నావలోనికి [illegible] గమనించాడు ఆమియట్.

ఆంగ్లేయసైనికు[illegible]

నిశ్చయులై వున్న ఆంగ్లేయులుకూడా భయపడ లేదు.

దృఢచిత్తులై, నావలోపలినుంచే, వేగంగా దిగుతున్న ముస్లింలపైకి గురిచూచి, ఆమియట్, గ్లాస్టన్, జాన్సన్‌లు గురితప్పకుండా ఒక్కొక్క దెబ్బకు ఒక్కొక్క ముస్లింను నేల గూలుస్తున్నారు.

కెరటాలు కెరటాలుగా ముస్లింసైన్యంకూడా బారులు బారులుగా ముంచుకొస్తుంది. "ఇక మనం బ్రతికే ఉపాయ మేమీలేదు. అందరూరండి, పరజాతీయులను సంహరిస్తూ ప్రాణాలర్పిద్దాం!" అన్నాడు ఆమియట్.

అప్పటికే ముస్లిం సైనికులు ఆంగ్లేయులు నావపైకి చేరుకున్నారు. ముగ్గురు ఆంగ్లేయులు ఒక్కుమ్మడిగా ఒకే గొంతుతో అరిచారు, త్రిశూలంతో నరకబడ్డ చందాన నావ పైకి చేరుకున్న ముస్లింసైన్యం ఛిన్నాభిన్నమై నావలోనుంచి నదిలోపడింది. ఇంకా కొందరు ముస్లింలు నావపైకి వచ్చారు. మరికొందరు ముస్లింలు నీటిలోనుంచి నావను ధ్వంసం చేయ సాగారు. నావక్రిందిభాగం విరిగిపోయింది. కలకల శబ్దంతో నీళ్ళు ముంచుకొచ్చాయి నావలోకి.

"గొర్రెలు, గోవులవలె మునిగి చావటం ఏమిటి? బైటకురండి, వీరులవలె ఆయుధాలు చేబూని ఎదిర్చి చద్దాం!" అన్నాడు ఆమియట్.

అప్పుడాముగ్గురు ఆంగ్లేయులూకత్తులుధరించినిర్భయంగా అసంఖ్యాకంగా వున్న ఆ ముస్లింసైన్యం ముందు నిలిచారు. ఒక సైనికుడు ఆమియట్‌కు నమస్కరించి "మావెంటవస్తారా? లేక చావటానికి సిద్ధంగా వున్నారా?" అని అడిగాడు.

"చస్తాను ఇవాళ నేమిక్కడ చావటం వల్ల హిందూ దేశంలో ముస్లిం సామ్రాజ్యం ధ్వంసమైపోయే ఒక మహాగ్ని ప్రజ్వరిల్లుతోంది. మా రక్తంతో తడిసిన భూమిపై మూడవ జాజ్జి రాజ్యపతాకం తేలికగా పాతుకుపోతుంది" అన్నాడు అమియట్.

"అయితే చావు!" అంటూ పఠాను కత్తితో అమియట్ శిరస్సును నరికివేశాడు. ఇది చూచి గ్లాస్టన్ వెంటనే చాలా [illegible] ఆ పఠాను శిరస్సును నరికివేశాడు.

పది పన్నెండుమంది ముస్లింలు గ్లాస్టన్‌ను చుట్టుముట్టారు, గ్లాస్టన్, జాన్సన్ లిద్దరూ వెంటనే ఆ నావలో ఒరిగి ప్రాణాలు విడిచారు.

అప్పటికే ఫాస్టరు నావ బయలుదేరి వెళ్ళిపోయింది.

## 2

రామచరణుని గుండుదెబ్బతిని లారెన్స్‌ఫాస్టర్ నీళ్ళల్లో పడ్డాడు, ప్రతాప్ నావను తీసుకొని వెళ్లిపోయిన తర్వాత ఆయుధ నౌకలోని నావికులు నీళ్ళల్లోదూకి లారెన్స్ ఫాస్టర్ దేహాన్ని వెదికి పట్టుకొచ్చారు. ఆనావ ప్రక్కనే కొట్టుకొనిపోతుంది. వాళ్లు అతడేని పట్టుకొని నావలోకిచేర్చి అమియట్ దొరగారి కెరింగించారు.

అమియట్ నావలోనికి వచ్చిచూచాడు. ఫాస్టరు స్పృహా తప్పి వున్నాడేగాని చనిపోలేదు. తలకు గాయం తగలటంవల్ల స్పృహతప్పాడు. చనిపోతాడనే భావించారు, కానీ ప్రయత్నా

బ్రతకవచ్చు. అమియట్ కు వైద్యం తెలుసు, మందులు ఉపయో
గించాడు. బకాఉల్లా చెప్పిన విధంగా ఫాస్టరు నావను పడికి
రేవుకు పట్టుకొచ్చారు. అమియట్ ముంగేరునుంచి బయలుదేరి
నప్పుడు ఆనావలోనే తీసుకొని వచ్చాడు.

ఫాస్టరుకింకా ఆయువువుంది. మందులు ఉపయోగించే
సరికి అతడు బ్రతికాడు, అతడి ఆయువు ఇంకా గట్టిదవటం
వల్లనే ముర్షిదాబాదులో ముస్లింల బారినుంచి తప్పుకోగలి
గాడు. కానీ ఇప్పుడతడు రోగి, చాలాబలహీనంగా వున్నాడు.
మందకొడిగా వున్నాడు — వెనుకటి ధైర్యం, అభిమానము
లేవిప్పుడతనిలో. ఇప్పుడతనికి ప్రాణాలు పోతాయేమోనని
భయంగానే వుంది. — చాలా భీతిగొని వున్నాడు, ప్రాణ
భయంతోనే పారిపోతున్నాడు. తలపై దెబ్బతగిలి వుండటంవల్ల
బుద్ధికూడా సరిగా పనిచేయటం లేదు.

ఫాస్టరు త్వర త్వరగా నావ నడుపుతున్నారు, అయినా
భయంగానేవుంది. వెనుక ముస్లింలు తరుముకొస్తున్నారు. అతడు
మొదట కాసింబజారు రెసిడెన్సీలో ఆశ్రయం పొందాలని ఆలో
చించాడు – తర్వాత అందుకు భయపడ్డాడు. ముస్లింలు రెసిడెన్సీ
పైకి దండెత్తి రావచ్చు, అందువల్ల ఆప్రదేశాన్ని వదిలేశాడు.
ఫాస్టరు అనుమానంకూడా నిజమే అయింది. ముస్లింలు త్వర
లోనే కాశిం బజారు రెసిడెన్సీపై దండెత్తి దోచుకు పోయారు.

ఫాస్టరు త్వర త్వరగా కాసింబజారు, ఫరాసిడాంగా,
సైదాబాదు, రాంగాపాటీలు దాటిపోయారు. అయినా ఇంకా
భయం పీడిస్తూనేవుంది. వెనుకనుంచి ఏనావ కన్పించినా
ముస్లింలనావ వస్తుందనే భయపడేవాడు. ఒక చిన్న నావ

మాత్రం తమను వెన్నంటి రావటం గమనించాడు.

అప్పుడిహ శాస్త్రి తాను బ్రతికి బయటపడే ఉపాయ మాలోచించ సాగాడు. భ్రాంతబుద్ధివల్ల మనస్సులో వివిధ ఆలోచనలు రాసాగాయి. నావను వదలి నది తీరానబడి పారి పోవాలని యోచించాడొక పర్యాయం. పారిపోయే శక్తికూడా తనలో లేదని గుర్తించాడు. నీళ్ళలో దూకి తప్పించుకుందామను కున్నాడు. ఈ స్త్రీలిద్దర్ని నీళ్ళల్లోకి తోసివేస్తే నావ మరింత తేలికపడి త్వరగా పోతుందనికూడా ఆలోచించాడు.

చటుక్కున అతనికొక దుర్బుద్ధి పుట్టింది. ఈ స్త్రీలకోసమే ముస్లింలు తరుము కొస్తున్నారని అతడి గట్టి నమ్మకం. దలనీ నవాబుగారి బేగంఅని వినేవున్నాడు. బేగంకోసమే ముస్లింలు నావమీద దండెత్తారనికూడా ఆలోచించాడు. కనుక బేగంను వదలివేస్తే మరేమీ గందరగోళం జరగదని భావించాడు. దలనీని దింపివేయాలనే నిర్ణయించుకున్నాడు.

"అదుగో, ఒక చిన్ననావ మన వెనుకనే వస్తుంది, చూస్తున్నావా?" అని అడిగాడు బేగంను.

"చూస్తున్నాను."

"అది మీ మనుష్యులనావ, నిన్ను తీసుకు వెళ్ళటానికే వస్తుంది."

ఈ విధంగా ఆలోచించటానికి నిదర్శనమేదైనా వుందా? ఏమీలేదు. శాస్త్రి యొక్క భ్రాంతబుద్ధే అందుకు కారణం. అతనికి రజ్జుసర్పభ్రాంతి కల్గింది. దలనీ ఒకసారి ఆలోచించి వుంటే ఆ మాటను సందేహించేదే, కాని దేనికోసమైతే తపిస్తూ వుంటారో, ఆ పేరు వినగానే ముగ్ధులైపోతారు - ఆశ

వల్ల అంధుడై మనిషి ముందు వెనుకలు ఆలోచించడు. దలనీ బేగం ఆశతో ముగ్ధురాలై అతడి మాటను విశ్వసించింది. "అయితే, మన్మోల్ని, ఆ నావలోకి చేర్చు, నీకు చాలా ధనం ఇస్తాము" అని అంది ఘోష్టకుతో.

"నే నలా చేయను. వాళ్ళు నా నావను పట్టుకుంటే నన్ను చంపేస్తారు."

"నే నలా చేయనివ్వను."

"నీ మాటను లక్ష్యంచేయను. మీ దేశంలో పురుషులు స్త్రీల ఆదేశాలను పాటించరు."

అప్పుడిహ దలనీ వున్న తెలివినికూడా పోగొట్టుకుంది- మంచి, చెడు ఏమీ ఆలోచించనేలేదు. అది నవాబుగారి నావ కాకపోతే ఏమవుతుందో ఏమో కూడా ఆలోచించ లేదు. అది తమ నావకాదనే ఆలోచనే ఆమెకు కలుగలేదు. వ్యాకులపాటువల్ల ఆపదలో చిక్కుకుంది. "మన్మోల్ని ఒడ్డున దించి నువ్వెళ్ళిపో !" అని చెప్పింది.

ఘోష్టకు సంతోషంగా అంగీకరించాడు. నావను తీరానికి చేర్చమని ఆదేశించాడు. "నేనుమాత్రం నావనుంచి దిగను. నవాబుగారి చేతుల్లో పడితే ఏమి ముంచుకొస్తుందో ఏమో కూడా చెప్పలేను. నేను దొరగారివెంట కలకత్తాకే వెళ్తాను, అక్కడ నాకు తెలిసిన వాళ్ళున్నారు" అంది కులసమ్.

"నీకా విచారమేమీ వద్దు. బ్రతికివుంటే నిన్ను తప్పి స్తాను" అని చెప్పింది దలనీబేగం.

"మీరు బ్రతికి వున్నప్పుడుగదా ?"

కుల్‌సమ్ నావదిగటానికి ఎంతమాత్రం అంగీకరించ

లేదు. దలనీబేగం ఎంతగానో వేడుకుంది—కాని ఆమె ఏమీ వినిపించుకోలేదు.

"నిన్ను గురించి మరల నావ వెనుకనే వస్తుందో ఏమో ? నువ్వుకూడా దిగు!" అన్నాడు షాస్టరు కుల్‌సమ్‌తో.

"నన్ను వదలిపెట్టావంటే ఆ నావలోకి వెళ్ళి నిన్ను తరిమేట్లు చేస్తాను" అంది కుల్‌సమ్.

షాస్టరు భయపడి బదులు చెప్పలేదు—దలనీబేగం కుల్‌సమ్ కోసం కంటనీరు పెట్టుకొని నావనుంచి దిగిపోయింది. షాస్టరు తిరిగి బయలుదేరి వెళ్ళిపోయాడు. అప్పుడే సూర్యాస్తమయం కాబోతుంది.

షాస్టరునావ క్రమంగా కనుమరుగై పోయింది. నవాబుగారి నావగా భావించిన ఆ చిన్న నావకూడా దగ్గరకు వచ్చేసింది. నావ తనకోసం తీరానికొస్తుందనే దలనీబేగం క్షణక్షణమూ మనస్సులో ఆలోచిస్తుంది—కానీ అది తీరానికి రాలేదు. వాళ్ళు తనను చూచారో లేదోనని ఆమె తన చీర చెంగును గాలిలో వూపసాగింది. అయినా నావ తిరిగిరాలేదు. క్రమంగా దూరమైపోయింది. మెరుపు మెరిసినట్లు దలనీబేగం త్రుళ్ళిపడింది—అసలా నావ నవాబుగారిదని దేనినిబట్టి నిర్ణయించుకుంది తాను. ఇతరు లెవరిదైనాకూడా కావచ్చు. అప్పుడు దలని పిచ్చిదానివలె బిగ్గరగా ఆ నావలోని నావికుల్ని పిలవసాగింది. "ఈ నావలోని వాళ్ళెవ్వరు వుండరులే !" అనుకొని వాళ్ళు వెళ్ళిపోయారు.

దలనీపై పిడుగుపడినట్లయింది, అప్పటికే షాస్టరు నావ కంటిచూపు కందటంలేదు, అయినా ఆమె తీరంవెంబడే పరు

గెత్తింది. వారిని అందుకోగలననే ఆలోచించి ఎంతో పరుగెత్తింది. ఎంతదూరం పరుగెత్తినా నావ అందలేదు అప్పటికే సాయంత్రమైపోయి వుండటంతో చుట్టూ చీకట్లు వ్యాపిస్తున్నాయి. గంగానదిపై మరేమీ కన్పించటం లేదు. ఆ అంధకారంలో వర్షపు క్రొత్తనీటి ప్రవాహపు కలకల ధ్వని మాత్రమే విన్పిస్తోంది.

అప్పుడిహ దలనీ హతాశురాలై మొదలు నరికిన వృక్షంవలె అక్కడే కూర్చొబడింది. ఆ గంగా తీరాన కూర్చొని వుండటం వల్ల ఏమీ ప్రయోజనం వుండదు కనుక ఆమె నెమ్మదిగా ముందుకు సాగింది. ఆ అంధకారంలో ముందుమార్గం కన్పిచటంలేదు. రెండుమూడుసార్లు క్రిందపడి కూడా లేచింది. లేచి మసకగా వున్న నక్షత్రాల కాంతిలో చుట్టూ తేరిచూచింది. ఎక్కడా ఒక్క గ్రామం వున్న జాడ కూడా కన్పించలేదు. అంతులేని మైదానం, కలకల ధ్వని చేస్తున్న ఆ నది, అంతే, మనుష్యుల జాడ లేనేలేదు — ఎక్కడా ఒక్కదీపమైనా కన్పించటంలేదు, గ్రామం కన్పించటం లేదు. చెట్లుకన్పించటంలేదు, మార్గంకన్పించంలేదు—నక్కలు కుక్కలు అరుపులుమినహా మరేమీ కన్పించంటంలేదు— కలకల ధ్వనితో ప్రవహించే నదీ ప్రవాహంలో నక్షత్రాలు నాట్యం చేస్తున్నాయి. అదే కన్పిస్తూ వున్నదెల్లా, దలనీబేగం చావుకే నిర్ణయించుకొంది.

ఆ నిర్జన మైదానమందు నదికి కొద్దిదూరంగా దలనీ బేగం కూర్చొని వుంది. చుట్టూ కీచురాళ్ళ ధ్వని—సమీపమందే నక్కలు అరుస్తున్నాయి. క్రమంగా చీకటి దట్ట

మైంది—అంధకారం మరింత భయంకరంగా వుంది. రాత్రి రెండవజాము, దలనీ భయపడి అటుచూచింది, ఆ నిర్జన మైదానంలో ఒక మనిషి తిరుగుతున్నాడు.

ఆ విశాలకాయుడు మెదలకుండా వచ్చి దలనీ వద్ద కూర్చున్నాడు.

మరల అతడే! ఆ ఆజాను బాహుడు దలనీబేగంను ఎత్తుకొని నెమ్మదిగా ఆ అంధకారంలో పర్వతం మీదికి ఎక్కాడు.

## 3

ముంగేరులోని సర్వశ్రేష్ఠమైన అట్టాలకములో స్వరూపచంద్రుడు మహాతాబ్‌చంద్రుడనే యిద్దరు జగత్సేఠ్ సోదరులు వుంటున్నారు. అర్థరాత్రి సమయమందు అక్కడ వేలదీపాలు వెలుగుతున్నాయి. అక్కడే తెల్ల చలువరాయి పరచినవున్న మంటపంలో నర్తకి ధరించిన వజ్రాభరణాలతో ఆ దీపాలకాంతి పోటీపడుతుంది. నీటిలో నీరు కలిసినట్లు, కాంతిలో కాంతి కలుస్తుంది. ఉజ్వలవంతమైన ఆ రాత్రి స్తంభాలలోను, దేదీప్యమానమైన ఆ బంగారు, వజ్రాల ఉన్నతాసనములలో, ప్రకాశవంతమైన వజ్రములు పొదిగిన గంధపు పాత్రలలో, సేఠ్‌ల మెడలో మెరుస్తూ వూగుతున్న లావైన ముత్యాలహారాల్లో — నర్తకియొక్క మణికట్టులు, మెడ, కేశములు, చెవులయందున్న ఆభరణాల్లో ఆ దీపాల వెలుగు కిరణాలు ప్రతిబింబించి ప్రకాశిస్తున్నాయి. వాటితోపాటు వెలువడుతున్న మధుర సంగీతధ్వనితో, ఆ ప్రకాశము, ఈ

మాధుర్యము ఒకదానిలో ఒకటి లీనమైపోతున్నాయి. రాత్రి సమయాలందు నీలాకాశంలో చంద్రోదయమైనప్పుడు, అప్పుడూ వెలుగు, మాధుర్యాలు కలిసిపోతాయి. సుందరియొక్క ప్రకాశవంతమైన నీలినేత్రాలనుండి మెరుపులాంటి చపల కటాక్షము వెలువడినప్పుడు కూడా వెలుగు, మాధుర్యాలు కలిసిపోతాయి. నీలి సరోవరంలో నిద్రించుచు వికసించనున్న కమల పుష్పములు, బాలసూర్యుని బంగారు కిరణములతో వికసించినప్పుడు, నీలిజలపై లేచు చిఱుతరంగాలపై దీర్ఘ కిరణాలు పడి కమలపత్రాల్లో పడివున్న నీటిబిందువులను ప్రకాశించునట్లు చేసి, జలచర పక్షుల మధురకంఠాలను ప్రతిధ్వనింప జేసి, జల కమలముల పెదవులను తెరచిచూడ నెల్లినప్పుడూ, ఉజ్వల మాధుర్యాలు కలిసిపోతాయి. గృహిణి చరణ కమల ముఖరమగు డైమండ్ కట్ అందెలు ధ్వనించినప్పుడు వెలుగు మాధుర్యాలు ఒకటవుతాయి, సంధ్యాకాశంలో అస్తమించుచున్న సూర్యుని తేజస్సు చూచి నీలివర్ణం అతణ్ణి పట్టుకొనుటకు వెంటతరిమినప్పుడు ఉజ్వల మాధుర్యాలు ఏకమవుతాయి. — గృహిణి చెవి లోలకులను ఊపుతూ, తిరస్కరించుచూ నీ వెంట పరుగెత్తినప్పుడు ఉజ్వలము మాధుర్యము కలిసిపోతాయి. చంద్రుని కిరణాలతో ప్రకాశించే గంగాజలంలో గాలి విసుర్లకు నురుగులు గ్రక్కే తరంగాలు లేచి చంద్రుని కాంతిలో మెరుస్తూ వున్నప్పుడు వెలుగు మాధుర్యాలు కలసిపోతాయి - బుసబుస పొంగే శాంపైన్ సారాయను అలలు తెల్లని పానపాత్రలో మెరిసేటప్పుడు ఉజ్వల మాధుర్యాలు ఒకటిగా ఏకమైపోతాయి. వెన్నెల రాత్రులందు

దక్షిణపవనం వీచినప్పుడు కాంతి మాధుర్యాలు ఒకటైపోతాయి. ఇష్టమైన మిఠాయిలతో పలహార పాత్రయందు వెండి నాణెములు దక్షిణగా లభించినప్పుడు ఉజ్వల మాధుర్యాలు ఒకటైపోతాయి. ప్రాతఃకాలపు సూర్య కిరణాలతో పూర్తిగా మత్తెక్కి వసంతకోకిల కూయునప్పుడు ఉజ్వల మాధుర్యాలు ఒకటిగా కలిసిపోతాయి – దీపమాలికల ప్రకాశంలో రత్నాభరణాలతో అలంకరించుకొన్న రమణీమణి పాటపాడినప్పుడు ఉజ్వల మధుర పదార్థాలు రెండూ ఒకటిగా కలిసిపోతాయి.

ఉజ్వల మాధుర్యాలు కలిసిపోయాయి – కానీ సేఠ్‌జీ హృదయాలలో అవేమీ కలిసిపోలేదు. వారి హృదయంలో కలిసిపోయింది గుర్గన్‌ఖాన్.

బెంగాలు దేశంలో ఆ సమయమందు యుద్ధాగ్ని ప్రజ్వరిల్లి వుంది. కలకత్తానుంచి ఆజ్ఞలు రాకపూర్వమే పాట్నాలోని ఎలిస్‌దొర పాట్నా కోటపై ఆక్రమణచేశాడు. మరియు అతను కోటను వశపర్చుకున్నాడు. కానీ ముంగేరునుంచి వచ్చిన ముస్లిం సైన్యం, పాట్నాలోని ముస్లిం సైన్యంతో కలిసి పాట్నాపై తిరిగి మీర్‌కాశిం అధికారాన్ని నిలబెట్టాయి. పాట్నాలోని ఎలిస్ మొదలైన ఆంగ్లేయులు ముస్లిం చేజిక్కి, బంధించబడి ముంగేరుకు కొనిరాబడ్డారు. ఆ సమయమున ఇరుపక్షాలు బహిరంగంగానే యుద్ధానికి తగిన ఏర్పాట్లు చేసుకొంటున్నారు. గుర్గన్‌ఖాన్ ఆ సేఠ్‌జీలతో ఈ విషయాన్ని గురించే మాట్లాడుతున్నాడు. నాట్యము, పాటకచ్చేరీ అంతా కాక వంకమాత్రమే. జగత్సేఠ్‌లుగానీ గుర్గన్‌ఖాన్‌గానీ ఎవ్వరూ వినటంలేదు. అందరూ చేసేదే వారూ చేస్తున్నారు.

వినటంకోసమని ఎవరు సంగీతాన్ని ఏర్పాటుచేస్తారు ఎప్పుడైనా?

గుర్గన్‌ఖాన్ కోర్కె నెరవేరింది - ఎప్పుడైతే యిరు పక్షాలు యుద్ధం చేసి చేసి బలహీనమైపోతాయో అప్పుడు తాను ఆ రెండుపక్షాలను ఓడించి తానే బెంగాలుకు రాజు కావాలని అతడు ఆలోచించాడు. ఆ కోర్కెను పూర్తిచేసు కోవాలంటే అందుకు ముఖ్యంగా సైన్యాన్నంతా తన అధీ నంలో ఉంచుకోవటం చాలా అవసరం. సైన్యం లేకుండా ధనం వసూలుకాదు. అందువల్ల సేఠ్‌జీలతో మంతనాలు సాగించటం చాలా అవసరమైంది.

ఈ ధన కుబేరు లిద్దరూ ఏ పక్షానికి సహాయం చేస్తారో ఆ పక్షమే జయిస్తుందనేది కాశిం అలీఖాన్ కూడా బాగుగా ఎరుగును. ఈ జగత్సేఠ్ లిద్దరూ లోలోపల తన అశుభాన్నే కోరుతున్నారనేది కూడా అతనికి తెలుసు. ఎందుకు వుండ దులే, తానుకూడా వారిఎడ అంతమంచిగా వ్యవహరించ లేదు సందేహంవల్ల వారిని ముంగేరులో ఖైదుచేసి వుంచారు. అవకాశం చిక్కగానే వారు శతృవుతో చేతులు కలుపుతారని ఆలోచించి వారిని కోటలో బంధించి వుంచాలని ప్రయత్నిస్తు న్నాడు. సేఠ్‌లకీవిషయం తెలిసిపోయింది. ఇంతవరకు భయం వల్ల వాళ్ళిద్దరూ మీర్ కాశింకు విరుద్ధంగా ఏమీ పనిచేయ లేదు. కానీ ఇప్పుడిహ తప్పించుకొనుటకు మరో ఉపాయ మేదీ లేక గుర్గన్‌ఖాన్‌తో కలిసిపోయారు. ఇద్దరి వుద్దేశాలు కూడా మీర్ కాశిం నాశనమే.

కారణము ఏదీ లేకుండా జగత్సేఠ్‌లతో గుర్గన్‌ఖాన్ కలుసుకోవటం నవాబుకు అనుమానం కలుగవచ్చునని

భావించే ఈ ఉత్సవమును ఏర్పాటుచేసి జగత్సేఠ్‌లు, గుర్గన్ ఖాన్‌ను, ఇతర సామంతులను, అమాత్యులను ఆహ్వానించారు.

గుర్గన్‌ఖాన్ నవాబుగారి అనుమతి పొందివచ్చాడు. అమాత్యులనుంచి వేరుగా కూర్చున్నాడు. జగత్సేఠ్‌లు యితరులతో మాట్లాడినట్లే గుర్గన్‌ఖాన్‌తో మాట్లాడుతున్నారు, అతనివద్ద ఎక్కువసేపు వుండేవారూకాదు. కాని జరిగే సంభాషణ ఇన్పించేదికాదు. ఆ సంభాషణక్రమం యీ విధంగా జరిగేది —— గుర్గన్ - "మీతో కలిసి నేనొక పెద్ద కంపెనీ ప్రారంభిస్తాను, మీరు భాగస్వాములుగా వుండటానికి అంగీకరిస్తారా ?

"ఎందుకది ?"

"ముంగేరులోని పెద్ద కంపెనీని మూసివేయటానికి."

"అది మాకు అంగీకారమే. ఈవిధంగా ఒక క్రొత్త వ్యాపారం ప్రారంభించకుండా మరో ఉపాయమేదీ లేదు !

"ఇది మీకు అంగీకారమైనట్లయితే, డబ్బు ఏర్పాటన్నీ మీరే చూడాలి - శరీరకష్టం మాత్రమే నేను చేయగలను"

ఇంతలో మనియాబాయివచ్చి ఒకపాట పాడింది - మహతాబ్ చంద్రుడు నవ్వి "ఎవరికి చెప్తున్నావు ? పాడు, మేము సిద్ధమే- మా మంగళధనము వచ్చేరాకుండానే జరిగిపోవాలి, మరే హానీ లేదు" అన్నాడు.

ఈవిధంగా ఒకవంక కేదారబాయి, హామీర్మక్, ఛాయానట్ మొదలైనవారు తమ తమ గీతాలు విన్పిస్తున్నారు, గుర్గన్‌ఖాన్, జగత్సేఠ్‌లు డబ్బు, లాభనష్టాలు వగైరా తుచ్ఛవిషయాలను తమ తమ ఉద్దేశ్యాలను వ్యక్త

పర్చి నిర్ణయిస్తున్నారు. వారొక నిర్ణయానికి వచ్చిన తర్వాత "ఒక క్రొత్త వ్యాపారస్తుడు కంపెనీ తెరుస్తున్నాడు విన్నారా?" అని అడిగాడు గుస్గన్‌ఖాన్.

"ఏమి. విదేశీయుడా లేక మనదేశంవాడేనా?"

"మనదేశీయుడే."

"ఎక్కడ?"

"ముంగేరునుంచి ముర్షిదాబాదువరకు అన్ని ప్రదేశాల్లోనూ, పర్వతాలు, అడవులు, మైదానాలు ఎక్కడెక్కడున్నాయో అక్కడెల్లా అతడి కంపెనీలు ప్రారంభమయ్యేవున్నాయి."

"ఎంత డబ్బుందేమిటి?"

"ఇప్పటివరకు అంత ధనవంతుడేం కాదు; అసలు ఏమిటో ఇప్పుడేమీ చెప్పలేము."

"ఇచ్చిపుచ్చుకునే వ్యాపార సంబంధాలు ఎవరెవరితో వున్నాయి?"

"ముంగేరులోని పెద్ద కంపెనీతో."

"హిందువులా, ముస్లింలా?"

"హిందువు."

"పేరేమిటి?"

"ప్రతాప్‌రాయ్."

"నివాసమేది?"

"ముర్షిదాబాదువద్దనే."

"పేరు విన్నాను. మామూలు మనిషే."

"చాలా భయంకరమైన వ్యక్తి."

"అతడు హఠాత్తుగా ఎందుకిలా చేస్తున్నాడు ?"

"కలకత్తాలోని ఆంగ్లేయుల కంపెనీయందు కోపంతో."

"అయితే అతణ్ని వశపచ్చుకోవల్సిందే — అతడు ఎవరి చేతుల్లోనివాడు ?"

"అతడి పనిలో ఎందుకు పాల్గొంటున్నాడో తెలియకుండా ఏమీ చెప్పలేము. ధనాశతో జీతం తీసుకొని పని ప్రారంభించేవాడైతే అతణ్ని కొనటం ఎంతసేపో పట్టదు. డబ్బు, జాగీర్లు కూడ ఇవ్వవచ్చు."

"కాని మనస్సులోని ఉద్దేశ్యం మరి వేరొకటైవుంటే?"

"మరేముంటుంది? ఆ ప్రతాప్ రాయ్ అంత పిచ్చివాడా యేం."

అప్పుడొక నర్తకి - ఎఱ్ఱఎఱ్ఱని ముఖాన అసత్యమోయీ!" అంటూ పాడుతుంది.

"అదేమిటి ? ఎవరిదా ఎఱ్ఱనిముఖం ?" అన్నాడు మహతాబ్ చంద్రుడు.

విశాల కాయపురుషుడు దలనీ వద్దకువచ్చి కూర్చున్నాడు. దలనీ ఏడుస్తూవుంది, అతడ్నిచూచి భయపడి ఏడ్పుమాని కదల మెదలకుండా కూర్చొంది, ఆగంతకుడుకూడా ఏమీ మాట్లాడలేదు.

ఇక్కడిది జరుగుచున్న సమయాననే వేరొకచోట దలనీ సర్వనాశనమై పోతుంది.

ఆంగ్లేయులు ఓడలోవున్న దలనీబేగంను వశపచ్చుకొని ముంగేరు పంపవల్సిందిగా మహమ్మద్ తకీకి రహస్యాజ్ఞలు పంపారు. ఆంగ్లేయులు పట్టుబడినా, చనిపోయినా బేగం తనంత

తానే చేజిక్కుతుందని తకీ ఆలోచించాడు. అందువల్ల నాకర్లకు బేగంను గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరాన్ని గుర్తించలేదు. కానీ తర్వాత ఆంగ్లేయులు మరణించిన నావలో బేగం లేకపోయేసరికి గొప్ప ఆపదే సంభవించిందనుకున్నాడు మహమ్మద్ తకీ. అతడి ఖారగాటుకు; ఈ పనికి నవాబు ఏమి ఉపద్రవం తెచ్చిపెడ్తాడో ఏమోకూడా తెలియకుండా వుంది. ఈ భయంవల్ల భీతిజెంది అతడు నవాబును మోసగించటానికి సాహసించాడు. యుద్ధం ప్రారంభంకాగానే ఆంగ్లేయులు మీర్ జాఫర్‌ను ఖైదునుంచి వదలి తిరిగి సింహాసనమెక్కిస్తారనే జనశ్రుతి వుండేది. ఒకవేళ ఆంగ్లేయులు యుద్ధంలో జయించినప్పుడు మీర్ కాశింకు ఈ మోసం తెలిసినా ఏమీనష్టం వుండదు, చివరకు బ్రతికివుంటే చాలా మేలు కల్గుతుంది. మీర్ కాశిం గనుక జయిస్తే అప్పుడైనా ఇటువంటి ఉపాయాన్నవలంభించవచ్చునని తెలుసుకోలేదు. ఈవిధంగా మోసపు కార్యక్రమాలతో మహమ్మద్ తకీ ఆరాత్రి నవాబుగారికి అబద్ధాలతో కూడిన అర్జీ ఒకటి పంపుతున్నాడు.

బేగం ఆమియట్ నావపై దొరికిందనీ, మహమ్మద్ తకీ ఆమెను గౌరవ లాంఛనాలతో కోటలో వుంచాడనీ, ప్రత్యేక ఆదేశాలేవీ అందనిదే నవాబుగారిముందుకు పంపుటకు సందేహంగా వున్నదనీ తెలియజేశాడా అర్జీలో. ఆంగ్లేయులవెంటవున్న వాళ్ళందరిద్వారా వంటవాడు, నావికులు, సైనికులు వగైరా బ్రతికివున్న వాళ్ళందరూ బేగం ఆమియట్ ద్వారక్షు ఉంపుడుగత్తెగా వుండేదనే చెప్పారు. ఇద్దరూ ఒక్కే

శయ్యపై నిద్రించేవారట బేగం కూడా ఆవిషయాన్ని స్వయంగా అంగీకరిస్తోంది. ఆమె ప్రస్తుతం క్రిస్టియన్ మతాన్నవలంభించి వుంది. ఆమెకు ముంగేరు రావటం ఇష్టంలేదు; "నన్ను వదలి వేయండి నేను కలకత్తాగువెళ్ళి అక్కడ ఆమియట్ మిత్రులతో కలిసివుంటాను. ముంగేరు పంపితే ఆత్మహత్య చేసుకుంటాను, అని అంటున్నారు బేగంగారు ఇటువంటి పరిస్థితుల్లో ముంగేరు పంపాలో ఇక్కడేవుంచాలో లేక వదలివేయాలో తోచక మీ ఆజ్ఞలకు ఎదురుచూస్తున్నాను. మీ ఆజ్ఞలు అందగానే వాటి ననుసరించి నడుచుకుంటాను." లేఖంతా ఇలాగే నడిచింది.

ఆ రాత్రే ఒక అశ్వారోహకుడు దూతగా ముంగేరుకు బయలుదేరి వెళ్ళాడు.

దూరాన జరిగే అజ్ఞాత అశుభఘటననుకూడా అప్పుడప్పుడు మన మనస్సు గ్రహిస్తుందని చెప్తారు కొందరు. అది నిజం కాదంటారా? కాని దూత ఉత్తరం తీసుకొని ముంగేరుకు బయలుదేరినప్పుడు దలనీబేగం శరీరం రోమాంచితమైంది. సరిగ్గా అదేసమయాన అక్కడ ఆమెచెంత కూర్చునివున్న పురుషుడు ప్రథమమాట నారంభించాడు. అతని కంఠధ్వని వల్లగానీ, మరో అశుభసూచనవల్లగానీ, దేనివల్లనైతేనేం దలనీ శరీరం గగుర్పాటు చెందింది.

"నిన్ను గుర్తిస్తున్నాను నువ్వు దలనీబేగం!" అన్నాడు దగ్గర కూర్చున్నవ్యక్తి, దలనీ భయంతో కంపించింది.

"నువ్వు నిర్జన ప్రదేశంలో దుష్టునిద్వారా వదలివేయబడ్డావని కూడా తెలుసు."

దలనీ కన్నీటి ప్రవాహం మరల జాలువారింది. "నువ్విప్పుడు ఎక్కడికి వెళ్తావ్." అని అడిగాడు ఆగంతకుడు.

దలనీ భయం కాస్తాపోయింది. భయం పోవటానికి తగిన కారణం దొరికింది దలనీకి "ఎక్కడికి వెళ్తాను? నేను వెళ్ళే ప్రదేశమేదీ లేదు. ఒకచోటికి వెళ్ళాలి, కానీ అది చాలా దూరం. నన్ను అక్కడికి ఎవరు తీసుకువెళ్తారు?" అని అంది.

"నవాబువద్దకు వెళ్ళాలనే మోహం వదలివెయి" అన్నాడు ఆగంతకుడు.

దలనీ ఉత్సాహంగా, "ఎందుకని?" అని అడిగింది.

"అశుభం కలుగుతుంది."

దలనీ భయపడింది. "జరగనీ అదితప్ప నాకు మరెక్కడా చోటులేదు. ఇతరచోట్ల శుభంజరిగేదానికంటు భర్తసన్నిధిలో అశుభం జరగటం మంచిది."

"అయితేలే, బయలుదేరు నేను నిన్ను ముష్కిదాబాదు మహమ్మద్ తకీ వద్దకుపంపుతాను ఆతడు నిన్ను నవాబు చెంతకు చేరుస్తాడు. నామాటవిను నువ్వు, ఇప్పటికే యుద్ధం ప్రారంభమైంది. నవాబు నగరంలోని జనాన్ని సహోదాను కోటకు పంపే ఏర్పాట్లు చేస్తున్నారు: నువక్కడికి వెళ్ళవద్దు."

"నా అదృష్టంలో ఏమి వ్రాసిఉన్నా, నేను వెళ్ళి తీరాల్సిందే."

"ముందేమి చూచే అదృష్టం లేదు నీనొసట."

దలనీ విచారంలో మునిగిపోయింది. "ముందేమి జరుగుతుందో ఎవరికి తెలుసు? వెళ్దాం బయలుదేరండి, మీవెంట ముష్కిదాబాదు వస్తాను. ప్రాణాలున్నంతవరకు నవాబును

చూడాలనే కోర్కె వదులుకోను."

"అది తెలుసు నాకు బయల్దేరు."

ఆ ఇద్దరూ అంధకారంలో ముగ్ధి దాబామకు బయలు దేరారు. దలనీ అనే కటకం అగ్నిముఖాన్ని చూడగోరింది.

177

# ఆరవ అధ్యాయం

ఇంతకుముందు చెప్పని విషయాలన్ని ఇక్కడ కొంచెం సంక్షిప్తంగా చెప్పి ముగిస్తాను. మొదట బ్రహ్మచారి అనుకున్న వ్యక్తే చంద్రశేఖరుడని తెలిసిపోయింది.

ఫాస్టరు వెంట అమియట్ ముంగేరునుంచి బయలుదేరి వెళ్ళినప్పుడు, ఆ రోజుననే పరిశోధించి రామానందస్వామి, ఫాస్టరు, దలనీ వగైరాలు అమియట్ వెంట వెళ్ళారని తెలుసుకున్నాడు. గంగాతీరాన చంద్రశేఖరుణ్ణి చూచి ఈ విషయం అతనితో చెప్పాడు—"ఇక్కడ నువ్వుండి ప్రయోజనమేముంది? ఏమీలేదు. నీ దేశానికి తిరిగి వెళ్ళు. శైవలినిని నేను కాశీకి పంపుతాను. నువ్వు స్వీకరించిన పరోపకార వ్రతాన్ని నేటినుంచే ఆరంభించు. ఈ ముస్లిం కన్య ధర్మపరాయణురాలు, ప్రస్తుతంఆపదలోచిక్కుకొనివుంది, నువ్వామె వెంట వెళ్ళు; నువ్వెప్పుడైనా సరే ఆమెను ఉద్ధరించు. ప్రతాప్‌కూడా నీకు ఆత్మీయుడు, ఉపకారి; నీ గురించి అతను దుర్దశాగ్రస్తుడయ్యాడు, అతడ్నిప్పుడే వదలలేవు. వాళ్ళందర్నీ వెన్నంటి వెళ్ళు" అని చెప్పాడు రామానందస్వామి. చంద్రశేఖరుడు నవాబుకెరింగించాలనుకున్నాడు కానీ రామానందుడు వారించాడు; "అక్కడికి వార్త నేను పంపిస్తాను" అని చెప్పాడు. చంద్రశేఖరుడు గురుదేవుని ఆజ్ఞానుసారం ఒక చిన్న నావలో అమియట్‌ను వెన్నంటి పోసాగాడు. రామానందస్వామికూడా శైవలినిని కాశీకి పంపుటకు తగిన శిష్యుల్ని వెదకటంలో మునిగిపోయాడు. శైవలిని వేరొకనావలో అమి

యట్‌ను వెన్నంటి వెళ్తుందని రామానందస్వామికి ఆకస్మికంగా తెలియవచ్చింది. రామానందస్వామి సందేహంలో పడి పోయాడు. ఆ పాపాత్మురాలు తరుముతూ వుందెవర్ని? ఫాస్టర్‌నా? చంద్రశేఖర్‌నా? "చంద్రశేఖరుని నిమిత్తం నేను తిరిగి ప్రాపంచిక విషయాల్లో దిగాలనుకుంటాను" అని ఆలోచించాడు స్వామి. ఇదే యోచించి అతడుకూడా ఆ మార్గాన్నే బయలుదేరాడు. రామానందస్వామి కాలి నడకనే దేశ విదేశయాత్రలు చేశాడు—గొప్పసన్యాసి. అతడు తీరానే కాలినడకనే త్వరత్వరగా శైవలిని వెనుకకు చేరుకున్నాడు. ఆయన ముఖ్యంగా—ఆహారము, నిద్రకు వశ్యుడు కాడు, అభ్యాసం వల్ల ఆయన అన్నీ జయించాడు. వచ్చి చంద్రశేఖరుణ్ని కలుసుకున్నాడు. ఒక్కున రామానందస్వామినిచూచి చంద్రశేఖరుడు దగ్గరకువచ్చి నమస్కరించాడు.

"ఒక పర్యాయం నవద్వీపంలో ఉపాధ్యాయులతో ప్రసంగించటానికి వంగదేశం వెళ్ళాలని కోర్కెగావుంది; నీ వెంట వస్తాను పద" అన్నాడు రామానందస్వామి. తాను కూడా చంద్రశేఖరుని నావపై బయలుదేరాడు. ఆంగ్లేయుల నావల్ని చూచి వారు తమ చిన్ననావను ఏకాంతంలో ఆపి ఒడ్డును చేరుకున్నారు. శైవలిని నావకూడా తీరమందు నిర్జన ప్రదేశంలో ఆగివుండటం గమనించారు. వారిద్దరూ తీరాన దాగివుండి జరిగేదంతా చూడసాగారు. శైవలిని ప్రతాపుణ్ని ఈడుకొని పారిపోవటంకూడా గమనించారు. తరువాత వారు నావపై నెక్కి పారిపోవటం గమనించి వీరిద్దరుకూడా కొంచెం దూరంగా తమనావలో వారి వెనుకనే వెళ్ళసాగారు. వారి

నావ తీరాన ఆగటం చూచి కొద్దిదూరాన తమ నావనుకూడా ఆపివేశారు. రామానందస్వామి అపంత బుద్ధిశాలి వ్యక్తి; ఈదుచున్నప్పుడు శైవలిని ప్రతాప్‌కు జరిగిన సంభాషణేమైనా వినగలిగావా ?" అని అడిగాడు చంద్రశేఖరుణ్ణి.

"లేదు"

అయితే, ఇవాళరాత్రి నిద్రించకు. వారిద్దర్నీ కనిపెట్టి వుండు" అని చెప్పాడు. ఇద్దరూ మేల్కొనే వున్నారు. రాత్రి అంతిమ యామమందు శైవలిని నావలోనుంచి తీరానికి చేరుకుంది. తరువాత తీరమందున్న అడవిలో అదృశ్యమై పోయింది. ఉదయమైనా తిరిగి రాలేదు. అప్పుడు రామానందస్వామి "ఏమీ బోధపడటంలేదు, ఆమె మనస్సులో ఏముందో ఏమో. ఆమెను వెంబడిద్దాం పద !" అన్నాడు.

అప్పుడు ఇద్దరూ జాగ్రత్తగా ఆమెను వెంబడించారు. సంధ్యాసమయాన మేఘాలను చూచి రామానందస్వామి "నీ బాహువుల్లో ఎంత బలముంది ?" అని అడిగాడు.

చంద్రశేఖరుడు నవ్వి ఒక పెద్ద బండనెత్తి దూరంగా విసిరి వేశాడు.

"మంచిదే. శైవలిని చెంతకు వెళ్ళి దాగి కూర్చో. రాబోవు తుఫానులో సహాయం లేకపోతే స్త్రీహత్య జరుగుతుంది. సమీపంలో ఒక గుహ వుంది, దాని మార్గం తెలుసు నాకు. నేను చెప్పినప్పుడు శైవలినిని ఎత్తుకొని నా వెనుక నేరా!" అని చెప్పాడు రామానందస్వామి.

"ఇప్పటి కిప్పుడే గాఢాంధకారం ముంచుకొస్తుంది. మార్గమెలా కన్పిస్తుంది ?"

"నేను దగ్గరగానే వుంటాను. నేను నా దండాన్ని ఒక ప్రక్క నీ చేతికిస్తాను, ఒక కొన నా చేతిలో వుంటుంది."

శైవలినిని గుహాలోకి చేర్చి చంద్రశేఖరుడు సెలువలకు రాగానే రామానందస్వామి "నేనింతకాలం ఎన్నో శాస్త్రాలు చదివాను, ఎంతోమంది మనుష్యులతో మాట్లాడాను, కానీ అన్నీ వ్యర్థం. ఈ బాలిక మనస్సులోని విషయాన్ని గ్రహించలేకపోయాను. ఈ సముద్రానికి అంతు లేదా?" అని యోచించి చంద్రశేఖరునితో "ఇక్కడికి దగ్గరలో పర్వత ప్రాంతపు మఠం ఒకటుంది. ఇవ్వాళ్టికి నువ్వు అక్కడే విశ్రమించు. శైవలిని విషయంలో కర్తవ్యాలన్నీ నెరవేర్చిన తరువాత నువ్వు ఆ ముస్లిం కన్యవెంట వెళ్ళాలి. పరహితం తప్ప నీకు మరో వ్రతం లేదని మనస్సులో గ్రహించు. శైవలినిని గురించి ఏమీ చింతించకు, నేనిక్కడే వుంటాను. నా అనుమతి లేకుండా మాత్రం నువ్వు శైవలినిని కలుసుకోగూడదు, నువ్వు నా ఉద్దేశ్యాల ప్రకారం నడుచుకుంటే శైవలినికి చాలా మేలు కలుగుతుంది.

ఆమాట విని చంద్రశేఖరుడు శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. ఆ తర్వాత రామానందస్వామి గుహాలోని అంధకారంలో దాగి కూర్చున్నాడు.

ఆ తరువాత జరిగినదంతా పాఠకులకు తెలిసిన విషయమే.

ఉన్మాదగ్రస్తమైన శైవలినిని చంద్రశేఖరుడు ఆ మఠానికే తీసుకొని వచ్చాడు. ఏడ్చుచూ "గురుదేవా! ఏమిటిది?" అని అడిగాడు రామానందస్వామిని.

రామానందస్వామి శైవలిని స్థితిని పరిశీలనగా చూచి నవ్వుతూ "మంచిపనే జరిగింది. విచారించకు. నువ్విక్కడ రెండు మూడు రోజులు విశ్రాంతి తీసుకో. తర్వాత ఈమెను వెంటతీసుకొని మీ గ్రామానికి వెళ్ళిపో. ఈమె నివసించిన ఇంటిలోనే వుంచు. ఈమె స్నేహితురాండ్రుగా వున్న వాళ్ళం దర్ని ఎప్పుడూ దగ్గరే వుండవల్సిందిగా కోరుకో. మధ్య మధ్య అక్కడకు వస్తూవుండమని చెప్పు, నేనుకూడా నీ దగ్గరకే వస్తాను" అని అన్నాడు.

గురుదేవుని ఆదేశానుసారంగా చంద్రశేఖరుడు శైవ లినిని ఇంటికి తీసుకొని వచ్చాడు.

## 2

ఆంగ్లేయులతో యుద్ధం ప్రారంభమైంది. మీర్ కాశిం పతనం ప్రారంభమైంది. మీర్ కాశిం అంతకుముందే కటిహారు యుద్ధంలో ఓడిపోయాడు. ఆ తర్వాత గుర్గన్ ఖాన్ అవిశ్వాసం వ్యక్తమవసాగింది. నవాబుకు మిగిలివున్న ఆశకూడా అంత రించింది ఇదేసమయాన నవాబు బుద్ధి వక్రించసాగింది. బంధిం చిన ఆంగ్లేయుల్ని చంపాలని ఆలోచించాడు. మిగిలిన అందరి యెడ కూడా దుర్మార్గంగా వ్యవహరించసాగాడు. అదే సమ యానికి మహమ్మద్ తకీ దలనీని గురించి పంపిన సమాచారం అందింది. అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. ఆంగ్లేయులు అవిశ్వాసపరులైపోయారు – సైన్యాధిపతి అవిశ్వాసిగా కన్పిస్తు న్నాడు – రాజ్యలక్ష్మి విశ్వాసఘాతకురాలైంది – మరి దలనీ

కూడా విశ్వాసఘాతకిగ్గియైందా ? భరించలేకపోయాడిక. "దల
నీని ఇక్కడకు పంపవలసిన అవసరంలేదు, విషం యిచ్చి
ఆమెను అక్కడే చంపివేయండి!" అని మీర్ కాశిం మహ
మ్మద్ తకీకి తెలియజేశాడు.

మహమ్మద్ తకీ విషపాత్ర తీసుకొని దలనీవద్దకు
వచ్చాడు. మహమ్మద్ తకీ తనవద్దకు రావటం చూచి దలనీకి
ఆశ్చర్యం కల్గింది. ఆగ్రహంతో "ఏమిటి ఖాన్‌గారూ ? నన్ను
అగౌరవ పరుస్తున్నారు ?" అని అంది.

మహమ్మద్ తకీ తలబాదుకుంటూ "అదృష్టము,
నవాబుగారు మీపై చాల కోపంగా వున్నారు" అని అన్నాడు.

దలనీ నవ్వుతూ "అని మీ కెవరు చెప్పారు ?" అని
అడిగింది.

"నమ్మకం లేకపోతే, నవాబుగారి పర్మానా చూడండి!"
అన్నాడు తకీ.

"అంటే మీరు పర్మానా చదవలేకపోయరా ?"

మహమ్మద్ తకీ, నవాబుగారి ముద్రవేసివున్న పర్మా
నాను చదవమని ఆమె చేతికిచ్చాడు. దలనీ పర్మానాను చదివి
దూరంగా విసరికొట్టింది. "ఇదంతా మోసం. నావద్ద రహస్యం
ఎందుకు ? చస్తాననా ?" అంది దలనీ.

"మీరేమీ భయపడకండి. నేను మిమ్మల్ని రక్షించ
గలను."

"ఓహో ! నీకు కొంత స్వార్థముందన్నమాట ! బూట
కపు పర్వానా తెచ్చి నన్ను భయపెట్టాలనుకుంటున్నావా ?"

"అయితే వినండి. మీరు ఆమియట్ దొరకు ఉంపుడు

గత్తెగా వున్నారని నేను నవాబుగారికి తెలియజేశాను. అందు కనే ఈ ఆదేశం వచ్చింది.''

ఆమాట వినగానే దలనీముఖం చిట్లించింది. స్థిరమైన జలం గల లోలాట గంగలో కెరటాలు లేచాయి - కను బొమ్మల ధనుస్సుపై విచారపు నారిని బిగించింది - మహమ్మద్ తకీ ప్రమాదాన్ని గుర్తించాడు. ''ఎందుకు వ్రాశావ్?'' అని అడిగింది దలనీ. మహమ్మద్ తకీ జరిగిన విషయంమంతా తెలియజేశాడు.

''ఏదీ, పర్మానా మరొక పర్యాయం చూస్తాను'' అంది దలనీ.

తకీ పర్మానాను మరల ఆమె చేతికిచ్చాడు. దలనీ పరిశీలించి చూచింది, మోసపు పర్మానా కాదది. ''విషం ఎక్కడ ?'' అని అడిగింది. ''విషం ఎక్కడ ?'' అనే మాట విని తకీకి ఆశ్చర్యం కల్గింది - ''విషం ఎందుకు ?'' అన్నాడు.

''పర్మానాలోని ఆదేశ మేమిటి ?''

''మీకు విషం యిచ్చి చంపమని వుంది.''

''అయితే మరి విషం ఏది ?''

''మీరు విషం త్రాగుతారా ఏం ?''

''నా రాజు ఆదేశం నేనెందుకు నెరవేర్చను ?''

ముహమ్మద్ తకీ లోలోపల చాలా సిగ్గుతో చచ్చిపోయాడు. ''జరిగిందేదో జరిగిపోయింది, మీరు విషం త్రాగ నవసరంలేదు. నేను దానికేదో ఉపాయం ఆలోచిస్తాను.''

దలనీ కళ్ళనుండి నిప్పులు కురుస్తున్నాయి. ఆచిన్న దేహాన్నే పెద్దదిచేసి లేచి నిల్చుంది. ''నీవంటి పాపిని ప్రాణ

బిక్షు అడిగేవారు నీకంటే పాపులవుతారు— విషం తీసుకురా!" అని అంది.

మహమ్మద్ తకీ దలనీవంక చూడసాగాడు. నవ యౌవ్వనవతి — ఆమె అవయవాలన్నీ యౌవ్వనం వర్షించి సౌందర్యపునది నిండి ప్రవహిస్తోంది. పూర్ణవసంతంలో అవయవాల మొగ్గలన్నీ వికసించాయి — వసంతము, వక్షము రెండూ ఐక్యమైపోయాయి. ఎవర్నిచూస్తే వాళ్లే దుఃఖంతో కుమిలిపోతున్నారు. కానీ చూచి ఎంతసుఖం కల్గిందినాకు! ఓ పరమాత్మా! నువ్వు దుఃఖాన్నింత అందంగా ఎందుకు సృష్టించావయ్యా? ఆపదలో సతమతమయ్యే ఆబాలిక — తుఫానులో బాధపడ్డ వికసించిన ఆ పుష్పం — కెరటాలతో కొట్టుకొనే ఆ ఆటపడవ — ఏమిచేసుకుంటాను తీసుకొని? ఎక్కడ దాచుకోగలను?" అనుకున్నాడు తకీ.

శైతానువచ్చి తకీ చెవిలో మెల్లగా "హృదయం లోపల" అని చెప్పాడు.

"ఓసుందరీ! నన్ను స్వీకరించు! నామాట విను! విషం త్రాగనవసరం లేదు" అన్నాడు తకీ.

వినగానే దలనీ అన్నమాటలు వ్రాయటానికి సిగ్గుగా వుంది — తకీని కాలితో తన్నింది.

తకీనుంచి ఆమెకు విషం లభించలేదు — అతను అర్థ నిమీలిత నేత్రాలతో దలనీనిచూస్తూ నెమ్మదిగా అక్కడినుండి వెళ్ళిపోయాడు.

అప్పుడిహ దలనీ క్రిందదొర్లుతూ విలపించసాగింది. "ఓ శాహంశాహా! ఓ చక్రవర్తులకు చక్రవర్తీ! ఈ పేద

బానిసకు ఏమి ఆదేశించావయ్యా? విషం తాగనా? నువ్వే ఆదేశించివుంటే ఎందుకు త్రాగను? నీవల్ల గౌరవం పొందటమే నాకు అమృతంతో సమానము, నీకోపమే నాకు విషంవంటిది. నువ్వు కోపగించావంటే నేను విషం త్రాగేస్తాను. విషం త్రాగితే ఇంతకంటె ఎక్కువ బాధేం కల్గుతుంది? ఓ బాద్‌శాహ ప్రపంచపు కాంతిపుంజమా! అనాథరక్షకా! భగవంతుని ప్రతినిధీ! దయాసముద్రుడా! ఎక్కడ వుండిపోయావయ్యా? నీ ఆజ్ఞ అయితే నవ్వుతూ నవ్వుతూ విషం సేవిస్తాను. కానీ, నువ్వు ఎదురుగా నిలబడి చూడకపోవటమే నాకు దుఃఖం కల్గుతోంది.

దలనీబేగం దగ్గర కరీమన్ అనేదాసీ నియమించబడింది. దలనీ ఆమెను పిలిచి మిగిలివున్న నగలన్నీ తీసి ఆమెచేతికిచ్చి "ఎవరికి తెలియకుండా వైద్యునివద్దకు వెళ్ళి మళ్ళీ లేవకుండా నిద్రపోయే మందు తెచ్చిపెట్టు. ఈ నగలు అమ్మి వెలచెల్లించు. మిగిలినది నువ్వుతీసుకో" అని చెప్పింది.

కరీమన్, దలనీబేగం కన్నీటినిచూచి అగ్రంచేసుకొంది. ముందు ఆమె అంగీకరించలేదు — దలనీ బలవంతం చేయగా చివరికా ముష్కురాలు ధనాశచే అంగీకరించింది.

వైద్యుడు ఔషధం ఇచ్చాడు; వార్తాహరుడు వచ్చి ముహమ్మద్ తకీకి కరీమ్‌దాసీ మిర్జాహబీబ్ వైద్యుని వద్దనుంచి విషం కొని తెచ్చింది" అని తెలియజేశాడు.

మహమ్మద్ తకీ కరీమన్‌ను బంధించాడు. ఆమె దలనీ బేగంకు విషం తెచ్చి యిచ్చాను" అని అంగీకరించింది.

అదివిని తకీ దలనీ వద్దకువచ్చి చూచేసరికి దలనీ ఆసనంపై కూర్చుని తలపైకెత్తి పైకిచూస్తూ చేతులు జోడించి

కూర్చునివుంది. వికసించిన కమలదళములవలె వున్న నేత్రాల నుంచి కన్నీటిధార ధరించిన వస్త్రముపై పడింది - ఎనాట ఖాళీకప్పు పడివుంది. దలనీ విషం త్రాగివేసింది.

"ఈపాత్ర ఏమిటి ?" అని అడిగాడు తకీ.

"అది విషం నేను నీవలె విశ్వాసఘాతం చేయలేను. యజమాని ఆజ్ఞను శిరసావహించి పాలిస్తున్నాను మిగిలినది త్రాగి నువ్వుకూడా నా వెంట రావటమే కర్తవ్యం."

మహమ్మద్ తకీ మౌనంగా నిల్చొని వున్నాడు. దలనీ నెమ్మదిగా నిద్రించింది. కళ్ళు మూతలు బడ్డాయి. అంతా అంధకారమై పోయింది. దలనీ వెళ్ళిపోయింది.

## 3

మీర్ కాశిం సైన్యం కటిహారు రణరంగంలో ఓడిపోయి వెనుదిరిగి వస్తోంది. రణరంగంలో తలలు తెగిపడుతున్నాయి. ఆంగ్లేయుల బాహుబలంముందు, గాలిలో దూళివలె ముస్లిం సైన్యాలు చెల్లాచెదురై పోయాయి. చావగా మిగిలిన సైన్యం పారిపోయి ఉదయానాలావద్దకు వచ్చి తలదాచుకున్నారు. అక్కడే చుట్టూ కందకాలు త్రవ్వకొని ముస్లింలు ఆంగ్లేయుల్ని ముందుకు సాగకుండా అడ్డగిస్తున్నారు.

మీర్ కాశిం స్వయంగా అక్కడికొచ్చాడు. అతను రాగానే సైయ్యద్ మీరా హసన్ వచ్చి "ఒక ఖైదీ మిమ్మల్ని కలుసుకోవాలని ఆదుర్దాపడుతోంది. ఆమె ప్రత్యేకంగా మీతో ఏదో విన్నవించుకోవాలట. ఇతరులెవ్వరికీ ఆ

విషయం తెలియనీయదట !" అని చెప్పాడు.

"ఎవరు ఆమె !"

"కలకత్తానుంచి వచ్చిన ఒక స్త్రీ. వారన్ హేస్టింగ్స్ ఉత్తరంవ్రాసి ఆమెను పంపించాడు. ఆమె వాస్తవానికి ఖైదీ కాదు. యుద్ధానికి ముందు వ్రాసిన ఉత్తరం కావటంవల్ల తీసుకున్నాము. తప్పు జరిగివుంటే ఈ బానిస మీ ముందే వున్నాడు!" అని మీర్ హాసన్ ఆఉత్తరాన్ని చదివి విన్పించాడు.

"ఈ స్త్రీ ఎవరో నాకు తెలియదు. ఈమె నావద్దకు వచ్చి చాలాప్రాధేయపడి తనకు సహాయం చేయువారు కలకత్తాలో ఎవరూ లేరని, నేను దయయుంచి నవాబుగారి వద్దకు పంపితే బ్రతికి వుండగలననీ ప్రార్థించింది. మీకు మాకు యుద్ధం జరుగనున్నది. అయినా మా ఇంగ్లీషుజాతి స్త్రీలతో తర్కించరు, అందుకనే ఈమెను మీ వద్దకు పంపుచున్నాను. మంచో చెడో నాకేమీ తెలియదు" అని వారన్ హేస్టింగ్స్ ఆ వుత్తరంలో వ్రాశాడు.

వుత్తరం విన్న తరువాత ఆ స్త్రీని తన ఎదుటకు తీసుకురావలసిందని చెప్పాడు నవాబు. సైయ్యద్ అమీర్ హాసన్ ఖైదుకు వెళ్ళి ఆ స్త్రీని వెంట తీసుకొని వచ్చాడు. చూచేసరికి ఆమె—కుల్సమ్.

నవాబు కోపంతో "ఏం కావాలి బానిసీ నీకు? చస్తావా?" అని అడిగాడు. కుల్సమ్ నవాబుకేసి రెప్పవేయకుండా చూస్తూ "నవాబుగారూ, మీ బేగంగారెక్కడ ? దిలనీబీబీ ఎక్కడున్నారు ?" అని అడిగింది.

అమీర్ హాసన్ కుల్సమ్ సంభాషణా పద్ధతిని చూచి

భయపడి నవాబుకు నమస్కరించి అక్కడనుంచి వెళ్ళి పోయాడు.

"ఆ పాపాత్మురాలున్న చోటుకే నువ్వుకూడా త్వరలో చేరుకుంటావు" అన్నాడు నవాబు.

"నేనూ, మీరుకూడా. అందుకే మీ వద్దకు వచ్చాను, దారిలో విన్నాను, దలనీబేగం ఆత్మహత్య చేసుకుందని అందరూ అదేపనిగా చెప్పుకొంటున్నారు. అది నిజమేనా ?" అని అడిగింది కుల్‌సమ్.

"ఆత్మహత్యా ! రాజాజ్ఞతోనే ఆమె మరణించింది. నువ్వామె పాపకార్యాలకు సహాయపడుతూ వచ్చావు— నిన్ను కుక్కలతో చంపిస్తాము, నీమాంసం కుక్కలకు వేస్తాం" అన్నాడు మీర్‌కాశిం.

కుల్‌సమ్ దుఃఖంతో విలపిస్తూ, నోటికివచ్చినట్లల్లా నవాబును తిట్టసాగింది. అదివిని నాలుగువైపులనుంచీ సైనికులు సలహాయుదాలు, నౌకర్లు, రక్షకులు వచ్చారు. ఒకడు కుల్‌సమ్ సిగపట్టుకొని లాక్కుపోబోయాడు, నవాబు వారించాడు— అతడు వెళ్ళిపోయాడు - నవాబు చాలా హైరానాలో పడ్డాడు.

"మీరందరూ రావటం మంచిదే అయింది. నేనొక విచిత్రమైన కథ చెప్తాను, వింటారా ? నన్నిప్పుడే వధించమని ఆదేశిస్తారు, నేను చనిపోతే ఆ కథను చెప్పేవారెవరూ వుండరు, ఇప్పుడే వినండి" అంది కుల్‌సమ్.

"వినండి, బెంగాలు, బీహారుప్రాంత నవాబు ఒక ముష్కుడు, దలనీ అనే ఆమె అతని బేగం. ఆమె సైన్యాధిపతి

గుర్గన్ ఖాన్ చెల్లెలు."

అది విన్న తరువాత కుల్సమ్‌పై ఎవ్వరూ చెయ్యి చేసుకొనుటకు ముందుకు రాలేదు — ఒకరిముఖాన్నొకరు చూచుకో సాగారు—అందరూ కుతూహలంతో వినసాగారు. నవాబుకూడా ఏమీ అనలేదు. కుల్సమ్ చెప్పుకుపోతుంది— గుర్గన్ ఖాన్, దౌలత్ ఉన్నీసాలు ఇస్ఫహాసుంచి ఏదైనా పని చేసుకుందామనే నిర్ణయంతో బెంగాలుకు వచ్చారు. దలనీ మీర్ కాశిం భవనంలో దాసీగా కుదిరినప్పుడు, ఇద్దరూ ఒకరి కొకరు సహాయం చేసుకోవాలని వాగ్దానం చేసుకున్నారు."

ఆ తర్వాత గుర్గన్ ఖాన్‌ను కలుసుకొనుటకు తామిద్దరూ కలిసివెళ్ళిన ఆ రాత్రిమొదలు జరిగిన విషయాలన్నీ వివరంగా చెప్పింది. గుర్గన్ ఖాన్‌కు దలనీకి జరిగిన సంభాషణను ఆమె దలనీద్వారా వినేవుంది, అనికూడా చెప్పింది. ఆ తరువాత అక్కడనుంచి తిరిగిరావటం. భవనంలో ప్రవేశించటానికి ఆటంకం కల్గటం, బ్రహ్మచారి సహాయము, ప్రతాపుని ఇంటివద్ద వుండటం, శైవలననుకొని దలనీని ఎత్తుకు పోవటం, నావలో ఖైదీలుగా వుండటం, అమియట్ వగైరాల మరణము, ఫాస్టరువెంట వారందరూ పారిపోవటం, చివరకు ఫాస్టరుఆమెను గంగానదీ తీరాన దింపివేయుటం మొదలగు సమాచారమంతా తెలియజేసి "నా నెత్తిమీద అప్పటికే షైతాను వున్నాడు, అందులో సందేహంలేదు. లేకపోతే అటువంటప్పుడు బేగంను ఏలా వదలి పెట్టేదానిని? అందుకు తగినశిక్షనే అనుభవించాను—బేగంను వదలి కొద్దిదూరం వచ్చి నన్నుకూడా దించి వేయమని ఫాస్టర్‌ను కోరాను— కానీ అతడు దించివేయ

లేదు. కలకత్తాలో కన్పించిన ప్రతివారినీ నన్ను ముంగేరుకు పంపమని అడిగాను. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. హేస్టింగ్స్ దొర చాలా దయగలవారని విన్నాను— వారివద్దకు వెళ్ళి విషయమంతా చెప్పి వారి కాళ్ళపై బడ్డాను - వారి దయ వల్లనే రాంగలిగాను. ఇహ మీరు నన్ను చంపే యత్నం చేయవచ్చు - ఇక [illegible] కాలనే కోర్కె కూడా లేదు'' అని చెప్పి కుల్‌సమ్ విలపించసాగింది.

వజ్రవైడూర్యముల ప్రకాశంతో విలసిల్లే అమూల్యమైన సింహాసనంపై కూర్చుని బెంగాలు నవాబు - తలవంచుకొన్నాడు. ఈ విశాల సామ్రాజ్యపు రాజదండము అతని చేతినుంచి జారిపోతోంది - ఎంత యత్నించినా భరించలేకపోయాడు, ఆ అజేయరాజ్యం యత్నమేమీ లేకుండానే వుంచగలిగేది, ఎక్కడికి పోయిందది. పుష్పాలను వదలి తాను ముళ్ళను ఎన్నుకున్నాడు — కుల్‌సమ్ చెప్పింది నిజమే - బెంగాలు నవాబు మూర్ఖుడే!

నవాబు తన సర్దారుల నుద్దేశించి ఈ విధంగా చెప్పాడు "మీరందరూ సావధానచిత్తులై వినండి, ఈ రాజ్యాన్ని నేను పరిపాలించలేను. మీవల్ల జరిగితే దానిని కాపాడండి, నే నిహ వెళ్ళిపోతున్నాను, నేను రోహితాసు కోటలో స్త్రీల మధ్య దాగివుంటాను, లేదా ఫకీరునై పోతాను." బలిష్ఠమైన నవాబు శరీరం నీటిలోవేసిన గడవలె కంపించసాగింది. కన్నీటిని ఆపుచేసుకోటానికి యత్నించాడు నవాబు." సోదరులారా! ఒకవేళ ఆంగ్లేయులు కానీ వారి సైనికులుగానీ సిరాజుద్దౌలావలె నన్నుకూడా చంపివేస్తే, నేను మీ అందర్ని కోరేదొక్క

ఏమంటే ఆ దళనీ సమాధిచెంతనే నా సమాధికూడా నిర్మిం
చండి. నేను ఎక్కువగా మాట్లాడలేక పోతున్నాను - ఇహ
మీరు వెళ్ళవచ్చు, కాని మీరు నా ఆజ్ఞను పాటిస్తే -
నేనా తనని ఒకపర్యాయం చూడాలి - అలీ ఇబ్రహీంఖాన్!"

ఇబ్రహీంఖాన్ జవాబుచెప్పాడు. "నీవంటి సేవకుడు
ఈ ప్రపంచంలో మరొకరెవరూ లేరు. నిన్ను నేను అర్థించే
దేమంటే - నన్నొకపర్యాయం తనీఖాన్‌వద్దకు తీసుకువెళ్ళు"
అని చెప్పాడు నవాబు.

ఇబ్రహీంఖాన్ సలాంచేసి డేరాబైటకువెళ్ళి గుర్రాన్నె
క్కాడు. "ఎవరైనా నాకు సాయం చేయగలరా?" అని
అడిగాడు నవాబు.

అందరూ చేతులు జోడించి నవాబుగారి ఆదేశానికి
ఎదురు చూశారు. "ఆ ఫాస్టర్‌ను ఎవరైనా తీసుకురాగలరా?"
అని అడిగాడు;

"అతడెక్కడవున్నాడు, అతడికోసం నేనిప్పుడే కల
కత్తాకు వెళ్తాను" అని చెప్పాడు అమీర్ హసన్.

"ఆ శైవలినిని ఎవరైనా తీసుకురాగలరా?" అని
నవాబుగారు ఆలోచించి అడిగాడు.

"ఆమె తప్పక ఇప్పటికి తన స్వస్థలానికి చేరి వుంటుంది.
ఆమెను నేను తీసుకొస్తాను" అన్నాడు ముహమ్మద్ ఇర్ఫాన్.

అని చెప్పి ఇర్ఫాన్ శెలవుతీసుకొని వెళ్ళిపోయాడు.
"బేగంను ముంగేరులో ఆశ్రయం ఇచ్చిన ఆ బ్రహ్మచారిని
ఎవరైనా తీసుకురాగలరా!" అని అడిగాడు నవాబు.

"అనుజ్ఞ అయితే శైవలినిని తీసుకొచ్చిన తరువాత

బ్రహ్మచారికోసం ముంగేరు వెళ్ళగలను" అన్నాడు మహమ్మద్ ఇర్ఫాన్.

"గుర్గన్ ఖాన్ ఎంతదూరానవున్నాడు!" అని అడిగాడు చివరకు నవాబు.

"సైన్యంతో సహా ఉదయానాలాకు వస్తున్నాడని తెలిసింది, కానీ ఇంతవరకు రాలేదు" అన్నారు మంత్రులు.

"సైన్యం! సైన్యమా! ఎవరిసైన్యం?" అన్నాడు నవాబు నెమ్మదిగా.

"వారిదే!" అన్నాడొకవ్యక్తి నెమ్మదిగా.

మంత్రులు వెళ్ళిపోయారు. అప్పుడు నవాబు రత్నసింహాసనంనుంచి లేచి నిల్చున్నాడు, వజ్రఖచితమైన తలపాగాను దూరంగా విసరివేశాడు, మెడలోని ముత్యాల హారాన్ని త్రెంచి పారేశాడు— రత్నాభరణాలతో నిండివున్న దుస్తుల్ని కూడా తీసివేశాడు. అప్పుడు నవాబు భూమిపైబడి దొర్లుతూ "దలనీ! దలనీ!!" అంటూ విలపించసాగాడు.

ఈ ప్రపంచంలో రాజరికం ఈ విధమైనదే.

## 4

కుల్‌సమ్ వారన్ హేస్టింగ్సును కలుసుకొన్నదని వెనుక చదివేవున్నారు. కుల్‌సమ్ తమ కథను సవిస్తరంగా తెలియజేస్తూ ఫాస్టరుయొక్క పను లన్నింటినీ ప్రత్యేకంగా తెలియ పర్చింది.

చరిత్రలో వారన్ హేస్టింగ్సు ఇతరులను బాధించే

వాడనే చెప్పారు. కార్యదక్షులైనవారు తమ కర్తవ్యాన్ననుస రించి అనేక సమయాలందు ఇతరుల్ని బాధిస్తారు కూడా. ఎవరిపై రాజ్య సంరక్షణభారం వుంటుందో వారు దయగల న్యాయప్రియులై వున్నప్పటికీ రాజ్య సంరక్షణ కొరకు ఇతరు లను తప్పనిసరిగా బాధిస్తారు. ఇద్దరు ముగ్గురు వ్యక్తులను బాధించినంతమాత్రాన రాజ్యమంతటికీ మేలుగలిగితే, అలా బాధించటమే తమ కర్తవ్యంగా భావిస్తారు వారప్పుడు. సామ్రాజ్య స్థాపనలో సమర్థుడు, దిట్టయైన వార్న్ హేస్టింగ్ దయగలవాడు, న్యాయప్రియుడు కాకుండా వుండటమనేది సంభవమైన విషయంకాదు. దయ, న్యాయప్రియత స్వభా వంగా గలవారివల్ల సామ్రాజ్య స్థాపన మహత్తర కార్యాలు జరుగవు. ఎందువల్లనంటే వారి స్వభావం ఎప్పుడూ ఉన్న తంగా వుండదు. ఇవన్నీ క్షుద్రాలోచనలు గలవారి పనులు కావు.

వార్న్ హేస్టింగ్ దయగలవాడు, న్యాయప్రియుడు, అప్పటికింకా అతడు గవర్నరు కాలేదు. కుల్‌సమ్‌ను పంపివేసి ఫాస్టరును వెదికించాడు. ఫాస్టరు చాలా బాధల్లో వున్నాడు. అతనికి మందులు ఇప్పించాడు. ఒక గొప్ప వైద్యుని చికిత్సతో అతడు త్వరలోనే ఆరోగ్యవంతుడయ్యాడు.

ఆ తర్వాత అతడు చేసిన అపరాధాలను గురించి ఆచూకీ ప్రారంభించాడు, భయపడి ఫాస్టరు వారి యెదుట తన అపరాధాలన్నీ అంగీకరించాడు. వార్న్ హేస్టింగ్స్ కౌన్సిల్‌లో తీర్మానం ప్రవేశపెట్టి ఫాస్టరును పదచ్యుతుడ్ని చేశారు. ఫాస్టరును కోర్టుముందు హాజరుపర్చాలనే హేస్టింగ్స్ అభి

ప్రాయం. కానీ సాక్షుల జాడలు తెలియవు, పైగా తాను చేసిన వాటికి ఫలితంకూడా చాలావరకు అనుభవించాడని ఆ సమస్యను అంతటితో వదలివేశారు.

ఫాస్టరు అది గ్రహించలేదు. ఫాస్టరు చాలా నీచ స్వభావం గలవ్యక్తి. తన కొద్ది అపరాధానికి చాలా పెద్ద శిక్ష విధించారని భావించాడతడు. నీచబుద్ధి గలవాడవటం వల్ల, అపరాధియైన నౌకరు స్వభావానుసారంగా అతడు తన పై అధికారులపై కక్షవహించాడు. పగతీర్చుకోవాలని కూడా నిశ్చయించుకున్నాడు.

డాయిస్ సంబర్ అనే ఒక జర్మను దేశీయుడో లేక స్విస్ దేశీయుడో కాసిం సైన్యంలో పనిచేస్తున్నాడు. అతడు సమరూ అనే పేరుతో ప్రసిద్ధి. ఉదయానాలాలోని ముస్లిం శిబిరంలో అతడు సైన్య సమేతంగా వున్నాడు. ఫాస్టరు ఉదయానాలాకు వచ్చి అతడ్ని కలుసుకున్నాడు. ముందు నేప్పుగా సమరూవద్దకు ఒక దూతను పంపాడు. ఇతనిద్వారా ఆంగ్లేయుల రహస్యాలోచనలన్నీ తెలుసుకోవచ్చునని సమరూ ఆలోచించాడు. సమరూ ఫాస్టరును చేరదీశాడు. ఫాస్టరు తన పేరు మార్చుకొని స్కాల్ కార్ట్ అనే పేరుతో సమరూవద్ద ప్రవేశించాడు. అమీర్ హసన్ ఫాస్టరును వెదుకుతూ బయలు దేరినప్పుడు ఫాస్టరు సమరూ డేరాలో వున్నాడు.

అమీరు హసను కొడుకును ఒకచోట ఉంచి ఫాస్టరును వెదుకుతూ బయలుదేరాడు. ఒక విచిత్రమైన విషయం జరిగినదని నౌకరు ద్వారా తెలిసింది ఒక ఆంగ్లేయుడు వచ్చి ముస్లిం సైన్యంలో చేరాడని, అతడు సమరూ డేరాలో

వున్నాడని తెలిసింది. అమీర్‌హాసన్ సమరూ డేరాకు వెళ్ళాడు.

అమీర్‌హాసన్ సమరు డేరాలోనికి వెళ్ళేసరికి సమరు, ఫాస్టర్‌లు కూర్చుని మాట్లాడుతున్నారు. అమీర్‌హాసన్ కూర్చున్న తరువాత సమరు ఫాస్టర్‌ను స్యాల్‌కాస్ట్ అనే పేరుతో పరిచయం చేశాడు. అమీర్‌హాసన్ జాన్ స్యాల్‌కాస్ట్‌తో సంభాషణ కుపక్రమించాడు.

పిచ్చాపాటీ మాట్లాడిన తరువాత హాసన్ "లారెన్స్ ఫాస్టర్ అనే ఆంగ్లేయుడు మీకు తెలుసా ?" అని ప్రశ్నించాడు స్యాల్‌కాస్ట్‌ను. ఫాస్టరు ముఖం ఎర్రబడింది. అతడు నేలకేసి చూస్తూ కొంచెం కోపంగా "లారెన్స్ ఫాస్టరా ? తెలియదే !" అన్నాడు.

"అతని పేరెప్పుడైనా విన్నారా ? అని అడిగాడు హాసన్.

ఫాస్టర్ కొంచెంసేపాగి "పేరా - లారెన్స్ ఫాస్టర్ - అదా ? లేదే !" అన్నాడు.

అమీర్‌హాసన్ మరేమీ మాట్లాడకుండా ఏవో ఇతర విషయాలు మాట్లాడసాగాడు. కాని స్యాల్‌కాస్ట్ ఇప్పుడంత బాగా మాట్లాడలేకపోతున్నాడు. రెండు మూడు పర్యాయాలు లేచి వెళ్ళిపోవాలని కూడా అనుకున్నాడు. ఇతనికి ఫాస్టర్‌ను గురించి తెలుసు కాని చెప్పట లేదని యోచించాడు హాసన్.

ఫాస్టర్ కాస్సేపాగి తన టోపీ తీసుకొని ధరించాడు. ఇది ఇంగ్లీషువారి నియమాలకు విరుద్ధమని హాసన్‌కు తెలుసు.

ఫాస్టరు టోపీ తీసుకుంటానికి వెళ్ళినప్పుడు అతడి తలమీది గాయపుమచ్చను గమనించాడు. అయితే స్వాల్ కాట్ ఆ మచ్చను కనపడకుండా చేయటానికే టోపీ పెట్టుకొంటున్నాడా?

అమీర్ హసన్ అక్కడినుంచి తిరిగి తన డేరాకు వచ్చి కుల్ సమ్‌ను పిలిచి తనవెంట రావల్సిందిగా చెప్పి బయలు దేరాడు.

మరల సమరు డేరాకు హసన్ కుల్ సమ్‌ను బయటనే వుంచి లోనికి వెళ్ళాడు. అప్పుడుకూడా ఫాస్టరింకా సమరూతో మాట్లాడుతూ కూర్చున్నాడు. అమీర్ హసన్ "మీపు అనుజ్ఞ యిస్తే నా దాసీ ఒకామె మీకు నమస్కరించుటకు వస్తుంది. ముఖ్యమైన పని వుంది" అన్నాడు సమరూతో.

సమరు అనుమతిచ్చాడు. ఫాస్టర్ హృదయం భయంతో కంపించింది. అతడు లేచి నిల్చున్నాడు, అమీర్ హసన్ నవ్వుతూ అతడి చేతిని పట్టుకొని కూర్చోబెట్టాడు; కుల్ సమ్ లోనికి వచ్చి ఫాస్టర్‌ను చూచి ప్రూన్పడిపోయింది.

"ఇత డెవరు?" అని అడిగాడు హసన్ కుల్ సమ్‌ను.

"లారెన్స్ ఫాస్టర్!" అని చెప్పింది కుల్ సమ్.

అమీర్ హసన్ ఫాస్టర్ చేతిని పట్టుకున్నాడు. "నేనేం చేశాను?" అని అడిగాడు ఫాస్టర్.

అమీర్ హసన్ అతనికేమీ జవాబు చెప్పకుండా సమరూ నుద్దేశించి "అయ్యా! ఇతడ్ని బంధించవల్సిందిగా నవాబుగార్తి ఆజ్ఞలున్నాయి. ఇతడ్ని తీసుకొని వెళ్ళుటకు

మీకు ఇద్దరు సైనికుల్ని సాయం పంపాలి” అని చెప్పారు.

సమరు ఆశ్చర్యంతో “విషయమేమిటి?” అని అడిగాడు.

“తర్వాత చెప్తాను” అన్నాడు హసన్.

సమరు ఇద్దరు సైనికుల్ని సహాయంగా పంపాడు, హసన్ ఫాస్టరును బంధించి తీసుకొని వెళ్ళిపోయాడు.

## 5

చాలా ప్రయాసపడి చంద్రశేఖరుడు శైవలినిని తీసుకొని స్వగ్రామానికి చేరాడు.

చాలా రోజులకు మరల నేడు వారు తమ గృహంలో కూర్చొని వున్నారు. అప్పటి కా యిల్లు అడవికంటే భయంకరంగా తయారయింది. పై కప్పుమీద గడ్డి ఏమాత్రం లేదనే చెప్పాలి, ఏ తుఫానుకో ఎగిరిపోయి వుంటుంది; కీదా ఎవరైనా ఎత్తుకుపోయివుండాలి. ఆవులు తినేసైనా వుండాలి. వాసాలను ఎవరి కందినవి వారు ఎత్తుకుపోయారు. దొడ్లో అంతా అడవివలె వుంది, సర్పాలు నిర్భయంగా తిరుగుతున్నాయి. ఇంటికివున్న ద్వారాలను, తలుపుల్ని దొంగలు ఎత్తుకుపోయారు. ఇల్లంతా బావురుమంటూవుంది - ఇంట్లో సామాను లేమీలేవు, దొంగలు ఎత్తుకొనిపోగా మిగిలినవి సుందరి తీసుకొని వెళ్ళి తమ యింట్లో దాచివుంచింది. వర్షాలవల్ల ఇల్లంతా తడిసిపోయింది. కొన్నిచోట్ల ఎండిపోయింది; మరి కొన్నిచోట్ల బురదగా వుంది. గబ్బిలాలు, ఎలుకలు సాలీళ్లు ఇల్లంతా తిరుగుతున్నాయి. చంద్రశేఖరుడు శైవలిని చేతిని పట్టుకొని ఆ యింటిలోనే కూర్చున్నాడు.

అక్కడే నిలబడి తాను పుస్తకాలన్నీ తగలబెట్టినట్లు గుర్తొచ్చింది. "శైవలినీ !" అని పిలిచాడు చంద్రశేఖరుడు.

శైవలిని ఏమీ మాట్లాటలేదు. గుమ్మంలో కూర్చొని ఎర్రగన్నేరుచెట్టుకేసి చూస్తూవుంది. చంద్రశేఖరుని మాటలకు వేటికి జవాబు చెప్పలేదామె. కళ్ళు పెద్దవిచేసుకొని చుట్టూ చూస్తోంది—మధ్యమధ్య మందహాసం చేస్తోంది. ఒకసారి పైకి విన్పించేటట్లు నవ్వి వ్రేలితో దేనికేసో చూపించింది.

చంద్రశేఖరుడు శైవలినిని తీసుకొచ్చాడనే వార్త వూరంతా పాక్కిపోయింది. చూడటానికి వస్తున్నారు చాలా మంది. అందరికంటే ముందు సుందరి వచ్చింది.

సుందరి శైవలినియొక్క ఉన్మాదస్థితిని గురించి అంతకుముందేమీ వినలేదు. రాగానే ఆమె చంద్రశేఖరునికి నమస్కరించింది. అతడి బ్రహ్మచారి వేషాన్ని చూచింది. "ఈమెను తీసుకొని రావటం మంచిపనే చేశారు అన్నయ్యా ! ప్రాయశ్చిత్తం చేయాల్సి వుంటుంది !" అని అంది, చంద్రశేఖరుడు అక్కడ వున్నప్పటికీ శైవలిని ఏమాత్రం కదలక పోవటం, ముసుగైనా ముందుకు లాక్కొనకపోవటం, పైగా సుందరిని చూచి పకపక నవ్వేయటంతో సుందరికి చాలా ఆశ్చర్యం కల్గింది. ఆంగ్లేయులతో వుండి శైవలిని వాళ్ళ మతాన్నే స్వీకరించి వుంటుందని అనుకొని సుందరి శైవలిని దగ్గరకు వెళ్ళి తాకకుండా కొంచెం దూరంగానే కూర్చుంది. "ఏం నన్ను గుర్తుబడ్తున్నావా ?" అని అడిగింది.

"పడ్తున్నాను. పార్వతివి నువ్వు."

"ఛఛ్ఛాం, ఇంకేముంది, మూడురోజులకే మర్చి

పోయావా ?" అంది సుందరి.

"ఎందుకు మర్చిపోతానండోయ్ — అదేగా నా అన్నాన్ని తాకింది నువ్వేగా, అందుకు తన్ని ఎముకలు విరగ్గొట్టేశాను నిన్న. పార్వతీదీదీ, ఒక పాట పాడవూ ?" అని అంది శైవలిని.

నా మనసులోని మాట అదే అదే,
నా కృష్ణుని సరసన వుండేవరోయీ ?
నా మేఘాల ఒడిలోన వున్న చంద్రుడెవరు,
ప్రేమ జాలమును పరచుచున్నానిదే !

సరిగ్గా పాడుతున్నానా పార్వతీదీదీ—ఎవరూ కానట్లు, ఎవరో అయినట్లుగా వుండే, అది కానట్లుంది — ఎవరో వస్తారు - ఎవరో రానే రారు — ఎక్కడినుంచో వస్తున్నానేమో, అక్కడికింకా రానేలేదు — ఎవరికోసమో వెదుకుతున్నాను, వారిని గుర్తించటమే లేదు.

సుందరికి ఆశ్చర్యం కల్గింది — చంద్రశేఖరుని ముఖం కేసి చూడసాగింది — చంద్రశేఖరుడు సుందరిని దగ్గరకు పిలచి "పిచ్చిదైపోయింది" అని చెప్పాడు ఆమె చెవిలో.

అప్పుడు అర్థమయింది సుందరికి. మౌనం వహించింది. ముందామె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి, తరువాత కనుకొలకుల్లోకి అశ్రువులు చేరాయి. నెమ్మదిగా టపటప రాలాయి కొన్ని కన్నీటి బిందువులు—సుందరి ఏడ్వసాగింది. స్త్రీ జాతే ప్రపంచపు రత్నము. ఈ సుందరే ఒకనాడు హృదయపూర్వకంగా శైవలిని నావతో పాటు మునిగి చనిపోవాలని ప్రార్థించింది. ఇవాళ శైవలినిని గురించి సుందరి కంటే ఎక్కువ

దుఃఖించేవాళ్ళూ ఎవరూ లేరు.

సుందరి నెమ్మదిగా కన్నీటిని తుడుచుకొంటూ శైవలిని వద్ద కూర్చొంది - నెమ్మదిగా మాట్లాడసాగింది - నెమ్మదిగా పూర్వపు విషయాలను గుర్తుచేయసాగింది - శైవలిని ఏమీ గుర్తుతెచ్చుకోలేక పోయింది. శైవలినియొక్క స్మృతిలోపం తగ్గటంలేదనుకుంటే పార్వతి పేరు ఎందుకు గుర్తొస్తుంది? కానీ వాస్తవ విషయాలు గుర్తురావటంలేదు. విరుద్ధంగానే గుర్తున్నాయన్నివిషయాలు. సుందరి మనస్సులో వుందికాని ఆమె సుందరిని గుర్తించలేకపోయింది.

సుందరి ముందు స్నానంచేసి భోజనం చేయవల్సిందని చంద్రశేఖరుణ్ణి తమయింటికి పంపింది; శిథిలమైన ఆ యింటిని నివాసయోగ్యంగా చేయాలని యత్నించసాగింది. అవసరమైన సామానులు ఒక్కొక్కటే రాసాగాయి.

ఇక్కడ ప్రతాప్ ముంగేరునుంచి తిరిగివచ్చి తన లారీ దళాన్ని ఒక నిశ్చిత ప్రదేశమందు ఆపి, తానొకపర్యాయం ఇంటికి వచ్చాడు. ఇంటికి వచ్చేసరికి చంద్రశేఖరుడు వచ్చిన సమాచారం తెలిసింది. వారిని చూడాలని వెంటనే వేద గ్రామానికి బయలుదేరి వచ్చాడు.

ఆ రోజునే రామానందస్వామి కూడా అక్కడకు విచ్చేశాడు. రామానందస్వామి ఉపదేశానుసారంగా చంద్ర శేఖరుడు ఔషధం ఇస్తాడని విని సుందరి చాలా సంతోషించింది. ఔషధం ప్రారంభించే శుభముహూర్తాన్ని కూడా నిర్ణయించారు.

# 6

ఆ ఔషధం ఏమిటో ఏమీ చెప్పలేము, కాని అది వాడేందుకు చంద్రశేఖరుడు ప్రత్యేకంగా ఆత్మశుద్ధి చేసుకొని వచ్చాడు. అతడు సహజంగానే జితేంద్రియుడు, ఆకలిదప్పులు మొదలైన శారీరకధర్మా లన్నింటినీ అతడు వశపర్చుకునే వున్నాడు. కానీ, ఇప్పుడు అంతకంటే కఠోర నిరహారదీక్ష వహించి వచ్చాడతడు. మనస్సును ఎన్నో రోజులవరకు ఈశ్వర ధ్యానంలో నిమగ్నంచేసి వుంచాడు— పరమార్థ చింత తప్ప అతని మనస్సులో మరి దేనికీ చోటులేదు.

నిశ్చిత సమయానికి ఔషధం ఉపయోగించాలని యత్నించసాగాడు. ఒకపరుపు వేయమని చెప్పాడు, సుందరి నియమించిన దాసీ పక్కపరిచింది.

చంద్రశేఖరుడప్పుడు శైవలినిని దానిపై పరుండబెట్ట మని చెప్పాడు. సుందరి బలవంతంగా శైవలినిని ఆ పక్కపై పరుండబెట్టింది – శైవలిని తేలికగా లొంగటంలేదు. సుందరి తర్వాత ఇంటికి వెళ్ళి ప్రతిరోజూ స్నానం చేస్తూవుండేది.

"మీరందరూ ఒకసారి బైటకు వెళ్ళిపోండి, నేను పిలవ గానే లోనికిరండి!" అని చెప్పాడు చంద్రశేఖరుడు.

అందరూ బైటకు వెళ్ళిపోయిన తర్వాత చంద్రశేఖ రుడు ఔషధపాత్రను క్రిందపెట్టి "లేచి కూర్చో. చూద్దాం!" అన్నాడు శైవలినితో.

శైవలిని నెమ్మదిగా పాటపాడ నారంభించింది, లేవ లేదు, చంద్రశేఖరుడు స్థిరదృష్టితో ఆమె కళ్ళల్లోకే చూస్తూ గుక్కెడు గుక్కెడు చొప్పున మందు త్రాగిస్తున్నాడు."

మందు మరేమో కాదు, కమండలంలోని జలమే!" అని చెప్పాడు రామానందస్వామి.

"దీనివల్ల ఏమవుతుంది?" అని అడిగాడు చంద్రశేఖరుడు.

"అమ్మాయి దీనివల్ల యోగబలాన్ని పొందుతుంది."

"అప్పుడు చంద్రశేఖరుడు ఆమె లలాటము, కళ్ళు, మొదలగు అవయవాలపై వివిధ భంగిమలతో చేతులు, తిప్పుతూ దిగదుడుస్తున్నాడు. ఈవిధంగా చేయగా చేయగా శైవలిని కళ్ళు మూతలుబడ్డాయి; క్షణంలోనే ఆమె గాఢనిద్రలో మునిగిపోయింది.

"శైవలినీ!" అని పిలిచాడు చంద్రశేఖరుడు, నిద్రలోనే శైవలిని "చెప్పండి!" అని అంది.

"నే నెవర్ని ?"

మొదటివలనే నిద్రలోనే "నాథుడ్!" అని అంది శైవలిని.

"నువ్వెవరు!"

"నేను శైవలిని."

"ఇది ఏ ప్రదేశం."

"వేదగ్రామం, మాగృహం."

"ఇంటి బైట ఎవరెవరున్నారు ?"

"ప్రతాపుడు, సుందరి, ఇంకా ఇతరులు."

"నువ్విక్కడనుంచి ఎందుకు వెళ్ళిపోయావు ?"

"ఫాస్టరు తీసుకువెళ్ళాడు."

"ఈ విషయాలన్నీ ఇంతకాలం నీకెందుకు గుర్తుకు రాలేదు?"

"గుర్తున్నాయి, సరిగా చెప్పలేకపోయాను."

"ఎందుకని?"

"నేను పిచ్చిదాన్నైపోయాను."

"నిజమేనా, లేక మోసగిస్తున్నావా?"

"నిజంగానే, మోసం చేయటం లేదు."

"ఇప్పుడో?"

"ఇప్పుడిది స్వప్నం, మీగుణంవల్ల జ్ఞానం పొందాను."

"అయితే నిజం చెప్తావా?"

"చెప్తాను."

"నువ్వు శాస్త్రులవెంట ఎందుకు వెళ్ళావు?"

"ప్రతాపునికోసం."

చంద్రశేఖరుడు ప్రశ్నోత్తరాలు, వ్యాఖ్యలలో సర్వ విషయాలన్నీ పరిశీలించి చూశాడు

"ప్రతాప్ నీకు జారుడా?" అని అడిగాడు.

"ఛీ! ఛీ!" అంది శైవలిని.

"అయితే మరెవరు?"

"మేము ఒకే కొమ్మమీది రెండు పుష్పాలము. ఒకే ఉద్యానంలో వికసించాం, మమ్మల్ని తుంచి ఎందుకు వేరు చేశారు?"

చంద్రశేఖరుడు దీర్ఘంగా నిట్టూర్చాడు. అతడి అపార బుద్ధికి అందని విషయమేదీ లేదు. "ప్రతాపుడు ఆంగ్లేయుల నావనుంచి పారిపోయినప్పుడు ఈదటం గుర్తుందా?

"గుర్తుంది"

"ఏమేమి సంభాషణ జరిగింది"

శైవలిని క్లుప్తంగా అంతా చెప్పింది, విని చంద్రశేఖరుడు లోలోనే ప్రతాప్‌ను ప్రశంసించాడు. "అయితే నువ్వు ఫాస్టరు వెంట ఎందుకున్నావు!"

"వున్నానంతే. పురంధరపురం వెళ్తే ప్రతాప్‌ను కలుసుకోగలననే ఆశతోనే వున్నాను"

"ఉన్నానేలఅంటున్నావు. అంటే నువ్వు పవిత్రంగానే వున్నావా ?

మనస్సులో ప్రతాప్‌కు ఆత్మసమర్పణ కావించాను. — అందువల్ల నేను మహాపాపాత్మురాలను - పవిత్రురాలను గాదు."

"అలా లేకపోతే?"

"అలా లేకపోతే పూర్తిగా పతివ్రతనే."

"ఫాస్టరు విషయంలో ?"

"శరీరము, ఆత్మ. వాక్కు- అన్ని విధాలా పవిత్రురాలనే."

చంద్రశేఖరుడు తీక్షణంగా చూచి చేతిని ఊపుతూ "నిజం చెప్పు" అన్నాడు.

నిద్రించిన యువతి కనుబొమ ఎగురవేసి "నిజమే చెప్తున్నాను" అని అంది.

"బ్రాహ్మణ స్త్రీవై యుండి జాతి భ్రష్టురాలగుటకు యెందుకు వెళ్ళావు?" అని అడిగాడు చంద్రశేఖరుడు నిట్టూరుస్తూ.

"మీకు శాస్త్రాలన్నీ తెలుసు. నా జాతి చెడిపోయిందో లేదో మీరే చెప్పండి. నేను వారి ఆహారం తినలేదు, వారు తాకిన నీటినికూడా త్రాగలేదు. రోజూ

స్వయంగా వండుకొని తినేదానిని, ఒక హిందూ దాసీ వుండేది. ఒకే నావలో వున్నాం, కానీ అది గంగానదిలో.''

చంద్రశేఖరుడు తలవంచుకొని కూర్చున్నాడు. చాలా ఆలోచించాడు - ''అయ్యో - అయ్యో! ఏమి పాడుపని చేశాను - స్త్రీ హత్య చేసేవాడినే'' అని కొద్దిక్షణాలాగి ఈ విషయాలు ఎవరితోనూ ఎందుకు చెప్పలేదు ?''

''నా మాటల్ని ఎవరు విశ్వసిస్తారు ?''

''ఈ విషయాలన్నీ ఎవరికి తెలుసు ?''

''ఫాస్టరుకు, పార్వతికి.''

''పార్వతి ఎక్కడుంది ?''

''ఒక నెలరోజుల క్రితం ముంగేరులో చనిపోయింది.''

''ఫాస్టరు ఎక్కడున్నాడు ?''

''ఉదయానాలా నవాబు గుడారంలో.''

చంద్రశేఖరుడు కాస్సేపు ఆలోచించి ''నీ రోగ నివారణకు మార్గం ఏమిటో తెలుసా నీకు ?'' అని అడిగాడు.

''మీ యోగబలాన్ని మీరు నాకు ప్రసాదించారు— దాని కృపవల్ల తెలుసుకోగలను - మీ చరణాల స్పర్శతో మీ ఔషధంతో ఆరోగ్యవంతురాల నవుతాను.''

''ఆరోగ్యం బాగవగానే ఎక్కడకు వెళ్ళాలను కొంటున్నావు. ?

''విషం దొరికితే తిందామనుకుంటున్నాను కానీ నరకం అంటే భయంగా ఉంది.''

''చనిపోవాలని ఎందుకు అనుకుంటున్నావ్ ?''

''ఈ ప్రపంచంలో నాకు చోటెక్కడుంది ?''

"ఎందుకు లేదు, నా యిల్లు వుందిగా."

"మీరు నన్నిప్పుడిహ స్వీకరిస్తారా ?"

"ఒకవేళ స్వీకరిస్తే ?"

"అయితే శరీరాన్ని, మనస్సును మీ చరణసేవకై అర్పిస్తాను. కానీ నావల్ల మీకు కళంకం వస్తుంది."

ఇంతలో దూరాన గుర్రపు గిట్టల చప్పుడు విన్పించింది. "ఇది నా యోగబలంకాదు, రామానందస్వామి యోగబలం; ఈ పాదాలచప్పుడు ఎవరిదో చెప్పు" అన్నాడు చంద్రశేఖరుడు.

"గుర్రపు గిట్టల చప్పుడు."

"ఆ వచ్చేది ఎవరు ?"

"మహమ్మద్ ఇర్ఫాన్ - నవాబుగారి సైనికుడు."

"ఎందుకు వస్తున్నాడు ?"

"నన్ను తీసుకువెళ్ళటానికి. నవాబుగారు నన్ను చూడా లనుకుంటున్నారు."

"రేపు మనిద్దరంకూడా నవాబుగారి కొలువులో హాజ రవాలి" అని చెప్పాడు స్వామిజీ.

# 7

బెంగాలుదేశ చివరి నవాబు ఒక విశాలమైన డేరాలో కొలువుతీర్చి వున్నాడు - అంతిమరాజు ఎందుకంటే మీర్ కాశిం తర్వాత 'బెంగాలు నవాబు' అని పేరు పెట్టుకున్న వారిలో ఎవరూ పరిపాలించలేదు.

డేరాలో, వజ్రవైఢూర్యాలు, పగడాలు, ముత్యాలు, వెండి బంగారాలు పొదిగిన సింహాసనంపై నవాబు కాశిం

అలీఖాన్ ముత్యాల, వజ్రహారాలతో అలంకృతుడై, సూర్యునివలె ప్రకాశించు వజ్రకిరీటము ధరించి కొలువుతీర్చి వున్నాడు. ప్రక్కనే బానిసలుగల నారి నొకళ్లు చేతులుజోడించి నిల్చుని వున్నారు. మంత్రులు ఆదేశాన్ననుసరించి మోకరించి మౌనంగా కూర్చొని వున్నారు.

"ఖైదీలందరూ హాజరుగా వున్నారా ?" అని అడిగాడు నవాబు. ముందు లారెన్స్ పాస్టరును హాజరుపర్చవల్సిందని ఆదేశించాడు.

లారెన్స్ పాస్టరు ప్రవేశపెట్టబడగానే ఎదురుగా నిల్చున్నాడు. "ఎవరు నువ్వు ?" అని ప్రశ్నించాడు నవాబు.

ఇక తానీ పర్యాయం తప్పించుకోలేనని పాస్టరు గ్రహించాడు. "ఇంతకాలం ఆంగ్లేయులకు అపకీర్తి తెచ్చాను, ఈ పర్యాయం మాత్రం ఆంగ్లేయునివలె చస్తాను" అని యిప్పటికి గ్రహించాడు.

"నా పేరు లారెన్స్ పాస్టరు."

"నీ జాతి ఏమిటి ?"

"ఆంగ్ల జాతి."

"ఆంగ్లేయులు నాకు శత్రువులు, నీవు శత్రువువై యుండి నా డేరా కెందుకు వచ్చావు !"

"వచ్చాను, అందుకు మీ యిష్టంవచ్చినట్లు చేయండి— నేను మీ చేతుల్లో చిక్కాను. ఎందుకు వచ్చానో అడగాల్సిన పనిలేదు. అడిగినా మీకు కావల్సిన జవాబేమీరాదు."

నవాబు కోపగించుకొనక నవ్వి "నీకు భయంలేదని తెలిసింది — నిజం చెప్తావా ?" అని అడిగాడు.

"ఆంగ్లేయుడు అబద్ధం చెప్ప డెప్పుడూ."

"సరే అయితే, చూద్దాం. చంద్రశేఖరుడు వచ్చాడని చెప్పిందెవరు? వచ్చివుంటే ప్రవేశపెట్టండి."

మహమ్మద్ ఇర్ఫాన్ చంద్రశేఖరుణ్ణి ప్రవేశపెట్టాడు. నవాబు చంద్రశేఖరునికేసి చూచి "ఇతణ్ని గుర్తించగలవా?" అని అడిగాడు.

"పేరు విన్నాను, కాని గుర్తించలేను" అని చెప్పాడు చంద్రశేఖరుడు.

"దాసీ కుల్‌సమ్ ఎక్కడ?"

కుల్‌సమ్ కూడా వచ్చింది. నవాబు ఫాస్టర్‌ను చూస్తూ "ఈ దాసీని గుర్తించగలవా?" అని అడిగాడు.

"తెలుసు."

"ఎవరీమె?"

"మీ దాసీ."

ఇంతలో మహమ్మద్ ఇర్ఫాన్ తకీఖాన్‌ను బంధించి తీసుకొచ్చాడు. తకీఖాన్ ఇంతవరకు ఎవరి పక్షాన చేరాలా అనే సందిగ్ధంలో శత్రుపక్షాన చేరలేకపోయాడింతవరకు. కానీ అతణ్ని విశ్వాసఘాతకుడుగా భావించి నవాబుగారి సైన్యాధిపతులు అతణ్ని జాగ్రత్తగా కనిపెట్టేవున్నారు. అలీ ఇబ్రహీంఖాన్ అతణ్ని తేలికగా బంధించి తీసుకొచ్చాడు.

నవాబు తకీఖాన్ వంక చూడకుండానే "కుల్‌సమ్! నువ్వు ముంగేరునుంచి కలకత్తా ఎలా వెళ్ళావో చెప్పు" అని అడిగాడు.

కుల్‌సమ్ విషయాలన్నీ వివరంగా చెప్పింది. దలనీబేగం

కథంతా చెప్పింది. చెప్పిన తరువాత చేతులు జోడించి ఏడ్చుచూ "మహారాజా! నే నీ నిండుకొలువులో స్త్రీని హత్యచేసిన పాపి, ఆ హంతకుడు ఈ తకీఖానేనని మనవి చేస్తున్నాను, అనుమతి నివ్వండి. ఇతడు నా యజమాని భార్యపై కళంకమాపాదించి నా యజమానిని మోసగించి ప్రపంచ స్త్రీలలో రత్నంవంటి దలనీబేగంను చావుకు కారణ మయ్యాడు. మహారాజా! ఈ నీచుడ్ని కూడా చీమవలె చంపి వేయండి" అంటూ ఉద్రేకంతో గబగబ మాట్లాడింది.

మహమ్మద్ తకీ రుద్ధకంఠంతో "అబద్ధం – నీకు సాక్ష్యం ఎవరు?" అని అడిగాడు. కుల్‌సమ్ కళ్లు పెద్దవిచేసి గర్జిస్తూ "నాకు సాక్ష్యమా! పైవంకచూడు, నా సాక్షి ఆ అల్లాయే! హృదయంపై చేయివేసుకొని చెప్పు – నా సాక్షివి నువ్వే! ఇంకా మరెవ్వరి సాక్ష్యమైనా కావాలంటే యీ ఆంగ్లేయుడ్ని అడుగు" అంది.

"ఫాస్టర్ ఈ దాసీ చెప్పింది నిజమేనా? నువ్వుకూడా ఆమిచుట్ హంలేట్ వున్నావుగా – ఆంగ్లేయులు అబద్ధం చెప్పరు గదా! అన్నాడు నవాబు.

తనకు తెలిసినంతవరకు ఫాస్టరు చెప్పాడు, దానితో దలనీబేగం పవిత్రమైనదని అందరికీ అర్థమైంది. తకీ తల వంచేసుకున్నాడు.

చంద్రశేఖరుడప్పుడు ముందుకువచ్చి "ధర్మావతారా! దాసి చెప్పిన విషయాలు సత్యమైనవే! అందుకు నేనుకూడా ఒక సాక్షినే! నేనే ఆ బ్రహ్మచారిని" అని చెప్పాడు.

కుల్‌సమ్ అతన్ని గుర్తించి "వీరే!" అని అంది.

"మహారాజా ! ఈ ఆంగ్లేయుడు సత్యవాదే అయితే మరి ఒకటి రెండు విషయాలు అడగండి" అన్నాడు చంద్రశేఖరుడు.

నవాబు గ్రహించి "సువ్వే అడుగు, దుబాసీ తర్జుమా చేసి చెప్తాడు !" అని అనుమతి నిచ్చాడు.

"చంద్రశేఖరుని పేరు విన్నానని నువ్వు చెప్పావు, ఆ చంద్రశేఖరుణ్ణి నేనే. నువ్వతని—" అని అడిగాడు చంద్రశేఖరుడు.

చంద్రశేఖరుని మాట పూర్తవకముందే ఫాస్టరు "మీ రేమీ కష్టపడవద్దు. నేను స్వతంత్రుణ్ణి. చావుకు భయపడటం లేదు నేను. ఇక్కడ ఏ ప్రశ్నకైనా జవాబు చెప్పటం చెప్పక పోవటం అనేది నా యిష్టంపై ఆధారపడి వుంది. నేను మీ ప్రశ్నలకు జవాబు చెప్పను" అని అన్నాడు.

"అయితే శైవలిని తీసుకొనిరండి!" అన్నాడు నవాబు.

శైవలినికూడా వచ్చింది. మొదట ఫాస్టరు శైవలిని గుర్తించలేక పోయాడు — శైవలిని రోగంతో, బలహీనంగా కాంతిహీనంగా, చినిగిన దుస్తులు ధరించివుంది. రేగిన జుత్తుతో దుమ్ముకొట్టుకొని వుంది. శరీరమంతా మురికి, తల నిండా దుమ్ము, సంస్కారలేక రేగివున్న జుట్టు, ముఖంలో పిచ్చిదానివలె నవ్వు—కళ్ళల్లో పిచ్చిపిచ్చి చూపులు ఫాస్టరు భయపడ్డాడు.

"ఈమెను గుర్తిస్తున్నావా ?" అని అడిగాడు నవాబు ఫాస్టర్ నుద్దేశించి.

"గుర్తిస్తున్నాను."

"ఎవరీమె ?"

"శైవలిని — చంద్రశేఖరుని భార్య."

"నువ్వెలా గుర్తించగలిగావు ?"

"మీ యిష్టం వచ్చిన శిక్ష విధించండి. నేను జవాబు చెప్పను."

"నా వుద్దేశ్యంలో కుక్కలతో చంపించటమే నీకు శిక్ష."

పాస్టర్ ముఖం వాడిపోయింది, కాళ్ళు చేతులు కంపించసాగాయి, కాస్సేపట్లో ధైర్యం కల్గింది—"నా మరణమే మీ కోర్కె అయితే, మరొకవిధంగా చంపుటకు అనుమతించండి" అన్నాడు.

"వీల్లేదు. ఈ దేశంలో ఒక పూర్వకాలపు దండన వుందట. అపరాధిని నడుములోతు గోతిలో పాతిపెట్టి, తరువాత తర్ఫీదు ఇచ్చిన కుక్కల్ని పంపి చంపిస్తారు. కుక్కలు కరచిన గాయాలపై ఉప్పు చల్లాలి. కుక్కలు సంతృప్తిగా మాంసం తిని వెళ్ళిపోతాయి, సగం తినివేసిన అపరాధి అలా భూమిలోనే వుండిపోతాడు. కుక్కలు మరల ఆకలివేయగానే తిరిగివచ్చి మిగిలిన మాంసాన్ని తినేస్తాయి. నీకు, తకీఖాన్‌కు ఆ శిక్షనే విధించాలి."

బంధించబడివున్న తకీఖాన్ బలిపశువువలె దీనంగా అరిచాడు. పాస్టరు భూమిపై మోకరించి చేతులు జోడించి భగవంతుణ్ణి ప్రార్థించసాగాడు, "ప్రభూ ! నేను నిన్నెన్నడూ పిలవలేదు, ఎన్నడూ నిన్ను గురించి ఆలోచించలేదు, ఎప్పుడూ పాపాలే చేశాను. నువ్వొకడవు అనే దెన్నడూ మనస్సు[illegible]

రానేలేదు. కానీ, నేడు నిస్సహాయుడనై నిన్ను పిలుస్తున్నాను. నిస్సహాయులకు సహాయం చేసే ఓ ప్రభూ! బలహీనులకు బలమైన ఓ ప్రభూ! నన్ను రక్షించు!" అని లోలోపలే ప్రార్థించాడు.

ఇందులో ఆశ్చర్యమేమీ లేదు, దేవుణ్ణి నమ్మనివారు కూడా ఆపదసమయాల్లో అతణ్ణి పిలుస్తూనే వుంటారు—భక్తి భావంతో పిలుస్తారు. శాస్త్రరుకూడా పిలిచాడు.

తల క్రిందికి వంచుకునే సరికి అతని దృష్టి డేరా బైటకు పోయింది. అకస్మాత్తుగా అతని దృష్టికి ఒక జటాధారి అరుణ వస్త్రములు ధరించి, తెల్లని గడ్డముతో శోభించుచు విభూతి రేఖలతో నిలబడి తనకేసి చూస్తూ వుండటం కన్పించింది. శాస్త్రరు ఆ జటాధారి కళ్ళల్లోకే చూస్తూ వుండిపోయాడు—క్రమంగా అతని చిత్తం దృష్టికి లోబడిపోయింది. నెమ్మదిగా కళ్ళు వాలిపోయాయి—గాఢ నిద్రలో అతని శరీరము వశం తప్పి పోతున్నట్లుంది, ఏదోమాట్లాడుతూ వున్నట్లు ఆ జటాధారి పురుషుని పెదవులు కదులుచున్నట్లు కన్పించాయి. నెమ్మదిగా నీటి మేఘాలవంటి గంభీరధ్వని విన్పించింది. "నేను నిన్ను కుక్కల శిక్షనుంచి రక్షిస్తాను. నేనడిగే వాటికి జవాబు చెప్పు. నువ్వు శైవలిని జారుడవా?" అని ఎవరో అడుగుతున్నట్లు విన్పించింది శాస్త్రరుకు.

శాస్త్రరు దుమ్ముతో నిండివున్న శైవలిని వైపుకు దృష్టి పోనిచ్చాడు, "కాదు నేను శైవలిని జారుడను కాదు." అని చెప్పాడు. తిరిగి గంభీరగర్జనవలె వినిపించింది ప్రశ్న. నవాబే అడిగాడో, చంద్రశేఖరుడో మరెవ్వరైనవీ శాస్త్రరు గ్రహించ

లేక పోయాడు. గంభీరంగా ప్రశ్న అడగటం మాత్రమే విన్నాడతడు." అయితే శైవలిని నీ నావలో ఎందుకుంది ?"

"నేను శైవలిని రూపాన్ని చూచి మోహించాను. ఆమెను ఇంటినుండి ఎత్తుకొని పోయాను. ఆమెకు నాయందు ఆసక్తి ఉందని ఆలోచించాను. కానిచూస్తే అటువంటిదేమీ లేదు. మొట్ట మొదట ఆమె నన్ను చూచినపుడు కత్తితీసి "నువ్వు నా గదిలోకి వస్తే ఇద్దరం చస్తాము నేను నీకు తల్లితో సమానం" అని అంది. నేనామె చెంతకు వెళ్ళ లేకపోయాను. ఆమె నెన్నడూ తాకలేదు." అని ఫాస్టరు బిగ్గరగా చెప్పాడు. అందరూ అతని మాటలు విన్నారు.

"నువ్వామెకు మ్లేచ్ఛుల ఆహారాన్ని ఏ విధంగా తిని పించావు ?" అని అడిగాడు చంద్రశేఖరుడు.

"ఆమె ఒక్కనాడైనా మా ఆహారాన్నిగానీ మేము తాకిన ఆహారాన్నిగానీ భుజించలేదు. ఆమే స్వయంగా వండు కొనేది." అని చెప్పాడు ఫాస్టరు.

"ఏమి వండుకొనేది ?"

"అన్నం మాత్రమే వండుకొనేది—అన్నంతో పాలు తప్ప మరేమీ తినేదే కాదు."

"మరి నీరో ?"

"గంగానదిలో స్వయంగా ముంచుకొనేది."

ఇంతలో అకస్మాత్తుగా ఘుఘుం, ఘుఘుం. ధుమ్. ధుమ్ అనే శబ్దం విన్పించింది.

"ఏమిటది ?" అని అడిగాడు నవాబు.

"మరేముంటుంది ? ఆంగ్లేయుల సైన్యం, - డేరాపై

దండెత్తి వచ్చారు" అన్నాడు ఇక్‌ఫాను బాధగా. ఒక్కొక్కరే డేరాలనుండి నెట్టుకుంటూ బయటకు రాసాగారు. ఆంగ్లేయుల బాణాలు 'ఘుఘుం, ఘుఘుం. ధుమ్, ధుమ్' అంటూ గర్జించ సాగాయి. ఒక పెట్టున బాణాలెన్నో భయంకరంగా గర్జిస్తూ దగ్గరకు వస్తున్నాయి. రణ దుంధుభి మ్రోగుతోంది. చుట్టూ భయంకర కోలాహలం వ్యాపించింది. గుఱ్ఱాల గిట్టల చప్పుడు, ఆయుధాల కణకణలు, సైనికుల జయఘోష, సముద్ర కెర టాల గర్జనవలె విన్పిస్తోంది. పొగమేఘాలుతో ఆకాశాన్ని కప్పే శాయి. ప్రళయంగా ముంచుకొస్తున్న తుఫానువలె వుందది. వెంటనే నవాబుగారి సైనికులు, మంత్రులు, నౌకరులు నెట్టు కొంటూ డేరాబయటకు వచ్చేశారు—కొందరు రణరంగానికి పోయారు—మరికొందరు పారి పోయారు. కుల్‌సమ్, చంద్ర శేఖరుడు శైవలిని ఫాస్టరు - వీళ్ళుకూడా బయటకు వచ్చే శారు. ఖైదీ తకీఖాన్, నవాబుమాత్రమే మిగిలి వున్నారు డేరాలో.

డేరాపై ఆంగ్లేయులు గుళ్ళవర్షం కురిపిస్తున్నారు. అదేసమయాన నవాబు ఒరలోని కత్తినిదూసి స్వహస్తంతో తకీఖాన్ గుండెల్లో పొడిచాడు. తకీ చనిపోయాడు. నవాబు కూడా డేరానుంచి బైటకు వెళ్ళిపోయాడు.

## 8

శైవలినిని తీసుకొని చంద్రశేఖరుడు బైటకు వచ్చేసరికి అక్కడ రామానందస్వామి నిలబడి వుండటం చూచారు.

"చంద్రశేఖరా! తర్వాత మరేమి చేయదలచుకున్నావ్ ?" అని అడిగాడు స్వామీజీ.

"ప్రస్తుతం ఈ ఆపదనుంచి వెలికిని ప్రాణాల నెలా కాపాడాలి ? చుట్టూ గుళ్ళవర్షం కురుస్తోంది. పొగ కమ్మి అంతా అంధకారంగా వుంది. ఎక్కడికి వెళ్తాను ?" అన్నాడు చంద్రశేఖరుడు.

"విచారించకు - ముస్లిం సైన్యం ఏ దిక్కుగా పారి పోతున్నదీ చూస్తున్నావా ? యుద్ధారంభంలోనే తిరోగమనం ప్రారంభమైనప్పుడు విజయం లభిస్తుందనే ఆశేమాత్రం ఏముం టుంది ? ఆంగ్లజాతిదే అదృష్టం—బల కౌశలాలు గల జాతి వలె కన్పిస్తోంది. ఏనాటికైనా భారతదేశాన్నంతా పాలించ గలదనే తోస్తుంది. పారిపోతున్న ఆ ముస్లిం సైన్యం వెనుకే వెళ్దాం పద ! నిన్నూ నన్నూ గురించి విచారమేలేదు, కానీ మరి వున్న విచారమంతా ఈమెను గురించే" అన్నాడు స్వామీజీ.

ముగ్గురూ పారిపోతున్న ముస్లింసైన్యం వెనుకనే బయలు దేరారు. ఇంతలో ఒక పర్వత సారంగంనుంచి అస్త్ర శస్త్రాలు ధరించిన హిందూసైన్యం యుద్ధావేశంలో మైమరచి ఆంగ్లేయుల్ని ఎదిరించటానికి రణరంగానికి బయలుదేరి వెళ్ళటం కన్పించింది. ఆ సైన్యం మధ్య వారి నాయకుడు అశ్వా రోహియై వస్తున్నాడు. అతడు ప్రతాపుడని అందరూ గుర్తిం చారు. చంద్రశేఖరుడు ప్రతాప్‌నుచూచి చాలా విచారిం చాడు, "ప్రతాప్ ! జయింపని వీకాని ఆ రణరంగానికి నువ్వెందుకు ? తిరిగి రా !" అన్నాడు చంద్రశేఖరుడు

విచారంగా.

"నేను మీ కోసమే వెతుక్కుంటూ వస్తున్నాను, మిమ్మల్ని సురక్షిత ప్రదేశానికి చేరుస్తాను రండి" అని వారి ముగ్గుర్నీ తన సైన్యం మధ్య నుంచుకొని ప్రతాప్ వెనుదిరిగి వెళ్లాడు.

పర్వత శ్రేణుల మధ్యవున్న మార్గాలన్నీ వారికి తెలిసినవే. త్వరగానే వారిని రణరంగంనుంచి చాలాదూరం తీసుకు వెళ్ళారు. వెళ్తూవెళ్తూ కొలువులో జరిగిన విషయాలన్నీ ప్రతాప్ చంద్రశేఖరునిద్వారా తెలుసుకున్నారు. ఆ తరువాత చంద్రశేఖరుడు "ప్రతాప్ ! నువ్వు ధన్యుడవు! నీకు తెలుసు. నాకుకూడ అది తెలుసు !" అన్నాడు ప్రతాప్‌తో.

ప్రతాప్ ఆశ్చర్యంతో చంద్రశేఖరునివంక చూడ సాగారు. చంద్రశేఖరుడు దుఃఖంతో "ఈమె పవిత్రురాలని ఇప్పుడు గ్రహించాను. లోకహితంకోసం ప్రాయశ్చిత్తం చేయాల్సివుంటే, అదే చేస్తాను. చేసుకొని ఈమెను ఇంటికి తీసుకొస్తాను. కానీ, ఇప్పుడిక నా అదృష్టంలో సుఖమనేది లేదు" అని అన్నాడు.

"స్వామీజీ ఔషధాల వల్ల ఫలితం లేదా ?" అని అడిగాడు ప్రతాప్.

"ఇంతవరకు ఏమీ లేదు."

ప్రతాప్ చాలా వివరించాడు. అతడి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. శైవలిని ముసుగులోనుంచి ఇదంతా చూస్తూనేవుంది – శైవలిని కొంచెం తొలగి చేతితో సైగచేసి ప్రతాప్‌ను పిలిచింది. ప్రతాప్ గుర్రంనుంచి దిగి ఆమెవద్దకు

వచ్చాడు.

ఎవరికీ విన్పించనంత నెమ్మదిగా శైవలిని "నామాట ఒకటి వింటావా ? అంత ద్వేషించేదేమీ చెప్పను" అని అంది.

ప్రతాప్ విస్మయంతో "నీపిచ్చితనం కటనా?" అని అడిగాడు.

"ఇప్పుడు మాత్రనే ఇవాళ ఉదయం లేచినప్పటినుంచి విషయాలన్నీ అర్థమవుతూనే వున్నాయి. నేను నిజంగా పిచ్చి దాన్నైపోయూనా?"

ప్రతాపుని ముఖం వికసించింది. అతని మనస్సులోని మాటను శైవలిని గ్రహించింది. "మాట్లాడకు, ఇప్పుడేమీ వద్దు, నేనే చెప్పవలసిందంతా చెప్తాను, అదీ నీ అనుజ్ఞ ననుస రించి" అని అంది.

"నా అనుమతి ఎందుకు?"

"నాభర్త నన్ను తిరిగి స్వీకరిస్తే మనస్సులోని పాపాన్ని మరల దాచుకొని వారికి, ప్రియురాలను కావటం మంచిదేనా?"

"నువ్వు చెప్పదలుస్తుందేమిటి?"

"పూర్వపు విషయాలన్నీ చెప్పి క్షమార్పణ కోరు కుంటాను."

ప్రతాప్ ఆలోచించసాగాడు; "చెప్పు, ఆశీర్వదిస్తు న్నాను! ఈ పర్యాయమైనా నీకు సుఖంకలగాలి!" అని ప్రతాప్ మౌనంగా కన్నీరు కార్చసాగాడు.

"సుఖం పొందలేను. నువ్వు ఉండగా నాకు సుఖం లేదు.

"అదెందుకని శైవలినీ?"

"నువ్వీ భూమిమీద ఉన్నంతవరకు మరల నన్నెప్పుడూ కలుసుకోవద్దు, స్త్రీజాతి మనస్సు చాలా బలహీనమైనది. ఎంతకాలం అదుపులో వుంటుందో చెప్పలేను. ఈ జన్మలో నువ్వు నన్ను కలుసుకోవద్దు."

ప్రతాప్ జవాబేమీ చెప్పలేదు. వేగంగా గుర్రాన్ని అదలించి రణరంగానికి పరుగెత్తించాడు. మెరిసె అతడిసైన్యం కూడా అతడి ననుసరించి వెళ్ళిపోయింది.

వెళ్ళేముందు చంద్రశేఖరుడు పిలచి "ఎక్కడికి వెళ్తున్నావ్?" అని అడిగాడు.

"యుద్ధానికి."

చంద్రశేఖరుడు వ్యాకులపడి బిగ్గరగా అరుస్తూ "ప్రతాప్ వెళ్ళవద్దు ఆంగ్లేయులతో యుద్ధంచేసి రక్షించుకోలేవు! వద్దు!" అని చెప్పాడు.

"పాస్టర్ ఇంకా జీవించే వున్నాడు, అతడ్ని చంపటానికే వెళ్తున్నాను" అన్నాడు ప్రతాప్.

చంద్రశేఖరుడు పరుగెత్తుకొని వెళ్లి ప్రతాపుని గుర్రం కళ్ళెం పట్టుకున్నాడు – "ఫాస్టర్‌ను చంపాల్సిన పనేముంది? దుష్టులైన వారిని ఆ పరమాత్ముడే శిక్షిస్తాడు. నువ్వు, నేనూ శిక్షించే వాళ్ళమా? నీచుడైనవాడే శత్రువును హింసిస్తాడు. ఉత్తమమానవుడు శత్రువును క్షమిస్తాడు."

ప్రతాప్ విస్మయంతో పులకించాడు, ఇటువంటి మహత్తరశక్తిని అతడు మరెవరివద్ద వినలేదు. గుర్రమునుంచి దిగి చంద్రశేఖరుని పాదధూళిని శిరమున దాల్చాడు. "మీరే

మానవ శ్రేష్ఠులు. ధన్యులు! నేను ఫ్లాస్క్‌ను వదలిపెట్టను" అని చెప్పి ప్రతాప్ మరల రణరంగానికి బయలుదేరాడు.
"ప్రతాప్! అయితే — యుద్ధక్షేత్రానికి వెళ్తుండెందుకు." అని అడిగాడు చంద్రశేఖరుడు.

ప్రతాపుడు వారివంక తిరిగి అతికోమలము, అతి మధురమైన హాసంచేసి "నా అవసరంవుంది." అని చెప్పి గుర్రాన్ని కొరడాతో కొట్టి వేగంగా సాగిపోయాడు.

అతడి నవ్వునుచూచి రామానందస్వామి ఉద్విగ్నుడై పోయాడు. "నువ్వు భార్యను తీసుకొని ఇంటికివెళ్ళు నేను గంగాస్నానానికి వెళ్తాను. ఒకటి రెండురోజుల తర్వాత కలుసు కుంటాను" అని చెప్పాడు స్వామీజీ చంద్రశేఖరునితో.

"ప్రతాప్‌ను గురించి నాకు చాలా ఆందోళనగా వుంది" అన్నాడు చంద్రశేఖర్.

"అది నేను తెలుసుకొని వస్తాను" అన్నాడు స్వామీజి వారిద్దర్ని పంపి స్వామిజీ యుద్ధరంగానికి బయలుదేరాడు. పొగతోను, గాయపడిన వారి అరుపులతో నిండివున్న రణ రంగంలో అగ్నివర్షం మధ్య స్వామీజీ ప్రతాపునికోసం వెదకసాగాడు. శవాలు గుట్టపడ్డాయి, సగం చచ్చినవాళ్ళు పూర్తిగా చనిపోయినవాళ్ళు, అవయవాలు కోల్పోయిన వాళ్ళు, 'దాహం! దాహం!' అని అరచేవాళ్ళతో నిండి వుంది. కొందరు తల్లి దండ్రుల్ని, అక్క-చెల్లెండ్రను, అన్న దమ్ముల్ని పేర్లుపెట్టి పిలుస్తున్నారు, స్వామీజీ ఆ శవాల మధ్యనే ప్రతాప్‌ను వెదికాడు, కాని కన్పించలేదు. ఎందరో అశ్వారోహులు రక్తంతో తడిసి ముగ్గయి ఆయుధాలు పారవేసి

ప్రాణాలు దక్కించుకొని పారిపోతున్నారు. వారిలో కూడా ప్రతాప్ కన్పించలేదు, అలసిపోయి స్వామీజీ ఒకచెట్టు ముదట కూర్చున్నాడు. ఎందరో మామూలు సైనికులు వట్టిచేతుల్తో ఎగరొప్పుతూ పారిపోతూ వున్నారు ఆతనిముంచే ఒక సైనికుడు పారిపోతూవుండగా రామానందస్వామి అతడ్ని పిలిచి "నువ్వు కూడా పారిపోతున్నావా! అయితే ఇకయుద్ధం చేసిందెవరు?" అని అడిగాడు.

"ఎవరూ చెయ్యలేదు. ఒక హిందువుడు మాత్రం చాలా భయంకరంగా పోరాడాడు."

"ఎక్కడున్నా డతడు?"

"అదుగో, ఆ మైదానం ఎదుటచూడండి" అని సైనికుడు పారిపోయాడు.

స్వామిజీ మైదానం దిక్కుగా బయలుదేరాడు.

యుద్ధం జరగటం లేదిహా ఆంగ్లేయుల, హిందువుల శవాలెన్నో గుట్టలుగా పడున్నాయి. స్వామీజీ వాటిలో ప్రతాప్ శవాన్ని వెదకసాగాడు. పడిపోయివున్న హిందువుల్లో ఎవరో బాధవల్ల బిగ్గరగా మూల్గాడు స్వామిజీ అతడ్ని నైటకు లాగి చూచాడు - అతడే ప్రతాప్! గాయపడి, చావసిద్ధంగా వున్నాడు, ఇంకా ప్రాణాలున్నాయి.

రామానందస్వామి జలం తెచ్చి అతనికి త్రాగించాడు. ప్రతాప్రుడు వారిని గురించి నమస్కరించటానికి యత్నించాడు కాని చేతులు పైకి లేవలేదు.

"నేనుఆశీర్వదిస్తున్నాను!ఆరోగ్యప్రాప్తిరస్తు!" అన్నాడు స్వామీజీ.

"ఆరోగ్య ప్రాప్తి! త్వరలోనే కల్గుతుంది. మీపాద ధూళిని శిరము నందుంచండి!" అన్నాడు ప్రతాప్ చాలా బాధతో.

"మేము వారించినా వినక నువ్వీ యుద్ధంలోకి ఎందు కొచ్చావ్? శైవలిని మాట ప్రకారం చేశావా!

"అలా అని మీరెందుకు అనుకొంటున్నారు!"

"నువ్వు శైవలినితో మాట్లాడు తున్నప్పుడు నీముఖం లోని భావాలను బట్టి నాకలా అనిపించింది. ఆమెపిచ్చిది కాదనీ, నిన్ను పూర్తిగా మర్చిపోలేదనే కన్పించింది నాకు."

"ఈ భూమిమీద తిరిగి తనను కలుసుకోవద్దని అంది శైవలిని. నేను జీవించివుండగా శైవలిని, చంద్రశేఖరులు సుఖపడ్తారనేది అసంభవ మనుకున్నాను. నాకు అతి ప్రియ మైన, అందరికంటే ఎక్కువగా నా హితాన్ని కోరేవారి సుఖంలో శూలంలా బ్రతికివుండటం నా కర్తవ్యం కాదనుకున్నాను. అందుకనే మీరు వారించినప్పటికీ ప్రాణత్యాగం చేయాలనే రణరంగానికి వచ్చాను. నేను బ్రతికివుంటే శైవలిని మనస్సు ఎప్పటికైనా చలించవచ్చుననే అభిప్రాయంతోనే వచ్చేశాను."

రామానందస్వామి కళ్లు చెమర్చాయి. ఇంతకుముం దెవ్వరూ రామానందస్వామి కన్నీరు కార్చటం చూడలేదు. "ఈ ప్రపంచంలో పరహిత వ్రతధారివి నువ్వొక్కడివే!

మేమందరం కపటులం! నువ్వు పరలోకంలో అనంతమైన అక్షయ సుఖాన్ననుభవిస్తావనటంలో సందేహమేమీ లేదు.''

స్వామిజీ ఒక క్షణకాలం మౌనంగా వుండి ''వత్సా! నేను నీ హృదయాన్ని గ్రహిస్తున్నాను. నువ్వు ఇంద్రియాలను జయించటం యీ బ్రహ్మాండాన్నంతా జయించటంకంటే గొప్పది. నువ్వు శైవలినిని ప్రేమిస్తూ వుండేవాడివా?'' అని అడిగాడు.

నిద్రిస్తున్న సింహం మేల్కొన్నట్లు, శవంగా పడివున్న బలిష్ఠమైన ఆ ప్రతాప్, పిచ్చివానివలె హుంకరించుచూ నువ్వేమి అర్థంచేసుకొంటావ్ సన్యాసీ! నా ప్రేమను అర్థం చేసుకొనే వాళ్ళెవరున్నా రీ ప్రపంచంలో? ఈ పదహారు సంవత్సరాలు నేను శైవలినిని ఎంతగా ప్రేమించానో ఎవరు అర్థంచేసుకుంటారు? పాపపు మనస్సుతో నే నామెను ప్రేమించలేదు - నా ప్రేమయొక్క పేరు - జీవితాన్ని త్యజించాలనే కాంక్ష. నరనరాన, అణువణువునా, ప్రతి రక్తబిందువు లోనూ, నా యీ ప్రేమ విహరిస్తూవుంది. మానవు డెప్పుడూ దానిని అర్థంచేసుకోలేడు - మానవు లెప్పుడూ దానిని తెలుసుకోలేరు - ఈ మరణ సమయాన మీ రా విషయా న్నెందుకు ప్రస్తావించారు? ఈ జన్మలో, ఈ ప్రేమలో శుభం లేదు, అని యోచించే ప్రాణాలు త్యజించారు.

నా పేరు కలుషితమైపోయిందేమో ఎలా తెలుసు - శైవలిని హృదయంలో ఇప్పుడిహ ఏం జరుగుతుందో ఎలా తెలుస్తుంది? నా మరణం తప్ప దీనికి మరో ఉపాయమేదీ

లేదు. అందుకనే చనిపోతున్నాను, దాగివున్న ఈ రహస్యాన్ని మీకు విన్నాను. మీరు జ్ఞాని. శాస్త్రాలు చదివినవారు, నా పాపానికి ప్రాయశ్చిత్తం ఏమిటో మీరే చెప్పండి. నేను పరమాత్ముని ముందు దోషినా ? ఒకవేళ దోషినే అయివుంటే ఈ ప్రాయశ్చిత్తంతో అది తొలగిపోదా ?" అని అన్నాడు.

"అదేమో ఎరుగను. మానవుని జ్ఞానం ఇక్కడ అసమర్థమైనదే, శాస్త్రాలు ఇక్కడ ఏమీ చెప్పవు. నువ్వే లోకానికి వెళ్తున్నావో, ఆ లోకంలోని ఈశ్వరుడు తప్ప ఇంద్రియాలను జయించినవాళ్ళెవరూ లేరు. ఒకవేళ పుణ్యమనేది వుంటే ఆ అనంత స్వర్గం నీదే ! మనోసంయమంలో పుణ్యమనేది వుంటే స్వర్గానికి దక్షిణను మించిన హక్కుదారు వవుతావు. మరో జన్మలో నేనుకూడా నీవలె ఇంద్రియాలను జయించేవాడి నవాలని ప్రార్థిస్తున్నాను."

రామానందస్వామి మౌనం వహించాడు. నెమ్మదిగా ప్రతాపుడు ప్రాణాలు విడిచాడు.

గడ్డిపాన్పుమీద అత్యంత నిర్మల ప్రకాశంగల స్వప్న తరువు పడిఉంది.

ప్రతాప్, వెళ్ళు ! అనంత లోకంలోకి వెళ్ళు ! ఏమీ కష్టం లేకుండా ఇంద్రియాలను జయించగలచోటుకు, రూపం యందు మోహం లేని ఆ అనంతలోకానికి వెళ్ళు. పాపానికి చోటులేని ప్రేమలోకానికి వెళ్ళు ప్రతాప్ ! రూపమూ, ప్రేమా, సుఖమూ అనంతమైన లోకానికి — ఎక్కడి

సుఖంలో అనంతమైన పుణ్యం ఉంటుందో - ఒకరి దుఃఖాలను ఒకరు గ్రహించి, పరస్పరం ఒకరి ధర్మాన్ని ఒకరు రక్షించుకుంటారో - ఒకరి విజయాన్ని ఒకరు కీర్తించుకునేచోటుకు - వ్యర్థ ప్రాణత్యాగాలు అవసరం లేనిచోటుకు - ఆ మహోత్తరమైన లోకానికి వెళ్లు ప్రతాప్! అక్కడ అనేక లక్షలమంది శైవలినిలు నీ పాదాల ముందున్నప్పటికీ వారిని నువ్వు ప్రేమించవు.

వేమన పంచాయతీ గ్రంథాలయం, తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

— సమాప్తం —

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA120B130 |
|---|---|
| పుస్తకం పేరు | శైవలిని |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 223 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1, 2 |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |